వివిన మూర్తి

# తీర్థపురాళ్ళు

(కథల సంపుటి)





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Theerthapurallu (Stories) by Vivina Murthy

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

ప్రచురణ నెం. : 2350

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి, 2003



టైటిల్ డిజైన్ : చంద్ర

వెల: రూ.70-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హిమాయత్‌నగర్, హైదరాబాద్.


నా ఆలోచనా
స్వభావానికి
ఆజ్యంపోసిన ఆత్మీయుడు
మన్నం వెంకటరాయుడు
గారికి

# కథాక్రమం





# అగ్గిపుల్ల

**అదిగో అదే తిమ్మాపురం!**

అదే ఆ వూరి మంచినీటిచెరువు. దానికి పడమటనా దక్షిణానా ఊరంతా ఉంది. ఉత్తరాన పంటపొలాలున్నాయి. తూరుపున కొద్దిమేర పంటపొలాలూ తరవాత ఊరగాలవ ఉన్నాయి. ఊరగాలవకీ, మురుగుదొడ్డి కాలవకీ మధ్యగా మాలపల్లీ ఉప్పరిగూడెమూ ఉన్నాయి. మాలపల్లిని ఆనుకునే ఉత్తరంగా మాదిగల యిళ్ళున్నాయి. తూరుపునించే ఆ మాలపల్లి మధ్యగా ఊళ్ళోకి సాగివచ్చే మట్టిరోడ్డు ఉంది.

ఆ రోజు - చుక్క పొడిచింది.

పెద్దోడు తోటకాపలానించి ఆ సమయానికే యింటికివచ్చి ఉప్పురాయితోనూ ఉల్లిపాయతోనూ చలిదిగంజి తాగాడు.

"కూంత కూకుని యెల్లగూడదా?" అంది మంగమ్మ.

మీసాలు ఓత్తుకుని, తూరుపు పొలంనించి వస్తూ తెచ్చిన పార అందుకుని జవాబివ్వకుండా బయటపడ్డాడు పెద్దోడు. మొలకి వెండితాడు, కాళ్ళకి కిర్రుచెప్పులూ, ఓ చేత బడితెకర్రా, మరో చేత పార - పొడవుగా, దృఢంగా ఉన్నాడు. పెద్దోడి నిజనామం బ్రహ్మయ్య. అయితే ఆ గ్రామంలో పెద్ద పెద్దలనించి ఆట పాపల దాకా వాడేపేర్లు "కందులబెమ్మిగాడు, మాలబెమ్మడు" యిత్యాదులు.

"పనమీదున్న సేనుకి కాపలాయెట్టు! పంటమీదున్న తోటకి కాపలాయెట్టు! యింటికాడ నీకు కంటినిండా నిద్దరట్టకపోతే నన్నడుగు!" అంటుంటాడు బ్రహ్మయ్య గూర్చి యజమాని వీర్రాఘువులు. అంత నమ్మకమూ ఉన్నా, చిన్న పొరపాటు జరిగితే "కడజాతెదవకి నీతా?" అని కూడా అనెయ్యగలడు.

నిజంగానే బ్రహ్మయ్యకి మంచిపేరే ఉంది. " పేరు సాలదంటే - జలమకి" అంటుంటాడు పెళ్ళాంతో.

అప్పుడే ఊరు నిద్రలేస్తోంది. హోటేలు రాజులు కొట్లో పిండి రుబ్బు తున్నాడు.

పొగాకు కట్ట కోసం షావుకారు బుచ్చిరాజు లోగిలి ముందు ఆగాడు బ్రహ్మయ్య.

అతగాడు విసుగ్గా పందుంపుల్ల నములుత్తూ వచ్చి, బేరం గూర్చి యింట్లోకి ఓ అరుపు అరిచి, అరుగుమీద మఠం వేసుకుని కూర్చుని తాపీగా కబుర్లు ప్రారంభించాడు.

"- అదిసరే! యింత పెందరాళే బయల్దేరావేట్రా?"

"లంకపంపుకి నీళ్ళు కట్టాలన్నాడండి యెజిమాని."

బుచ్చిరాజు నోట్లోనీళ్ళు అలాగే ఉండిపోయాయి. తేరుకుని-

"అదేంట్రా? మెరక్కాలవ వంతయితే పల్లపుగాలవ అంటావూ?"

"సెత్తం! యెజిమాని సెప్పాడండి!"

ముక్కుమీద వేలు వేసుకుని -

"అన్నన్నన్నా! ఊరుకి ఓ రీతీ రివాజూ.."

మాట మధ్యలోనే అందుకున్నాడు బ్రహ్మయ్య -

"సావుకోరయ్యా! తవఁరు యేటనుకొంటే అనుకోండి! ఊరు ఊరంతా కట్టపడిపోతన్నారని దమ్మిడీ దర తగ్గించి సరుకు అమ్మ గల్దురాండీ....? రివాజులు ఉంటాయండిమరి! సేలూ యెండిపోతాయండి! అందుకే యెవురిబాద ఆరిదండి! గొడవలంటారా! వత్తాయండి! సత్తావున్నోడు గనకనే యెలాగయినా నడగలడండి యీగ్రాగవులు బాబు...." పొగాక్కట్ట అందుకుని, వాసన జూసి, రొంటిన దోపుకుని నడిచాడు బ్రహ్మయ్య.

"యెక్కడి కెక్కడిగ్గట్టావురా మాల నాయాలా - " గొణుక్కున్నాడు బుచ్చి రాజు.

చెప్పులు తీసి చేత్తో పట్టుకుని, అరుగులమీదకూర్చుని, ముఖాలు కడుక్కుంటున్న ఒకరిద్దరికి దణ్ణాలు పెట్టుకుంటూ, పెద్దవీధి దాటాడు బ్రహ్మయ్య.

పచ్చటి వరిచేల మధ్యనుంచి అతను నడుస్తుంటే, కష్టజీవుల కాళ్ళ చెప్పులను తాకగల్గుతున్న సంబరంతో భూమి చేస్తున్న నాట్యంలా చల్లగాలికి లయగా వంగి లేస్తోంది చేను.

వంతునీరు అప్పుడే వస్తోంది. పైగుడ్డను విప్పి గట్టునపెట్టి పారతో కాలవలోకి దిగాడు. పల్లపుగాలవకి వేసి ఉన్న ఒడ్డు ముందుగా నరికేడు. మెరకకాలవలోకి నీరు ఎక్కకుండా ఒడ్డు వేసేసరికి తెల్లారిపోయింది. నీరు పల్లపుగాలవలోకి ఉత్సాహంగా పరుగులు తీస్తోంది. ఆ కాలవమ్మటే వెళ్ళి కింద

పొలాలకి పోకుండా ఒడ్డు సరిచేయటానికి మరో పావుగంట పట్టింది. నీటిని మళ్ళలోకి మళ్ళించాడు. గట్లు సరిజేశాడు. చుట్టూ తిరిగి వచ్చేసరికి ఏడయింది.

పసిపిల్లవాడు పాకుకుంటూవస్తూంటే సంబరపడే తల్లిలా నీరు నిశ్శబ్దంగా వస్తుంటే బ్రహ్మయ్య మనసు పొంగింది.

కట్ట దగ్గరకు వచ్చాడు. పొగాక్కట్ట తీసి ఆకు సరిజేసి యానెలు తీసి చివర్లు తుంపి చుట్ట చుట్టాడు. బయలుభూమికి పోతున్న అసామీ నుంచి అగ్గి సంపాదించి చుట్ట ముట్టించాడు.

మెరకకాలవ గట్టమ్మటే ఎవరో పరుగెత్తుకు వస్తున్నారు. పరకాయించి "యీరిగాడే" అని తేల్చాడు బ్రహ్మయ్య.

"యెవుర్రా కట్టేసింది?" వగరుస్తూ అన్నాడు వీరయ్య.

"నానే!"

"అదేటి, నానా! పెతీహొంతుకీ మీ బూవులే తడిత్తే యీ కాలవకిందయ్యి ఏటవుతాయి?"

"అదేవోఁ! - పల్లపుగాలవ్వొంతూ, ఊటనీళ్ళూ మిమ్మల్నే కట్టుకోమన్నాడు మా కాపు!"

"అందాకా మా బూవులెండిపోకుండా ఉంటయ్యా?"

"యెల్లి - మీ కాపునడుగు.... ఆరే సెప్తారు."

"యీ బూవులు నీయీ కావు నాయీ కావు-" అన్నాడు వీరయ్య. "మనలో మనకి గొడవేల-" అన్నాడు. "నీకిది నాయంగాదు! యెందుకు యింత దూరం సెప్పుకొస్తన్నానో కాంత నిదానించు-" అన్నాడు.

"నీటెద్దడి! ఎవురి దోవ ఆరు సూసుకుంటారు" అన్నాడు బ్రహ్మయ్య. "నువ్వు నోరు పారేసుకోవద్దు! యెల్లి మీ కాపుతో సెప్పుకో" - అన్నాడు.

దానా దీనా -

"నాను కట్ట నరుకుతాను! మీ కాపుకాడికి నువ్వే యెల్లు" అంటూ మొలమీద గుడ్డ తలకి చుట్టాడు వీరయ్య, అపళంగా బ్రహ్మయ్య లేచాడు.

"దిగు! దిగరా కాల్లోకి..." అన్నాడు బుర్ర ఊపుతూ.

"ఏం? ఏటి జేత్తావేటి?"

"సూద్దుగాని..! ముందా కాల్లో దిగి మాటాడు!"

వీరయ్య కాలవలో దిగలేదు! జోగిరాజు దగ్గరకు పరుగెత్తాడు. మెరకకాలవ కింద రైతుల్ని వెంటబెట్టుకుని వచ్చాడు జోగిరాజు. మూడుసార్లుగా పంచాయితీ బోర్డుకి మెంబరవుతున్నాడుగాని కులం బలం చాలకపోవటంవల్ల అతగాడు ప్రెసిడెంట్ కాలేకపోతున్నాడు.

"-యిప్పుడీ పళంగా నీ బుర్ర పగలబొడిసేత్తే నీకు దిక్కూ దివాణం యెవడ్రా...?" కొంతవాదన జరిగినమీదట జోగిరాజు అన్నాడు.

"అదేదో బేగీ కానీండి!"

"ఏం? బెమ్మయిద్దె అనుకుంటన్నావేట్రా?"

"ఎలాగనుకుంటానండీ! మీరు పదిమంది! నానొంటిగాణ్ణి!"

అతని జవాబులు జోగిరాజు శరీరానికి కారం పూస్తున్నాయి. తాము పది మందున్నా... పదిదెబ్బలు వెయ్యగలిగినా....

వీర్రాఘవులి సర్పంచ్‌గిరీ ధాటికి సులువుగానే తట్టుకోగలడు తను! కాని అతని ఓ తమ్ముడి బామ్మరిది రాష్ట్రంలో కేబినెట్ మినిస్టరు! యింకో తమ్ముడి మామగారు కేంద్రంలో యం.పి. ఆ కుటుంబం యింకా ఉమ్మడిగానే ఉంటోంది. అన్నదమ్ములంతా కలిసికట్టుగానే ఉంటున్నారు.

యివన్నీ జోగిరాజు మెదుడులో మెదిలాయి.

అతను కొంచెం తగ్గాడు.

"బెమ్మయ్యా! కట్ట నరకనిత్తే ఆరు కవఁతం నుంచి తప్పిస్తారని బయపడతన్నావేమో! ఆరికన్న ఏదుం ఎక్కువ కొలుస్తా! మా కవఁతంలో సేరుదువుగాని!"

"ఆ వూసులన్నీ కొత్తమాసకి సూసుకొందారి బాబయ్యా!"

"ఆరు కట్ట యెయ్యమన్నారు బెమ్మయ్యా! నువ్వు యేసావు! కాని, అది పద్దతి తప్పి జరిగింది! కట్టడి తప్పి జరిగింది! నువ్వు జేసే వుపకారం మరేటీ లేదు! మేం కట్ట తీసేత్తాం! నువ్వు ఊరుకో! మీ యజమానా? ఊళ్ళో లేడు! సిన్నోళ్ళు అడుగుతారా...? బలాతకారంగా తీసేసేరనీ, పదిమందొచ్చారనీ సెప్పు! తప్పు ఆరికిందెట్టుకుని మామీద కలబడలేరుగదా!" అంటూ చెప్పుకొచ్చాడు జోగిరాజు.

"-మాలనాయాలా! నీయమ్మా! ఆలీ...." అంటూ తిట్టాడు.

అన్నింటికీ బ్రహ్మయ్య జవాబు ఒక్కటే -

"నన్ను నరకండి! కట్ట నరకండి!"

కొన్ని కంచెలు చేలు మేస్తాయి!

కొన్ని కంచెలు చేలు కాస్తాయి!

మేసే కంచెలకు కాసే కంచెల అవసరమూ ఉంటుంది. అవి మరెవరి చేలో కాస్తున్నప్పుడు విరోధమూ ఉంటుంది.

"నీ యజమానికున్న పొగరంతా నీకుందిరా..."

ఆ మాటకి బ్రహ్మయ్య పిడికిళ్ళు బడితకర్రమీద బిగిసాయి!

"నన్నేటన్నా అనండి! తిట్టండి! ఆరినంటేమాత్రం కుదర్దు!"

"అంటాన్రా! మల్లా అంటాన్రా...."

"అన్యాదండి!"

అని చూడలేదు జోగిరాజు.

వీర్రాఘవులి చేలన్నీ తడిసాయి!

ఆ చేలు తడుపుకున్న పద్ధతిలో కొత్తేంలేదు! తనకన్న లోకువ్వాళ్ళను బుకాయించి ఎన్నోమార్లు తనూ తడుపుకున్నాడు! యిప్పుడు చాలామందికి బోరింగులున్నాయి! వంతునీళ్ళ గురించి ఎవరూ జీవన్మరణ సమస్యగా భావించటంలేదు. అందువల్లనే మూడొంతుల నీళ్ళు నోరున్నవాళ్ళకి చెందగా మిగిలినవి చిల్లరమల్లర రైతులు ఉపయోగించుకుంటున్నారు. బోరింగు నీళ్ళు పక్క పొలాలకి అమ్ముకొనేవాళ్ళు కాలవనీళ్ళ గొడవల్లో పెద్దగా ముందుకి రావటంలేదు. అందువల్లనే జోగిరాజు కోపం వీర్రాఘవుల మీద నిలిచింది.

బ్రహ్మయ్య బోటిగాళ్ళు యజమానులకోసం ప్రాణాలనయినా పణం పెట్టగలగటం ఏనాడూ ఉంది. కాని యీనాడు మారుతున్న పరిస్థితులలో జోగిరాజుకు అదే వేరువిధంగా కన్పించింది.

మాలోడు నా మాట కాదంటాడా - పుండు సలిపినట్టు సలుపుతోంది.

"గొడవ జరిగింది బెమ్మిగాడికీ నాకూనూ....! ఆడంటే కడజాతోడు. మర్సిపోతాడు! నేనో..." అనుకున్నాడు.

"యీర్రాగవులుకీ నాకూ యియ్యేల కయ్యం వుంటాది! రేపు నెయ్యం ఉంటాది! ఆరిని జూసుకుని యీడు నన్ను తీసేత్తాడా?"

"యిది యీడికొచ్చిన దొమ్మగాదు! యీడి కులానికి కొత్తగా పుట్టిన దొబ్బు!"

**మందు అమిరింది!**

జోగిరాజు అదును కోసం చూస్తున్నాడు.

ఆ రోజు రానే వచ్చింది.

ఎముకల గూడుమీద బిగుతుగా తొడిగిన రైల్వే బొగ్గుపనివాళ్ళ డాంగ్రీలాంటి చర్మం! చింపిరి జుట్టు! మెడదగ్గర తన్నుకొచ్చిన ఎముకలు! మట్టిగాజులు! మాసి చిరుగుబట్టిన కోక - ఎండు తాటిమట్టల మోపును నెత్తిన పెట్టుకునిపోతున్న ఆమె, పెద్ద మెతుకును ముక్కుతో దొర్లించుకు పోతున్న చీమలా ఉంది. ఆమె బ్రహ్మయ్య భార్య మంగమ్మ.

పశువులు పుంతమ్మటే యిళ్ళకి నడుస్తున్నాయి. కామేశంబాబుగారి కమతంలో ఉంటున్న ఆఖరి కొడుకు చెరుకు ముక్క పెడితే, అది నవుల్తూ, పశువుల వెనక నడవలేక పుంతవదిలి చేలగట్లమ్మట నడిచింది మంగమ్మ.

జోగిరాజు కొడుకు బోరింగు దగ్గర స్నానం చేస్తూ చేస్తూ గట్టమ్మట పోతున్న మంగమ్మను చూసాడు.

"ఎవుత్తే అది? బాబుగారి సొమ్ములా చెరుకులట్టుకు పోతందీ...." అంటూ అరిచాడు.

"నాను బాబయ్యా! బెమ్మడి బారియా మంగిని! యిది తవ(రి తోటలోది కాదయ్యా" నడుస్తూనే అంది.

"యేటా యిస్పాటం? నిలబడి సెప్పగూడదంటే సవ్వాదానం?"

మంగమ్మ ఆగింది.

"పొద్దోతంది బాబయ్యా!"

"యెల్దుగాన్లేయే! నువ్వు యేడనించొత్తన్నావే?" నీట్లోంచి పయికొచ్చి వళ్ళు తుడుచుకుంటూ అడిగాడు.

"నల్లజెరువు కాణ్ణించండి!"

"నల్లజెరువుకాడ నీకు సెరుకేసిందెవడే? సిన్నముక్క బాబయ్యా అంజెప్పి యెల్లిపోయేదానికి అబద్దాలా? యెదవబుద్ది! యెదవజాతి!"

"సత్తెపెమానకంగా సెపతన్నాను కొడకా! మా అయ్య కామేశం బాబుగోరి పశువులకాడ ఉంటన్నాడు! ఆడే యెట్టాడు!"

తరతరాల నుంచి అధికులమన్న నమ్మకంతో పెరుగుతున్నవాళ్ళు, పెంచబడుతున్నవాళ్ళూ తమ మాట బోటోతే ఊరుకోలేరు! ఆమె యేభయ్యేళ్ళ ముసలిది! తనతల్లికన్న పెద్దది! తను పద్నాలుగేళ్ళ గుంటడు.... - అన్న చూపు అతనికి యివ్వబడలేదు!

ఫలితంగా -

"సెరుకుముక్క తింటే తిన్నావు తప్పుకాయుమని అడిగెయ్!" అంటూ జీడిలా వదల్లేదు.

"ఏటండీ! మీ తోటలోది కాదు మొర్రో అంటే దాట్టీకం చేస్తున్నారు!" అంది ప్రాణంవిసిగి. అంతకన్న విసురుగా ముందుకు నడవబోయింది.

"నాదంటే దాష్టికం? మాలనంజా!" అంటూ వాడు మీదకు వెళ్ళాడు.

ఆ సమయానికే మంగమ్మ రెండో కొడుకు ఆ దోవన వస్తున్నాడు. కొన్నాళ్ళు అతను పట్నంలో రిక్షా తొక్కాడు! తల్లి మీదకి ఆ కుర్రాడు చెయ్యెత్తిన దృశ్యం కంటపడగానే అతనిరక్తం పోటెక్కింది. ఒక్క ఉదుటున వచ్చి ఆ చెయ్యి పట్టుకుని దించేస్తూ-

"కాపుగోరూ! తల్లిలాటిది - దానిమీదసెయ్యెత్తటం మీకు దగదు! మీకు బావ్యం కాదు!" అంటూ 'రాయే' అని తల్లిని లాక్కుపోయాడు.

మందుకి పుల్ల అమిరింది!

జరిగిన సంఘటన కడజాతోడు కుర్రాణ్ణి కొట్టడం అయింది.

జోగిరాజు అందరి ముందూ జరిగినదాన్ని విశ్లేషిస్తూ అన్నాడు - "ఆళ్ళలా తిరగబడతంటే మనం బతకలేం!"

"యియ్యేల మా బుల్లోడు అయాడు! రేపు మీ వోడు అవుతాడు. ఎల్లుండి నువ్వూ నేనూ అవుతాం! తప్పుంటే మనతో చెప్పాలి. మొక్కప్పుడు వొంగకపోతే మానయ్యాక లొంగదుగాక లొంగదు-" అన్నాడు భవిష్యత్తును సూచిస్తూ.

"బగమంతుడు ఆణ్ణి కడజాతోణ్ణి సేసినందుకు ఆడు కడవాడనే ఉండాల. అరిజనులని పేరెట్టి గవుర్నమెంటు కూడా ఆళ్ళకు వత్తాసిచ్చి నెత్తికెక్కించు కుంటింది! రేప్పొద్దుట ఆళ్ళు మనిళ్ళలో దూరేత్తారు! ఆపైన జరిగేది ఆబగమంతుడికే దెలాల" అనీ అన్నాడు.

"ఎద్దుని ముల్లుగర్రతోటే తోలాల, ఏనుగుని అంకుశవెట్టుకునే నడపాల! మాలాణ్ణి యిడదీసే యేలాల! దేనికి తగింది దానికి సెయ్యాల" అంటూ చెయ్యాల్సింది చెప్పాడు.

యిలాంటి సందర్భాలలో ఎందుకు గొడవ చెయ్యాలో ఒక్కడే మాట్లాడతాడు. 'ఎలా చెయ్యాలో' యధాశక్తి అందరూ మాట్లాడతారు. సాధారణంగా వ్యక్తుల స్వంత మనస్తత్వాలకు యిలాంటిచోట ప్రాధాన్యత ఉండదు. వారి కోమలత్వమూ, ఆలోచనాశక్తి ఒక ఊపులో ఒక ఆవేశంలో కొట్టుకుపోతాయి.

కరణంగారి కండువా చాటున, ఆ వూరి పెద్దకాలవ వారనే ఉన్న మామిడి తోటలో సారాబట్టీలున్నాయి. శ్మశానం ఆ తోటని ఆనుకునే ఉండటంవల్ల దయ్యాలు తిరుగుతుంటాయని జనం అనుకుంటూంటారు.

కొంతమంది పెద్దకాపులతో జోగిరాజు అక్కడ సమావేశమయాడు! కరణం సూర్యనారాయణమూర్తి హాజరయేడు! మాదిగలకు కబురెళ్ళింది.

"రా రా గున్నయ్యా!" అంటూ ఓ చిన్న సైజు పెద్దకాపు ఆహ్వానించాడు. గున్నయ్య మాదిగలలో నోటిమీద బ్రతుక్కొస్తున్నవాడు.

"ఒక్కో గలానుడు పొయ్యవో నూకరాజా!" జోగిరాజు హుకుం జారీ చేసాడు.

తాటాకులు చీరి దొన్నెలు తయారుచేసుకున్నారు మాదిగలు. అందరి దొన్నెలూ, కడుపులూ సారాతో నిండాయి. తలలను నింపటానికి కరణం లేచాడు.

"-నల్లజెరువులో మనవాళ్ళు వరకట్టుకున్న మాట మనకందరికీ తెలుసు. ఆ భూముల్ని వరకట్టిన మాలాళ్ళను వీర్రాఘువులుగారు పట్టాలిప్పిస్తామని - కనీసం పదేళ్ళనించనుకుంటాను - చుట్టూ తిప్పుకుంటున్నారు. ఎవరో ఒకరు బాగుపడాలనీ, ఎవరో ఒకరు కడుపునిండా తినాలనీ బ్రాహ్మణముండావాణ్ణి గనక

నేనూ కోరుకున్నాను. ఆ కోరిక మీదనే నేను చేయగలిగిందల్లా చేశాను. ఆఖరికి పైసా అయినా ఖర్చు అడక్కుండా తాలూకాఫీసుకీ యిక్కడికీ వందమార్లయినా తిరిగాను! అయితే ప్రయోజనం ఏమిటి? కడతానంటూన్న రైతూ రాక, కట్టుకోవాల్సిన ఎద్దూ రాక కాడేం జేస్తుంది? భూమేం దున్నుతుంది? యీళ్ళ నడిగితే 'ఆరి' నడగండంటారు. ఆరి నడిగితే 'దానికేటుంది? అందరినీ కూడగట్టండం'టారు! చెప్పాను చెప్పాను! చాలాకాలం ఓపిక పట్టాను. ఆఖరుకు నాకో అనుమానం పుట్టుకొచ్చింది - 'యీాయన నిజంగా భూములిప్పించే ఉద్దేశ్యంలో ఉన్నాడా?' అని. సర్లే, వాళ్ళూ వాళ్ళూ ఏడుస్తారు, మన కెందుకొచ్చిన గొడవ అని చాలాకాలం ఊరుకున్నాను.

"నెల్లాళ్ళ క్రితం అనుకుంటాను. కలక్టరు కబురంపించి యీా యేడయినా హరిజనులకి యేదయినా చేయాలన్నాడు. పైనుంచి తాఖీదు లొచ్చాయిట! ఆయన కడుపులో విషయం నాకు అర్థమయింది. దానికేముంది సార్, అలాగే చేద్దాం - అన్నాను. ఏదో తేల్చకపోతే ఎక్స్‌సర్వీసోళ్ళు తిరుగుతున్నారన్నాడు. పట్టాకి వందకన్న ఎక్కువవదు! పదో పదిహేనో ఆర్నైకి యివ్వాల్సుంటే యివ్వాల్సుంటుంది! యింక నా గొడవ! అన్నీ సక్రమంగా అయి పట్టా మీ చేతికి వస్తే మీరూ ఎక్కడికీ పోరు! నేనూ ఎక్కడికీ పోను! యింతకీ చెప్పొచ్చేదేటంటే - యివన్నీ కుదిరాక ఊళ్ళోకి వచ్చీరాగానే వీర్రాఘువులు గార్ని కలిశాను. ఆయనకి వెయ్యి వ్యాపకాలు. యిదిగో అదిగో అన్నాడు. సర్లే, వీళ్ళని కదుపుదామని మాలాళ్ళని పిలిపించాను. ఊ అనరు ఆ, అనరు. వందే - అంటాడొకడు! విసుగెత్తిపోయింది. మనూరూ... మనాళ్ళూ... అనే బాధతో నా ప్రాణం కొట్టుకపోతోంది. ఓ రోజు జోగిరాజు చెరువు గట్టుమీద కలిశాడు! జరిగిందంతా విని బాధపడ్డాడు! క్రితం ఎలక్షన్లలో మీరంతా నడుం కట్టుకుని తిరగబట్టే తన తరవున యిద్దరయినా మెంబర్లయ్యారని చెప్పుకొచ్చాడు. అవకాశం వచ్చింది గనుక మీ అందరికీ ఉపకారం చెయ్యాలని ఊ యిదయ్యాడు.

"ఆ డబ్బేదో నేను మదుపెడతానని ముందుకొచ్చాడు. మీకు కవురంపాడు. మీరు పచ్చగా ఉంటే ఆయన సొమ్ము ఆయనదగ్గరే ఉంటుంది. యిదీ జరిగిన సంగతి. జోగిరాజు వెనకాతల ఉండి నల్లజెరువు భూముల్ని దున్నుకుంటారో లేకపోతే ఆళ్ళకీ గాకుండా మీకూ గాకుండా ఆ పోరంబోకుని మరెవరికయినా వదులు కుంటారో ఆలోచించండి...."

అణగదొక్కబడి, ఆలోచనల్లేకుండా చేయబడి, పశువులకన్న హీనంగా చూడబడుతూ, అందరిలాగే పుట్టినా పుట్టిన దగ్గర్నుంచి చచ్చేదాకా ప్రతి విషయంలోనూ అందరికన్న అల్పులమన్న భావనతో పెంచబడుతూ ఉన్న ఆ తలలకు... ఏ విషయాన్నయినా లోతుపాతులు చూసి తర్కించి తెలుసుకునే జ్ఞానం ఎలా వస్తుంది?

వాళ్ళలో వాళ్ళు ఆలోచించుకున్నారు. కొందరు తోడిగాడి కడుపు కొట్టరాదంటే, కొందరు పరిస్థితులనిబట్టి పోవాలన్నారు. కొన్ని గొంతులు బలహీనంగా న్యాయం, ధర్మం, దైవం అంటే, కొన్ని గొంతులు కాదు పొమ్మన్నాయి. నిలబడనంటున్న మనిషికోసం మనం వదిలేస్తే మరొకడు కొట్టుకుపోతాడన్నాయి. ఆదేదో మాలాళ్ళతో మాట్లాడి తేల్చుకుందామని కొందరంటే -

కర్ణంగారిలాటోడు అన్ని నుట్టులు అడిగితే తేలని యవ్వారం మనవల్ల తేలుద్దా-అని కొందరన్నారు. యింతకీ ఆళ్ళు మాట్లాడకపోవటానికి కారణం ఏటయ్యుంటుందని ఎవరో అడగ్గా - పదిమందీ కయ్యిమన్నారు.

"దున్నుకుంటూన్న బూవుల్ని పట్టాల్లేకపోతే మాత్రం యెవురు యెత్తకెల్లగలరూ అన్న ధీమా'' అన్నారు. "ఊరికినె ఆ యీర్రాగవులుగోరు యిప్పిత్తారని యెదవాస!" అన్నారు యింకొందరు.

పెద్దవాళ్ళ సారాలకూ వాళ్ళ అహంకారాలకూ... రంగూ రుచీ వాసనా లేని స్వచ్ఛమయిన వాళ్ళ హృదయాలు వికృతవర్ణాలు ధరించాయి. అందరూ జోగిరాజుకి కొమ్ముకాస్తామన్నారు. ప్రాంసరీ నోట్లమీదా, అప్లికేషన్లమీదా ఒకేమారు ఏకబిగిన వేలిముద్రలు వేసేశారు.

"నల్లజెరువు బూవుల్ని మాదిగెదవలు వొడేసుకోవాలని సూత్తన్నారంట! జాత్తక్కువనాయాల్లు-''

మాలపల్లి కుతకుత ఉడుకుతోంది.

**అగ్గిపుల్లకి అగ్గిపెట్టె అమిరింది!**

వీర్రాఘవులు మాలల మొర విన్నాడు!

"అంతవరకూ రానీండి చూద్దాం!" అన్నాడు. ఓ తమ్ముడి బామ్మర్దినీ మరో తమ్ముడి మామగారినీ గుర్తుచేసి "మీకేం భయంలేదు పో''మ్మన్నాడు. "కర్ణంతోటీ కలక్టరుతోటీ మాట్లాడతాను లె''మ్మన్నాడు!

ఆ మాటలన్నీ విన్నాక అంతవరకూ వస్తే మాదిగల తాడో పేడో తేల్చకుండా ఊరుకుంటామా అన్నారు మాలలు.

చిన్నా పెద్దా మాటవిసుర్లూ! చేతు లెత్తుకోడాలూ! గొంతు చించుకోడాలూ! సంతకాలెట్టిన మాదిగలకీ వరకట్టుకున్న మాలలకీ మధ్య అప్పుడప్పుడు తలెత్తుతూనే ఉన్నాయి.

ఆ రోజు -

మాదిగ గున్నయ్య గుడిసె, మాల పోలయ్య గుడిసె పక్క పక్కనే ఉన్నాయి. ఆ యింట్లో అరబెట్టిన గొడ్డుతోలు వాసన యీ యింట్లోకి వ్యాపిస్తూనే ఉంది. యింటిముందు పోలయ్య భార్య నూకలు యెండబెట్టుకుంది, మాయదారి

నిద్ర ముంచుకొచ్చింది. చిటికలో గున్నయ్య కోడిపిల్ల వచ్చి నూకల్ని కెలికేస్తూ చేట గుమ్మరించేసింది. అన్నీ దుమ్ముపాలయిపోయాయి.

"ఓలప్పో! తగలేసేసిందల్లో" అంటూ పొరుగింటామె అరుచుకుంటూ వచ్చింది. అదాటున లేచింది పోలయ్య భార్య.

అంతే!

"మా నూకలుదుమ్ములో వోస్తన్నారు! మా బూవుఁ లొడేసుకుంటున్నారు! యీళ్ళ జిమ్మడిపోనో! యీళ్ళకి పెద్దజబ్బురానో!" అంటూ తిట్లు లంకించుకుంది.

గున్నయ్య పెళ్ళాం ఊరుకోలేదు!

నోళ్ళు కలిసాయి! చేతులు కలిసాయి!

కొప్పులు విడిపోయాయి! చిరుగులు పట్టివున్న బట్టలు యింకా చిరిగిపోయాయి!

రొప్పుకుంటూ రోజుకుంటూ ఆడాళ్ళు ఎవరి జాగాల్లోకి వాళ్ళు నిష్క్రమించారు!

మగాళ్ళు పనులనించి వచ్చారు!

గున్నయ్యమీద పడిపోయింది పెళ్ళాం!

"నువ్వు బూవుఁల్ని తెస్తావో తేవో తెల్లేదుగాని ఊళ్ళో జట్టీలు తెస్తున్నా"వని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టింది.

గున్నయ్య ఆమెనో నాలుగు తన్ని, అరిచి అరిచి ఊరగాలవ గట్టమ్మటే నడకపట్టాడు, అట్నుంచి కర్ణమూ జోగిరాజూ కబుర్లుచెప్పుకుంటూ వస్తున్నారు.

"వస్తాదో సస్తాదో తెల్దుగాని పేటలోకి అడుగెట్టలేకుండా అయిపోయాం; మాదిగ నాకొడుకులు యిలాంటోళ్ళని పేటపేటంతా ముఖంమీదే దుమ్మెత్తి పోస్తన్నారు! కలో గంజో తాగి కడుపులో కాళ్లెట్టుకు తొంగునీవోళ్ళం! యిలా మాయలో పడిపోయాం! పేటకి సెడ్డయిపోయాం" - అంటూ మొర పెట్టుకున్నాడు గున్నయ్య.

"పవురుసం లేనెదవా!" తిట్టాడు జోగిరాజు.

"ఆ మాత్రం ఊళ్ళో నిభాయించుకోలేకపోతే ఎలా"గన్నాడు.

"భూములొస్తే అప్పనంగా తిందామనే అనుకున్నావు గానీ చిన్న గొడవ వస్తే ఎదుటివాడి ఎముకలు ఏరెయ్యక ఊపుకుంటు వచ్చావా?" అంటూ ప్రోత్సహించేడు.

"నిన్ను తన్నబోతున్నవాణ్ణించి కాసుకోవాలంటే నువ్వే మొదటిదెబ్బ తియ్యా"లన్నాడు.

"అందుకేరా మీ బతుకులిలాగున్నాయి!" అంటూ జాలిపడ్డాడు.

"ఎదుటివాడి పళ్ళు పీకెయ్యకపోతే నీకు బ్రతుకు లేనేలేదు పొ"మ్మన్నాడు.

బట్టీ దగ్గర చీకటి చీకటిగా ఉంది.

గున్నయ్య మనసునిండా చీకటినీ, కడుపునిండా సారానీ, జేబులో కాస్తంత డబ్బునీ, మెదడులో "మాలాళ్ళ యిళ్ళకి నిప్పెట్టాల"న్న ఆలోచననీ దట్టించి మాలపల్లిమీదకి విసిరాడు జోగిరాజు.

**అగ్గిపుల్ల భగ్గున మండింది.**

మాలపల్లి సురసురా అంటుకుంది.

పేపర్లో తిమ్మాపురం హరిజనవాడ కాలిపోయిందని పడింది. కాలిపోయిన యిళ్ళ సంఖ్యలో మాదిగల యిళ్ళుకూడా కలిసిపోయి ఉన్నాయి. చనిపోయిన వారిలో పోలయ్య కళ్ళులేని పిల్లాడితోబాటు గున్నయ్య కాళ్ళులేని పిల్లకూడా ఉంది.

ఒకపక్కన జోగిరాజా ఒకపక్కన వీర్రాఘవులూ పూనుకుని చెరువుగట్టున మాలలకీ మాదిగలకి ఒకే పంక్తిన గంజి నీళ్ళు పోశారు! శాంతియుత సహజీవన సౌభాగ్యాన్ని నెమరువేసుకుంటూ ఎవరి ప్రచారం వాళ్ళు చేసుకున్నారు.

ఎక్కడో తయారయిన మందు, ఎక్కడో పుట్టి ఎక్కడో తయారు చేయబడిన పుల్లతో కలిసి అగ్గిపుల్లగా మారి ఎక్కడో మండి ఏదో చేస్తుంది!

కాలిపోయిన యిళ్ళ శిథిలాలూ, కమురుకంపుకొట్టే మానవ శరీరావశేషాలూ, ఏడుస్తున్న మనుషుల మొగాలూ పైకి దర్శనమిస్తాయేగ్గాని వెనకవున్న అగ్గిపుల్లలు కనిపించవు! ఉపన్యాసాలన్నీ జరిగిన బీభత్సాన్ని వర్ణిస్తూ సాగిపోతాయి గాని నిజాలను బయటకు లాగవు!

రెండేళ్ళు పోయాక వీర్రావువులు సాయంతో జోగిరాజు యమ్మెల్యే అయ్యాడు. యింకా పట్టాలకోసం మాలలూ మాదిగలూ ఇళ్ళు కాల్చుకుంటూనే ఉన్నారు! సగానికిపైగా నల్లజెరువుని ఆక్రమించుకుని పెద్దలిద్దరూ ప్రస్తుతానికి సురక్షితంగానూ సుఖంగానూ ఉన్నారు.

పెద్ద పెద్ద నాయకుల సానుభూతి ఉపన్యాసాల, ప్రకటనల, పాదయాత్రల వర్షంలో కూడా చల్లారని అగ్గిమంటలు కడుపులో దాచుకుని కుతకుత ఉడుకుతున్న ఎన్నెన్నో భారత గ్రామాల్లో -

అదిగో, అదో తిమ్మాపురం!

*(జ్యోతి మాసపత్రిక - అక్టోబర్, 1980)*

# స్పర్శ

"నీతో జీవితం - ఎంత సెక్యూర్డ్‌గా ఉంటుందో!" అన్నాడు సుబ్రావ్ తన ఆలోచనలనుంచి బయటపడుతూ.

వినబడింది. ఆ తరవాత మాట్లాడుతున్నవీ వినబడుతున్నాయి. నా జవాబును ఆశించలేదో - ఎవాయిడ్ చేయాలనో - మాట్లాడుకుంటూ పోతున్నాడు.

కారు సీటు మీద వెనక్కి తల జారేసి కళ్ళు మూసుకున్నాను.

" - నువ్వేం చెప్పినా - నేను వింటాను. నేను చెప్పితే - నువ్వూ వింటావు. అభిప్రాయాలలో తేడా వచ్చిందనుకో - మనం ట్రూ డెమొక్రాట్స్. మాటలతో తేల్చుకుంటాం. ఒకర్నొకరం ఫోర్స్ చెయ్యం. నువ్వు నన్ను ఎమ్ - సి - పీ - అంటే నేను తేలిగ్గా నవ్వుతాను. నిన్ను నేను ఫెమినిస్టు దయ్యం అంటే నువ్వు పట్టించుకోవు. మనం మాటల్ని పట్టించుకోం - ఈ రోజు విషయమే తీసుకో - ఎంత అందంగా హేండిల్ చేసాం - పొసెసివ్‌నెస్ మంచిది కాదు సునీ-"

'నో! ఇది పొసెసివ్‌నెస్ కాదు - నీకు తెలుసు - ' అని అరవాలనిపించింది. నేను రియాక్టవదలచుకోలేదు.

"కమాన్ సునీ! -" అన్నాడు నావైపు తిరిగి.

"ఏంటి బాసూ - నువ్వు నన్నింత ఎత్తేస్తున్నావ్-"

"అయ్ రియలీ మీనిట్" అన్నాడు నా గొంతులో మార్పును పట్టించుకోకుండా.

"అఫ్‌కోర్స్ - అఫ్‌కోర్స్ - ఏనుగు బొమ్మని వేసి పేరు చెప్పనక్కరలేదు"

సుబ్రావ్ మాట్లాడుతున్నాడు మళ్లీ. నా మూడ్ మార్చటానికి ప్రయత్నం. బహుశా తన మూడ్ సరిచేసుకుంటున్నాడేమో - మరీ దూరం చేసుకుంటున్నానేమో - సుబ్రావ్‌ని? ఎందుకింత బిట్టర్‌నెస్! మనిషికి దూరమై ఆ శూన్యాన్ని భరించటం ఎంత కష్టం!

ఆలోచనలను వదిలించుకుందామని బయటకు చూడసాగాను.

రాయలసీమ గురించి చాలా విన్నాను. విన్నదాన్ని వెరిఫై చేసుకుందామని ప్రయత్నం. మనసు లగ్నం కావటం లేదు. కుస్తీ పడుతున్నాను.

పదకొండు దాటింది. జూన్ నెలయినా చల్లగా ఉంది. బాంబేలో వర్షాలు మొదలయిపోయాయి. బాంబే బ్రతుకుకి తమాషా బ్రేక్స్ వర్షాలు.

మదనపల్లి దగ్గరవుతోంది. చెట్ల గుంపుల నుంచి ఒక్కసారిగా బయట పడింది పట్నం.

ఓ జంక్షన్‌లో ఆపాడు సుబ్రావ్.

కందులపల్లి గురించి కనుక్కోవాలిట. కాఫీ తాగాలిట.

"ఇంతకన్న శుభ్రమయిన హోటల్ దొరకదా - నీకు?"

"ఇదేం బాంబే కాదు - ఈ జంక్షన్ కాస్త అడావుడిగా ఉందంటే - యిదే యిక్కడ 'ఓబరాయ్' అయుంటుంది" అంటూ హోటల్ వేపు దారి తీశాడు.

కాష్ కౌంటర్ దగ్గరకు వెళ్ళి - "కందులపల్లికి ఎలా పోవాలి-?" అన్నాడు సుబ్రావ్.

అతను ఆ ప్రశ్నను వింటూనే నన్ను ఎగాదిగా చూశాడు.

నలభై రెండేళ్ళున్నా... బాబ్డ్ హెయిర్, స్లీవ్‌లెస్ జాకెట్, మెంటైన్ చేస్తున్న శరీరం, .... వయసుని దాచుతున్నాయి.

అతని చూపుల్లో ఎప్రిసియేషన్ లేదు - సస్పిషన్ ఉంది. మా సుబ్రావ్ - నన్ను పట్టుకొచ్చాడనుకుంటున్నాడా - కొంపదీసి?

చీకాకూ .... నవ్వూ.... వచ్చాయి.

అతను చూపు సుబ్రావ్ మీదకు మరలించాడు. ఏముంది సుబ్రావ్‌లో...?

బట్టతల. ఉన్నదాన్ని నల్లగా ఉంచగలడుగాని.... ఊడిన జుత్తుని ఎక్కడ నుంచి తీసుకువస్తాడు? మొహం... నున్నగా... బాగుంటుంది. మీసం ఉంచడు. నలభై అయిదేళ్ళు కనబడనీడు. టై, కోటూ వేసుకోలేదు. వదులు బొమ్మల షర్ట్. లోపల బనీను కూడా లేదు. రాయిలాంటి ఒంటి స్వరూపం... గుండెలమీద జుత్తు... చొక్కాలోంచి తొంగి చూస్తున్నాయి.

నేనతన్ని ప్రేమించాను. ప్రేమిస్తాను. అతనికి.... వాడి మీదున్న హక్కుని... ఎలా కాదనగలను?

"ఎవరింటికి పోవల్ల?" అన్నాడు.

"మోహన్రెడ్డి యింటికి - " అన్నాడు సుబ్రావ్.

అయామ్ ష్యూర్! అతని కళ్ళు పెద్దవయాయి. "మోహన్రెడ్డి యింటికి పోవల్ల?" అంటూ బయటకు చూశాడు. మా మారుతీ వాన్ దుమ్ము కొట్టుకుని దర్శనం యిస్తోంది. ఈ ఊళ్ళో మారుతీ ఆథరైజ్‌డ్ సర్వీస్ సెంటర్ ఉందో లేదో! లేకపోతే - సుబ్రావ్ తుడిపించనయినా తుడిపించడు.

"అవునవును మోహన్రెడ్డే" అన్నాడు సుబ్రావ్. గొంతులో 'ఉషారు' ఉంది. ఎందుకుండదూ?

బయల్దేరిన దగ్గర నుంచి రెడ్డి స్మరణే! మోహన్రెడ్డీ, తనూ కాకినాడలో యింజనీరింగ్ కాలేజిలో చదివారుట. చాలా సన్నిహితంగా తిరిగేరుట. విడుదలయిన ప్రతి సినిమా ఫస్ట్షో చూడాల్సినదేనట. చొల్లంగి అమావాస్య తీర్థం, దసరా నవరాత్రులూ, గెద్దనాపల్లి నాటక పోటీలూ, రెడ్డి పెళ్ళికి కాకినాడ నుంచి స్నేహితులంతా కలిసి రావటం, పెళ్ళికి జనరేటర్ పెట్టి లైట్లు వెలిగించడం, ఓ మనిషికో షాక్ కొట్టడం, గందరగోళం, మదనపల్లె వచ్చి సినిమాలు చూడటం, బొబ్బట్లూ- పాలూ కలిపి ఆరగించటం, వేరుసెనగ పచ్చడీ... రాగి రొట్టెల్లో పొట్టేలు మాంసం - ఆ వూళ్ళల్లో మర్యాదలు....

సుబ్రావ్ది బ్రహ్మాండమైన జ్ఞాపకశక్తి. కథల్లా చెపుతాడు. ప్రయాణం అంతా ఆ కథల్తోనే. అన్ని బాధలూ మరిచిపోయాడు మావాడు.

"నువ్వు మోహన్రెడ్డిని సూడల్ల?" అతను తాపీగా అదోలా అన్నాడు.

"అవునవును" అన్నాడు సుబ్రావ్. తెలిసిపోతోంది - సహనం తెచ్చుకుంటున్నాడు.

"మందే వూరో....?"

"బాంబే" అన్నాడు సుబ్రావ్. మామూలుగా అనలేదు. బాంబే - అనేసరికి అవతలి మనిషి, అదిరిపోయి, లేచినిలబడి, గౌరవించేస్తాడన్న ధీమా!

అతను అదిరినట్టున్నాడు కాని - లేచి నిలబడలేదు.

మరోసారి పరిశీలనగా చూసి - "ముందుగా కాఫీ తాగండి సార్" అంటూ సర్వర్ని పిలిచి, మూలగావున్న ఒక టేబిల్ని చూపించి, దాన్ని శుభ్రం చేయమని పురమాయించాడు.

కూర్చున్నాం - "మీల్సా - టిఫినా సార్?" అంటూ సర్వర్ ఆరంభించాడు. సుబ్రావ్ టైం చూసాడు. నా వేపు చూసాడు.

"నీక్కావలంటే తిను" అన్నాను చిరాగ్గా.

సుబ్రావ్ మీద నా ఫిర్యాదు అదే! స్వంతంగా ఆలోచించడు. చెయ్యడు. కారీ అయిపోతాడు. తిండి తినటానికి రాలేదు గదా - ఎవరో అడిగితే, సజెస్ట్ చేస్తే - ఆలోచనలో పడటమెందుకూ?

సుబ్రావ్ లోపాలను పెద్దది చేసి చూపిస్తోంది వ్యగ్రత.

ఇరవై మూడేళ్ళ క్రితం పరిచయం - పదిహేడేళ్ళ క్రితం వివాహం - ఎన్నింటిని సహించాను నేను! ఎందుకు?

"కాఫీ - " అన్నాడు సుబ్రావ్. గొంతులో అయిష్టం ఉంది. ఇంత పెద్దవాళ్ళు అంత చిన్న బేరం చేసారనుకుంటారని కాబోలు.

సర్వర్ వెళ్ళాక, "స్మాల్ టౌన్ కదా - జనం అలాగే ఉంటారు" అన్నాడు నా చేతిని నొక్కుతూ.

"నువ్వు బిగ్ సిటీ వాడివి కదూ!"

మా పోట్లాట కొనసాగేదే - సుబ్రావ్ నా భుజం మీద పొడిచాడు. ఏంటన్నాను. చూపించాడు.

మాకు రెండు బల్లల అవతల యిద్దరు కూర్చుని ఉన్నారు. వాళ్ల బల్లకి అన్చి ఉన్నాయి రెండు తుపాకిలు. ఇద్దరూ సామాన్యంగా కనిపిస్తున్నారు. ఒకతను అడ్డ పంచె మీద చొక్కా వేసుకున్నాడు. ఆ తుపాకి అతని దగ్గర లేకపోతే - పొలంలో పని చేసే ఒక రైతు పని మీద పట్నం వచ్చినట్లు కనిపిస్తాడు. భుజం మీదున్న రంగు తువ్వాలుతో మొహం తుడుచుకుంటున్నాడు. రెండవ మనిషికి కాస్త వయసుంటుంది. పాంటూ చొక్కాలో ఉన్నాడు. లావుగా ఉన్నా, క్రూరత్వం మొహంలో ఎక్కడా లేదు.

"తుపాకులు!!" ఆశ్చర్యంగానూ, నెమ్మదిగానూ అన్నాను.

సుబ్రావ్ తన ఆశ్చర్యాన్ని నాకు అందించి చుట్టూ చూస్తున్నాడు. నేనూ చూసాను. మమ్మల్ని చూసి కాస్త కూస్తో ఆశ్చర్యపోతున్నారు గాని, వాళ్ళని ఎవరూ పట్టించుకోవటం లేదు.

"బాంబేలో లేవేంటి?"

ఆఫ్ట్రాల్ - యివే మాత్రం - అన్న గొంతుతో అన్నాడు సుబ్రావ్. ఆ గొంతు తెచ్చిపెట్టుకున్నదే - తెలిసిపోతూనేవుంది.

సుబ్రావ్‌కి అధికారం ఉంటే - బాంబేలో లేనివి దేశంలో యింకెక్కడా ఉండగూడదని నిషేధించే మనిషే!

"- ఇవి స్మాల్ టౌన్స్‌లో మామూలేనేమో!"

"నువ్వు మీ కాకినాడలో ఎప్పుడయినా చూసావా? - నేను మాత్రం మా రాజమండ్రిలో ఎప్పుడూ చూడలేదు."

రాజమండ్రి అంటే - అందులోనూ దానవాయిపేట అంటే సుబ్రావ్‌కి గొప్ప 'ప్రైడ్!'. 'నేను ప్రౌడ్ కాదు, నాది ప్రైడ్!' అంటుంటాడు. కాకినాడ, రాజమండ్రి తగువు నాకూ యిష్టమే!

ఆ క్షణంలో మా తగువు కొనసాగలేదు. భయమా - ఆశ్చర్యమా? నేనే కాదు సుబ్రావ్ కూడా - తుపాకులిని సినిమాల్లోనూ, మ్యూజియంలలోనూ చూసాం. పోలీసులూ, సైనికులూ పట్టుకుని తిరగడం చూసాం. సెక్యూరిటీ గార్డుల చేతుల్లో చూసాం. సామాన్య ప్రజల చేతుల్లో మాత్రం తుపాకులు చూడలేదు. అందువల్లనేనా మా ఆశ్చర్యం?

నా ఆలోచనలు సాగుతున్నాయి -

"నాకు రాజు గుర్తొస్తున్నాడు సునీ - మా వెంకటరాజు" అన్నాడు సుబ్రావ్.

వెంకట్రాజు - సుబ్రావ్ బంధువు. స్నేహితుడు. క్లాస్‌మేట్. అస్సాంలో టీ ఎస్టేట్‌లో పని చేసేవాడు. ఉగ్రవాదులు కిడ్నాప్ చేసారు. వాళ్ళ కోరికలకు యజమానులూ, ప్రభుత్వమూ దిగిరాలేదు. శవం తిరిగి వచ్చింది. ఆ వార్తకు సుబ్రావ్ చాలా దెబ్బతిన్నాడు. తుపాకిని - అలాంటి సామాన్యుల చేతిలో చూస్తుంటే ఆ విషయం గుర్తు వచ్చినట్టుంది.

"ఈ దేశం ఎక్కడికి పోతోంది" అన్నాడు.

"అమెరికాకి. పదహారేళ్ళ పిల్లలు తుపాకుల్తో స్కూల్‌కి వస్తారుట"

సుబ్రావ్‌కి అమెరికా అంటే ఆరాధన. అక్కడున్న ఫ్రెన్ అన్నా - ప్రజాస్వామ్యం అన్నా పరవశించిపోతాడు. తనవంటి ప్రతిభావంతునికీ, కార్యతత్పరునికీ ఆదర్శం ఆమెరికా సమాజమేనట!

"పోన్లే - మన పిల్లలు అలా అవకూడదనే - అందరికీ దూరంగా ఉంచుతున్నాం."

అమెరికా పేరు ఎత్తి సుబ్రావ్‌ని హర్ట్ చేద్దామనుకోలేదు నేను. శేఖర్ విషయం ఎత్తి నన్ను హర్ట్ చేసే సాహసం ఉందా సుబ్రావ్‌కి!?

మాట తప్పిస్తూ, మొహం తప్పిస్తూ- "ఈ స్కాండ్రల్ యింకా కాఫీ తేలేదు" అన్నాడు.

విషయాన్ని మారుస్తున్న సుబ్రావ్‌కి నేను అడ్డుపడలేదు.

సంభాషణ మోహన్రెడ్డి మీద సాగుతోంది. పావుగంటయినా కాఫీ రాలేదు. సుబ్రావ్ అంచనా ప్రకారం 'బాంబే కస్టమర్స్' కోసం కాఫీ ప్రత్యేకంగా తయారవుతోంది. అంచనాలకు మించిన ఆలస్యం సుబ్రావ్‌కి కోపం తెప్పించింది. కౌంటర్‌లో మనిషి మీద అరిచాడు. అతను సర్వర్ మీద అరిచాడు. కాఫీ వచ్చింది. పూర్తి చేసాం. జరిగిన ఆలస్యానికి వచ్చి 'సారీ' చెప్పాడు. ఆ తర్వాత కందులపల్లి వివరాలు చెప్పాడు. గంట ప్రయాణంట. వివరాలు చెబుతున్నప్పుడు అతను అదోలా ఉన్నాడు.

హోటల్లోంచి బయటకు వచ్చాం. మా వాన్ పక్కన ఒక పోలీస్ జీప్ ఆగి ఉంది. అందులో వున్న పోలీస్ అధికారి కిందికి దిగి మమ్మల్ని సమీపించాడు. సుబ్రావ్ తాళం తీయబోతున్నాడు.

"మిష్టర్! మాతో స్టేషన్‌కి రావాలి" అన్నాడు ఇంగ్లీషులో. ఆ గొంతు కరకుగా ఉంది.

సుబ్రావ్ నిర్ఘాంతపోయాడు. తేరుకుని -"ఎందుకు?" అన్నాడు తెలుగులో.

"అన్నీ స్టేషన్లో -" అన్నాడు.

"ఎందుకో చెప్పకుండా మేం రాం" అన్నాను.

నా వేపు తిరిగి సూటిగా చూసాడు. మరో పోలీసు అధికారి అతని భుజం మీద చెయ్యి వేసి - మిమ్మల్ని చూసి మర్యాదగా నవ్వాడు.

"నేను సర్కిల్ ఇన్స్పెక్టర్ పద్మనాభనాయుడిని. మీరెవరో తెలుసుకోవచ్చా?"

"నేను సుబ్రావ్‌ని. భారత్ పెట్రోలియమ్‌లో ఎగ్జిక్యూటివ్‌ని. ఈమె సునీత. నా భార్య. సోషియాలజీలో ప్రొఫెసర్."

"థాంక్యూ ఫర్ ద కోపరేషన్. మీరోమారు స్టేషన్‌కి రావాలి. జెస్ట్

ప్రశ్న, జవాబులు ఇంగ్లీషులో జరుగుతున్నాయి. జనం మూగుతున్నారు.

మా వాన్‌లో మాతోబాటు పద్మనాభనాయుడూ, మరో కానిస్టేబుల్ వచ్చారు. పోలీస్టేషన్‌కి చేరాం.

లోపలికి వెళ్ళాక, మమ్మల్ని కూర్చోబెట్టి సి. ఐ. నాయుడు ఆరంభించాడు:

"మేం మిమ్మల్ని సోదా చెయ్యాలి"

"మీ ఉద్దేశ్యం ఏమిటి?" అన్నాడు సుబ్రావ్.

"ఫార్మాలిటీ" అంటున్నాడు మళ్ళీ.

"మీ ఊరికి వచ్చిన వాళ్ళనందరినీ సోదా చేస్తారా?" అన్నాను.

అతను మృదువుగా నవ్వాడు - "ఈ మధ్య రాయలసీమలో RDX ని ఉపయోగించి ఒక యింటిని పేల్చేసారు. మీరు పేపర్లో చదివేవుంటారు."

"మీ పేపర్లు మాకు రావు. " సుబ్రావ్ గొంతు అసహనంగా ఉంది.

"అవును సార్ - లోకల్ ఎడిషన్స్ వచ్చాక ఒక పేట న్యూస్ మరో పేటకి అందటంలేదు. కాఫీ, టీ.... ఏమయినా?" అన్నాడు మా టెన్షన్ తగ్గించటానికి ప్రయత్నిస్తూ.

మేం వద్దంటుంటే కూల్ డ్రింక్స్‌కి కవురంపాడు.

"-రాయలసీమలో కత్తులూ, కర్రలూ పోయాయి. తుపాకులూ, బాంబులూ వచ్చాయి. ఇప్పుడు వాటికి RDX లాంటిది తోడయితే - జనం ఏమవుతారు? మాకు యిరవై నాలుగ్గంటలు చాలవు -" అంటున్నాడు.

సుబ్రావ్ శ్రద్ధగా తలూపుతున్నాడు.

అతనికి పోలీస్ వ్యవస్థ మీద దురభిప్రాయమేం లేదు. ఆ వ్యవస్థ అవసరం పోవాలంటే ప్రతి మనిషీ గాంధీ అవాలిట. ఇన్ని వేల ఏళ్ళ మానవ నాగరికతలో కేవలం ఒకే ఒక్క గాంధీ పుట్టాడట. ఏం లాభం - ఆయన తనని తాను కాపాడుకోలేకపోయాడు - అలాంటి గాంధీ మరెన్ని వేల ఏళ్ళకి పుడతాడు! అందువల్ల పోలీసులుండక తప్పదు. వాళ్ళు మరింత చురుకుగా, ఆధునికంగా ఉండాలి. మరింత సేవాభావం పెరగాలి - అంటాడు సుబ్రావ్. చెడ్డ ఎక్కడ లేదు - నేరాలతో సంబంధముండే పోలీసు వ్యవస్థలో చెడ్డతనానికి అధిక ప్రచారం

జరుగుతుందిగానీ అంతకన్న ఎంతో చెడ్డతనం తతిమ్మా వ్యవస్థలలో ఉంది - అంటాడు కూడా.

సుబ్రావ్ హోదాకి పోలీసుల నుంచి మర్యాద బాగానే దొరుకుతుంది. కాని, ఊరుగాని ఊరులో... మా వాడు ఎంతటి వాడో తెలీనపుడు... ఇంత మర్యాద సుబ్రావ్‌నీ సంతోషపరచింది. ఈ తతంగం చికాగ్గా ఉన్నా - నన్నూ సంతోషపరిచింది.

"నిజమేనండి - ప్రపంచంలో పోలీసులకే కావాలి శాంతి" అంటున్నాడు సుబ్రావ్.

"సో - మీరు మాతో సహకరించాలి."

"ష్యూర్ - ష్యూర్."

"బాంబే నుంచి కారులో ఎందుకు వస్తున్నారు?"

"రాకూడదా?" అన్నాను.

"నాకు జవాబులే కావాలి -"

ప్రశ్నలు కాదన్న గొంతుతో అన్నాడు సి.ఐ.

"కారులో దేశాన్ని తిరిగి చూట్టానికి మాకు డబ్బులిస్తారు" అన్నాడు.

"తెలుగు బాగా మాట్లాడుతున్నారు - ఏ వూరు?"

"నాది రాజమండ్రి -"

"ఆవిడది - యీ ప్రాంతమా?"

"కాకినాడ -"

"అయితే - యిక్కడికి ఎందుకు వచ్చారు?"

"మా అబ్బాయిని స్కూలులో చేర్చటానికి - రిషివాలీ స్కూల్లో-"

మా కారు కాగితాలూ, డ్రైవింగ్ లైసెన్సులూ చూసాడు. అతని ఉద్దేశ్యం బోధపడలేదు. మా సమాధానాలతో తృప్తిపడాలి. శేఖర్ అడ్మిషన్ గూర్చి స్కూల్‌కి ఫోన్ చేసి కనుక్కొని ఉంటాడు కూడా! ఒక కానిస్టేబుల్ వచ్చి సి.ఐ. ని పక్కకి తీసుకువెళ్ళాడు.

తిరిగి వచ్చి - "మాకు వచ్చిన సమాచారం బహుశా తప్పే అయుంటుంది - ఏమయినా మీ కారునీ, సామాన్లనీ చెక్ చెయ్యాలి" అన్నాడు.

"విషయం చెప్పండి ఇన్‌స్పెక్టర్!" అన్నాను.

"మీ కార్ నెంబర్ బాంబే రిజిస్ట్రేషన్. అక్కడ నుంచి RDX వస్తుందని యిన్‌ఫర్మేషన్ ఉంది. విజిలెంట్‌గా ఉంటున్నాం - రొటీన్ చెకప్ - " అంటూ నవ్వి - "మేడమ్! మీరు విమానాల్లో తిరుగుతుంటారు - ఏర్‌పోర్ట్‌లో సెక్యూరిటీ చెకప్ ఉంటుంది. మెట్రో పాలిటన్స్‌లో సెక్యూరిటీ చెకింగ్ రొటీనయిపోయింది గదా - వాటికి - అబ్జక్ట్ చేస్తున్నారా?" అన్నాడు.

"అయితే ఆంధ్రా కూడా అస్సాంలా, కాశ్మీర్‌లా, పంజాబ్‌లా మారిపోయిందా?" అన్నాను.

"యింకా లేదు మేడమ్! యిక్కడ ఆర్మీ లేదు" 'మేమే ఉన్నాం' అన్నట్లు నవ్వాడు.

సోదా పూర్తయింది. సూట్‌కేస్‌లలో సామాన్లన్నీ తిరిగిపెట్టి, వాటిని నాన్ రియర్ స్పేస్‌లో పెట్టారు. కూల్‌డ్రింక్స్ వచ్చాయి. తాగాం.

"సారీ సర్! మీరు వెళ్ళొచ్చు" అన్నాడు.

బయటకు వస్తూంటే తనూ వెనకనే వచ్చాడు - "మీ నెక్ట్స్ హాల్ట్ ఎక్కడ సార్?"

"కందులపల్లి వెళ్ళాలి" అన్నాడు సుబ్రావ్.

"మీకు కావాలంటే - బస్టాండ్‌లో కందులపల్లి మనిషిని పట్టుకొచ్చి అప్పజెపుతాం - మీకు గైడ్ చేస్తారు "అన్నాడు సి.ఐ. నాయుడు.

"నాటె బాడ్ అయిడియా" అన్నాడు సుబ్రావ్.

షేక్‌హాండ్ యిచ్చి మమ్మల్ని కారు ఎక్కించాడు. మాతో ఒక కానిస్టేబుల్ వచ్చాడు. బస్టాండ్ దగ్గర చాలా ప్రైవేట్ బస్సులున్నాయి. అక్కడ ఆపి, కానిస్టేబుల్ బస్టాండ్‌లోకి వెళ్ళాడు.

"బాగా అప్‌సెట్ అయావు" అన్నాడు సుబ్రావ్ నావేపు తిరిగి.

"మగాళ్ళు అవరా?" చురుగ్గా అన్నాను. మగవాళ్ళు అవరనీ, ఆడాళ్ళే అవుతారన్న గొంతుతో సుబ్రావ్ మాట్లాడినట్లనిపించింది. అది ఊహో - సత్యమో!

"పోలీసులతో నీకే ఎక్కువ అనుభవముందిగదా!" అంటూ పేలవంగా నవ్వి- "వాళ్ళు మననే ఎందుకు సెర్చ్ చేసారు?" అన్నాడు.

"చెప్తున్నారు గదా - మనది బాంబేవాన్ అని -" అన్నాను.

సుబ్రావ్ మాట్లాడలేదు- "వాళ్ళన్నది నిజమే అయితే - మనకింక యీ సెర్చ్ తతంగం తప్పదు"

"ఆ హోటల్‌వాడు వీళ్ళకి కబురంపాడేమో!"

"ఎందుకూ?" అన్నాను.

"ఏమో!" అన్నాడు.

"ఈ ప్రాంతం నుంచి ఎంత తొందరగా బయటపడదామా - అనే ఉంది" అన్నాను కళ్ళు మూసుకుని.

కొంచెం ఆగి, "చెప్పు" అన్నాడు సుబ్రావ్.

"దేశమంతటా సెక్యూరిటీ సమస్యే - వీ అయ్ పీల రక్షణ కోసమా బతుకుతోందీ దేశం మొత్తం! మనలాంటి అయ్ పీలకి కూడా ఆ సెగ

తగులుతోంది యిప్పుడు! ఇంతవరకూ అంతా సక్రమంగా ఉన్నట్లు యిప్పుడే ఏదో చెడిపోయినట్లనిపిస్తోంది. అసలు - పేదలకి సెక్యూరిటీ సమస్య ఉందా - ఏ సమాజం లోనయినా - ఏ కాలంలోనయినా?" నా మాటలు నా ఆలోచనలని స్పష్టం చెయ్యలేకపోతున్నాయి. సెక్యూరిటీ ఎవరికి? పెద్దలకే! ఎవరి నుంచి? పేదల నించా - నేరస్తుల నించా - తోటి పెద్దల నించా? పేదలకి సెక్యూరిటీ పెద్దల నించి కావాలి. నేరస్తుల నించి కావాలి. పెద్దల చేతి కోర్టుల నించి, పోలీసుల నించి, డాక్టర్ల నుంచి, యాక్టర్ల నించి ... ప్రతివాడినుంచీ కావాలి.

నేను ఆలోచిస్తూ మాట్లాడుతూంటే నా మూడ్ పాడయిందనుకున్నాడు సుబ్రావ్.

"సునీ! కందులపల్లి ప్రయాణం మానేద్దామా?" అన్నాడు నా చేతివేళ్ళమీద రాస్తూ.

కళ్ళు తెరిచి ఆ మొహంలోకి చూసాను. అతనికి మోహన్రెడ్డిని కలియాలని ఉంది. సుబ్రావ్‌లో యింకా మిగిలివున్న తడి. లాభనష్టాల లెక్కలులేని స్నేహ బాంధవ్యం! ఏళ్ళ తరబడి కలియని మిత్రుడిని కలవాలనిపించడం! సుబ్రావ్ చేతిని మృదువుగా నొక్కాను-

"చూసేపోదాం" అన్నాను.

సుబ్రావ్ మొహం వెలిగింది. "థాంక్యూ!" అన్నాడు.

"యింజనీరింగ్ చదివిన రెడ్డి ఉద్యోగానికి పోకుండా - యింకా కందులపల్లిలో కూర్చుంటాడా? ఉన్నా, నన్ను గుర్తుపడతాడా - వెనకటిలా అంత సన్నిహితంగా ఉంటాడా? నాదో పిచ్చి" అన్నాడు.

"ఎక్కడున్నా - అడ్రస్సున్నా తెలుస్తుందిలే బాసూ!" అన్నాను.

"ఆ వచ్చే మనిషిని అడిగేస్తే తెలిసిపోతూందిగదోయ్!" అన్నాడు అప్పుడే తట్టినట్టు.

"ఫరవాలేదు - నీ బుర్రా పనిచేస్తుందే" అన్నాను.

అంతవరకూ జరిగిన సంఘటనలు - మా మధ్య ప్రచ్ఛన్న యుద్ధ భారాన్ని కొంత సడలించాయా?

కాన్‌స్టేబుల్ ఒకతన్ని తీసుకుని వచ్చాడు. పాంటు, షర్టూ, నెరసిన జుత్తూ, కాళ్ళకి జోడూ, చేతిలో ఏవో సంచీలూ,...

"సార్! ఈయన రెడ్డప్ప సారు. కందులపల్లి బళ్ళో అయ్యవారు. వీళ్ళు కందులపల్లి పోవల్ల. తీసకపొండి" అన్నాడు.

"ఏం మాస్టారూ! మోహన్రెడ్డి కందులపల్లిలోనే ఉంటున్నాడా? ఉద్యోగం చేస్తున్నాడా?" అన్నాడు సుబ్రావ్ కారు తలుపు తెరవకుండా.

"అదేంది సార్ ఆయనకి ఉద్యోగం ఎందుకూ - నిన్నటి దాకా పరిషత్

ప్రెసిడెంటు - అటు తెలుగుదేశమూ, యిటు కాంగ్రెస్సూ రెండూ టిక్కట్లిస్తాయి, బండపల్లి రెడ్లు ఎటు దూకుతారో కనిపెడతండారు మా రెడ్లు" అన్నాడు.

"ఎక్కండి" అంటూ తలుపు తీసాడు.

పోలీసుకి థాంక్స్ చెప్పి గేరు మార్చాడు సుబ్రావ్.

కారు కదలగానే ఆరంభించాడు రెడ్డప్ప.

"పోలీసాయన చెప్పినాడు. మీరు రెడ్డి చుట్టాలంట. రెడ్డి పరిషత్ ప్రెసిడెంట్ అయినట్టు తెలీదా సార్?"

"మనం రెడ్డింటికి వెళ్తున్నట్లు పోలీసులకెలా తెలుసు సుబ్రావ్?" అన్నాను ఆశ్చర్యంగా.

"అవునుగదా!" అన్నాడు ఎదురుగా వస్తున్న లారీని తప్పిస్తూ.

"అదేంది సార్! మీ లాంటోళ్ళు కందులపల్లిలో ఎక్కడికి వెళ్తారో పోలీసోళ్ళకి తెలీదా? ఆ మాదిరి ఒంగి ఒంగి దండాలు పెడతా ఉన్నాడంటే - ఆయనకి అంతా తెలిసే ఉంటాది. ఏ వూరు సార్ మంది?" అన్నాడు రెడ్డప్ప.

"మాది తూర్పు గోదావరి జిల్లా" అన్నాను.

"ఆడ చుట్టరికాలు ఉండాయా - మా రెడ్డోరికి?"

"ఆయన మా స్నేహితుడు" అన్నాడు సుబ్రావ్.

"అట్ల జెప్పండి సార్! మా రెడ్లదే స్నేహమంటే - చుట్టరికం కంటే స్నేహమే సార్ - మా రెడ్డోరికి ముఖ్యం. శ్రీకృష్ణదేవరాయల వారసులండి మా రాయలసీమ రెడ్లు. స్నేహం - దానం - ఆతిథ్యం ఓహోహో ఏం మనుషులండి మా రెడ్డోరు. కత్తి పట్టి పగలంతా తలకాయలు తరిగి తరిగి - రాత్రి పూట గంటం పట్టి కవిత్వం రాసే స్థితప్రజ్ఞత - రాయలనుంచే మా రెడ్డోరికి వచ్చింది సార్"

రెడ్డప్ప చెప్పుకుపోతున్నాడు.

రెడ్లు ఆయన దృష్టిలో యింకా ప్రభువులే! వాళ్ళ పౌరుషాలు, పంతాలు, పగలు, దర్పాలు ప్రతిదీ ఆయనకి గొప్పే! మగవాళ్ళ మధ్య ఎంత పగలున్నా, ఆడవాళ్ళను మాత్రం అగౌరవించరట! కోస్తా జిల్లాలలో పగతో జరిగే మానభంగాలు వంటివి రాయలసీమలో జరగనే జరగవుట. చిన్న పిల్లల్నీ, పైరు పచ్చల్నీ తాకరట. వారి దానగుణం, ఔదార్యం, - నరేసరి - నభూతో న భవిష్యతిట!

సుబ్రావ్ ప్రశ్నలు రెడ్డప్ప మాస్టరికి మరీ హుషారిస్తున్నాయి.

రెడ్డెమ్మ గుండు అని ఉందిట. ఆయన పేరు అదేనట. ఆ పేరు సామాన్యమట. మోహన్రెడ్డి అపర శ్రీకృష్ణదేవరాయలేనట! నిజంగా యీ మాస్టరికి రెడ్ల మీద అంత వీరాభిమానం ఉందా? ఈయన రెడ్డా? లేక మేము మోహన్రెడ్డి

స్నేహితులమవటం వల్ల యింతిలా ఎత్తేస్తున్నాడా యీ మాస్టరు?- అన్న పాపపు ఊహ కూడా వచ్చింది.

ముక్కూ మొహం తెలీని మనిషిని గురించి అలా అనుకోవటం నాకే నచ్చలేదు. వాళ్ళ కబుర్లనుంచి బయటపడటానికి బయట దృశ్యాలు చూడసాగాను.

రోడ్డుకి అటూ యిటూ భూమంతా ఎత్తుపల్లాలే! గుట్టలు. మధ్య మధ్యలో సాగుభూములు. వరి, చెరుకు పంటలకి అలవాటుపడ్డ కళ్ళకి అవి ఎక్కడా కనిపించడం లేదు. అక్కడక్కడ చిన్ని చిన్ని గ్రామాలు. వాటిలో చెదురు మదురుగా రాతి గోడల పెంకుటిళ్ళు, డాబాలు, ఏదో గడ్డి - బోద అంటారుట - కప్పిన గుడిసెలు. రోడ్డు మీద క్రాసుల దగ్గర చిన్ని చిన్ని కొట్లు, కొద్దిగా జనాలు. గోడల మీద ఎరువుల మందు నోటీసులు. రోడ్డు మీద లారీలు, బస్సులు, స్కూటర్లూ అప్పుడప్పుడు కనిపిస్తున్నాయి.

ఎప్పుడూ రద్దీగా ఉండే రోడ్లు, అడుగడుగునా గ్రామాలు, కనుచూపు మేరంతా విస్తరించి పరచుకున్న పచ్చటి వరిచేల తివాసీలూ, కాలువలూ, ఎక్కడపడితే అక్కడ జనాలూ - అలాంటి గోదారి జిల్లాల్లో పుట్టి పెరిగాను. పదిహేడేళ్ళుగా బొంబాయికి అలవాటు పడ్డాను. బొంబాయి అంటే జనం. బొంబాయి అంటే ధనం. బొంబాయి అంటే క్రిక్కిరిసినతనం.

అలాంటి నా కంటికి - ఈ కొండలూ, గుట్టలూ మధ్యనున్న యీ ప్రాంతం నిస్తేజంగా, నిర్మానుష్యంగా కనిపిస్తోంది. నగరాలలో క్రిక్కిరిసిన గృహ సముదాయాల మధ్య ఆట స్థలమో, పార్కో ఉన్నట్లు - యీ నిర్మానుష్య ప్రాంతంలో చిన్ని పట్టణాలూ, జంక్షన్లూ ఉన్నాయి.

రెడ్డప్ప వాక్ప్రవాహానికి అడ్డకట్టవేస్తూ -"ఆ పంట ఏంటండి - మాస్టారూ - ప్రతిచోటా అదే కనిపిస్తోంది" అన్నాను.

"అదేనమ్మా - మా రాయలసీమ, దేశానికిస్తాండే సెనిక్కాయలు" అంటూ ఆరంభించాడు రెడ్డప్ప. ఆ పంట కూడా మూడేళ్ళకోమారు బాగుంటుందిట. ఆ ఏడు మంచి ధర వుండదుట.

"వానలు ఆ దేవుని చేతిలో ఉండాయి. ఆయన యిక్కడే మా కొండల మీదనే ఉంటాడు. దేశ.దేశాల నుండి జనాలు వస్తావుండారు. వాళ్ళ కోరికలన్నీ ఆయన తీరస్తా ఉండాడు. ఆయన నీడనే వుండే మేము నీటి సుక్క లేక చస్తా ఉండాం! ఆయనకి నిత్య కళ్యాణమాయె - మాకు నిత్య క్షవరమాయె-మా దేవుడూ అంతే - మా రెడ్డోరూ అంతేనమ్మా - మా వాళ్ళు ప్రెసిడెంటులైనారు - ముఖ్యమంత్రులైనారు - వాళ్ళు మా సీమకి తెచ్చింది లేదాయె - యిచ్చింది లేదాయె -" అంటున్నాడు.

వెనక్కి తిరిగి రెడ్డప్ప మాస్టారిని పరిశీలించాను.

స్వచ్ఛమయిన గొంతు. అచ్చమైన రాయలసీమ మనిషి. ఆ గొంతులో వ్యక్తిగత కష్టం లేదు. మొహంలో అలసట వ్యక్తిగత కష్టం నుంచి కాదు. అది సీమ కష్టం. అది భగవంతుడికన్న మనిషిని తప్పుబడుతోంది. ఓ ప్రాంతమంతా ఎడారి అయిపోయే ప్రమాదానికి రాజకీయాలను తప్పుబడుతోంది.

అంతకు ముందు వరకూ - ఆయన గత చరిత్ర గురించి ఒళ్ళు పులకరించిపోవడంలో ఏదో వ్యక్తిగత ప్రయోజనం చూసాను. ఆ పులకరింతా, ఆ వ్యక్తిగత ప్రయోజన భావనా - రెండూ నాకు నచ్చలేదు. మనసంతా నిష్ఠురభావాలు. అలాంటి మనసుని రెడ్డప్ప మాస్టారి యీ మాటలు స్పర్శించి, మెత్తబరిచాయి.

కారు మెయిన్ రోడ్డుని విడిచి పక్కదారిలోకి ప్రవేశించింది.

రోడ్డు బాగానే వుంది. ఓ పక్కగా ఎలక్ట్రిక్ స్తంభాలు. మధ్యలో ఓ కొండని- రెడ్డప్ప మాస్టారు దాన్ని బండ అంటున్నాడు - చుట్టుకుంటూ సాగుతోంది రోడ్డు. ఎదురుగా వస్తున్న ట్రాక్టరు - మోహన్రెడ్డిదేనట. ఆ రోడ్డు - రోజుకి రెండు ట్రిప్పుల బస్సూ - మోహన్రెడ్డి వాళ్ళ కుటుంబం తెచ్చినవేనట. కందులపల్లి దాటాక బండపల్లి ఉందిట. ఆ రెడ్లకీ, వీరికీ పడదుట - మాస్టరు చెపుతున్నాడు.

ఊరు చేరువవుతోంది. ఒక చెరువు కనిపించింది. దాని చుట్టూ పొలాలున్నాయి. ఊరికి మొగదలనే ఓ వేపచెట్టూ, దాని చుట్టూ ఒక తిన్నె, దాని మీద కొద్దిమంది మనుషులూ .... చినుగుల నిక్కర్ల పిల్లలూ, రేగుతున్న దుమ్ములో మా కారు వంక చూస్తున్నారు. నలుగురయిదుగురు పోలీసులు ఒక అరుగు మీద కనిపించారు.

"ఊళ్ళో పోలీసులున్నారేంటి మాస్టారూ?"

"ఏమోనమ్మా! ఊరు విడిచి రెండు వారాలాయె - " అంటూ ఓ పెద్ద యింటి ముందు కారు ఆపించాడు.

"అదేసార్ - రెడ్డోరి హజారం - నిలపండి."

కారు ఆగగానే, దిగి ఆ యింటి వేపు వెళ్ళాడు. లోపలికి మాయమైపోయాడు.

ఇంటి చుట్టూ ఎత్తైన గోడ.. మధ్యలో ఒక పెద్ద ద్వారం. లోపల యిల్లు ఒకటే ఉందో - చాలా ఉన్నాయో తెలియటం లేదు.

"మీ 'మోహన్రెడ్డి పెద్ద జంతువే బాసూ!" అన్నాను.

"మనసులో ఊహలు చెరిపేసుకోటానికి వచ్చామేమో - సునీ!" అన్నాడు ఆదోలా.

భుజం మీద తట్టి - "కారులోగదా వచ్చాం - డోంట్ వర్రీ!" అన్నాను.

"నన్ను నూసి ప్రేమించాలగానీ - నా కారుని నూసి ప్రేమిస్తే ఎట్టా అమ్మాయ్యా...?" అన్నాడు సుబ్రావ్.

ఇంతట్లో మాస్టారు మరో యిద్దరిని వెంటబెట్టుకుని వచ్చాడు.

'రెడ్డి లేడుసార్ - రాత్రికి వస్తారు - రాండి - లోపలికొచ్చి రెస్టు తీసుకోండి-" అన్నాడు.

నా మొహంలోకి చూసాడు సుబ్రావ్. నాకూ ఏమనాలో తోచలేదు.

వచ్చిన యిద్దరూ - "మీరు అప్పను నూడకుండా ఎల్లిపోతే ఆయన మమ్మల్ని సంపేస్తాడు" అంటూ ప్రాధేయపడ్డారు.

రెండవుతోంది.

సుబ్రావ్‌కీ, నాకూ మేడ మీద గది యిచ్చారు. సామాన్లు అక్కడికి చేర్చారు. మాస్టారు మా అవసరాలన్నీ చూసి సెలవు తీసుకుంటూ - 'రెడ్డోరితో నన్ను గురించి సార్ - చెప్పండి సార్!" అన్నాడు.

ఆ ఆకస్మిక ఏకాంతం నన్ను భయపెట్టింది. వెంటనే టవలందుకున్నాను.

ఎటాచ్‌డ్ బాత్రూంలో స్నానం చేస్తున్నాను.

అనుకున్నట్టే సుబ్రావ్ డోర్ మీద నాక్ చేస్తున్నాడు. వినిపించుకోలేదు. ఎన్నింటితో యుద్ధం! మొదటి యుద్ధం - యీ శరీరంతోనేనా!

భావాలను రక్షించుకోవాలంటే - ఎన్ని దాడులు!

కనీసం మనసులోనయినా యీ కోపం నిలవదా?!

గుజరాత్, మహారాష్ట్ర గ్రామాల్లో సాంప్రదాయక దుస్తుల వాడకం యిక్కడకన్నా ఎక్కువా - తక్కువా - అన్న విషయం మీద మనసుని నిలుపుతున్నాను.

స్నానం పూర్తయింది. ఆ తర్వాత వెళ్ళాడు సుబ్రావ్.

బాత్రూం నించి బయటపడిన సుబ్రావ్ - "ఈ దేశం డెవలప్ అవలేదనే వాళ్ళు ఫూల్స్!" అన్నాడు బొచ్చు తువ్వాలుతో తుడుచుకుంటూ!

"అవును బాసూ! గీజరూ, షవరూ ....వెస్టర్న్ దొడ్డీ - నీకు దేశ ప్రగతికి సింబల్స్" అన్నాను.

సుబ్రావ్ నా వెటకారానికి జడుసుకున్నాడో - నటించాడో - జవాబివ్వలేదు.

కొంతసేపటికి - మమ్మల్ని భోజనాలకు తీసుకువెళ్ళారు. మాకు యిచ్చిన గదీ, మేడలో. అసలు యింటికి విడిగా ఉన్నాయి. బహుశా తర్వాత కట్టినవయుంటాయి. విశాలంగా, చల్లగా, నాపరాతి గచ్చులతో ఉన్నాయి అసలు యింటిలో గదులు.

భోజనాల గదిలో వడ్డించారు. భోజనాలు పూర్తయ్యాయి.

గదికి చేరేసరికి నిద్ర కమ్ముకొచ్చింది.

లేచేసరికి పడమటి వేపు కిటికీలోంచి సూర్యాస్తమయం కనిపిస్తోంది. దగ్గరగా వున్న చెట్ల కొమ్మలకూ, ఆకాశంలో వెలిమబ్బులకీ, దూరంగావున్న కొండలకీ మధ్య చిక్కుకుని ఉన్నాడు సూర్యుడు. మనసంతా ఏదో ఉదాసీనత....

"శేఖర్‌గాడు యీపాటికి ఏం చేస్తుంటాడో!"

నాలో ప్రశ్న అసంకల్పితంగా బయటకు వచ్చింది.

"నువ్వు అంత పొసెసివ్‌గా ఉండకూడదు! వాడి భవిష్యత్తు సెక్యూర్‌డ్‌గా ఉండాలంటే - మనమూ కష్టపడాలి, వాడూ కష్టపడాలి -" అదీ సుబ్రావ్ పైకి చెప్పే పాయింట్. "ఇది పొసెసివ్‌నెస్ విషయం కాదు. ఇది మనమధ్య యుద్ధం. ఒకరితో ఒకరు గెలవలేని మనం చేసుకున్న రాజీ" అని చెప్పాలి నేను. నేను బాధపడుతూంటే అతని ఓదార్పూ, అతను బాధపడుతూంటే నా ఓదార్పూ - అంతా నటన. స్కూల్ వదిలాక 'శేఖర్ మాట యిద్దరం ఎత్తకూడదన్న' నిశ్చయం ఆ నటనలో ఓ భాగం.

ఈసారి సుబ్రావ్ నుంచి ఎలాంటి జవాబూ వినిపించలేదు.

తల తిప్పి చూసాను. నిద్రపోవటం లేదు. పడక్కుర్చీలో ఉన్నాడు. ఏదో పుస్తకం చేతిలో. గదిలో పుస్తకాల షెల్ఫ్ ఉంది. అందులోంచి తీసినట్టున్నాడు.

"ఏంటా పుస్తకం?" అన్నాను లేచి.

"శాంతి కపోతం - మా రెడ్డి ఛందస్సులో రాసిన కావ్యం."

"మీ రెడ్డి కవి కూడానా?"

"మా రెడ్డి ఏమనేవాడో తెలుసా - యిక్కడ పద్యం అల్లటం, చదవటం ఓ విద్యట. ప్రతి ఊళ్ళోనూ కవులేనట! రాయటం రానివాళ్ళు కూడా పద్యాలు అల్లగలరుట!"

"అలాగా - యింతకీ మీ రెడ్డి భాష ఎలా ఉంది?" - 'భాష'ని నొక్కాను.

"అవునవునోయ్ - మా ఫ్రెండ్‌గదా - మనసుకి కూడా పక్షపాతమే - భాషని పట్టించుకోలేదు" అంటూ పుస్తకం తిరగెయ్యటంలో పడ్డాడు.

"భాష అందాలూ, లోపాలూ తప్ప నీకు మరేమీ పట్టవుగదా! నీ ఫ్రెండంటే నీకు చాలా యిష్టమన్నమాట!" అన్నాను.

ఆ పుస్తకం వాళ్ళిద్దరూ కలిసి చదువుకునే రోజుల్లో రెడ్డి రాస్తూ చదివి వినిపించేవాడుట. సుబ్రావ్ ఆ విషయాలు చెపుతున్నాడు. సుబ్రావ్‌కి భాష పవిత్రంగా ఉండాలి. ఆ మాట ఒప్పుకోడు. నిర్దుష్టంగా ఉండాలని వాదిస్తాడు పైకి. అది చాదస్తం నా దృష్టిలో. ఆధునికత పేరుతో అమెరికాని ఆరాధించే సుబ్రావ్ భాషా చాదస్తం అసంబద్ధంగా అవుపిస్తుంది. దానిమీద కబుర్లు. పనికిమాలిన చిరుబురులు. వాటిల్లో కూడా మనసు నిలవటం లేదు.

టీ వచ్చింది. రెడ్డి రాత్రికి తప్పక వస్తాడని కబురు వచ్చింది.

"బయటకి వెళ్దామా? ఊరు చూద్దాం" అన్నాను. సరేనన్నాడు సుబ్రావ్. తయారయాం. ఆరవుతోంది. గాలి చల్లగా ఉంది. మేడ దిగుతూంటే - రెడ్డి చుట్టంట - వచ్చి పలకరించాడు.

"పల్లెలో గొడవలవుతా ఉండాయి. పోవద్దు సార్!" అన్నాడు.

"మీకూ, మీ ప్రత్యర్థి రెడ్లకీనా?" అన్నాను.

"ఆళ్ళు యిక్కడెందుకుంటారమ్మా?" అన్నాడు.

"మరేం గొడవలు?" అన్నాడు సుబ్రావ్.

"ఏంది చెప్పేది సార్? పల్లెలోవాళ్ళకి గీర్లు పెరిగాయి - తోక జాడించారు. కత్తిరించాం - పల్లెను తగలబెట్టాం - పారిపోయ్యారు" అన్నాడు నవ్వుతూ.

నా నరనరమూ భగ్గుమంది.

"ఏం చేసారు వాళ్ళు?" అన్నాడు సుబ్రావ్ చప్పన.

"పల్లెను తగలబెట్టారా ఎంత దౌర్జన్యం! పద వెళ్ళి చూసొద్దాం?" అన్నాను. అతను మా యిద్దరి మొహాల్లోకి చూసాడు.

"సార్! మీది బొంబాయి. మా రెడ్డిని సూస్తానికి వచ్చింద్రు. ఆయన వస్తాడు. సూడండి. ఎల్లండి. యిక్కడ పల్లెవోళ్ళు ఎంత కట్టుదాటి పోయారో, మీకు తెలిసేలేదు. ఆళ్ళు దెబ్బతిని ఉన్నారు. అదును కోసం సూస్తున్నారు. రెడ్డోరి యింటి సుట్టాలని ఎవరికయినా తెలిసిపోతుంది. ఆళ్ళు మిమ్మల్ని కొడితే - ఎందుకు పంపారని మా రెడ్డి మమ్మల్ని సంపేస్తాడు."

సుబ్రావ్ నా మొహంలోకి చూసాడు.

"ఇవి బాంబే స్లమ్స్ కావు - దయచేసి అర్థంచేసుకో" అన్నాడు ఇంగ్లీషులో.

షబనా ఆజ్మీలాంటి వాళ్ళతో కలిసి, బాంబే స్లమ్ వాసుల కోసం నిర్వహించిన ధర్నాలూ, ఊరేగింపులూ... సుబ్రావ్‌కి ఎందుకు నచ్చుతాయి? అందుకని నాతో నేరుగా పోట్లాడలేదు. అందులో ఆపదల గురించి మాట్లాడేవాడు. ఎంత డిప్లమసీ! అర్థమవుతాడు - అందడు. అతనికి డబ్బు సంపాదనే ముఖ్యం. దానిని పెంచటమే ముఖ్యం. షేర్లు, రియల్ ఎస్టేట్ బిజినెస్... అదే అతని లోకం! ఎంత అంతరం మా లోకాల మధ్య, మా లక్ష్యాల మధ్య! శేఖర్‌ని అతని బారి నుంచి తప్పించాలని నేనూ, నా బారి నుంచి తప్పించాలని అతనూ.... ఎంత పెనుగులాట! అంతిమ విజయం ఎవరిది?

సుబ్రావ్ గొంతులో అదే డిప్లమసీ! అదే ఆపద హెచ్చరిక!

నో! కనీసం దీన్నయినా ఎదుర్కోవాలి.

"పద - వెళ్దాం" అన్నాను సూటిగా.

ఎందుకు రమ్మన్నానతన్ని! ఎందుకు వెళ్ళలేకపోతున్నాను ఒంటరిగా! ఆడదాన్నవటం వల్లనా? అందరు ఆడవాళ్ళకీ నాకూ తేడా ఏమిటి? తను రానంటే?

మనసంతా కోరేస్తున్న ఊలు.

సుబ్రావ్ నా భుజం మీద చెయ్యి వేసి - "పద! కూల్ అవు" అన్నాడు. రెడ్డి చుట్టం మా యిద్దరినీ పరిశీలనగా చూస్తున్నాడు.

సుబ్రావ్ ఎక్కడికి పదమంటున్నాడో అర్థమయింది.

ఉద్రేకాలమీద ఆచరణకు దిగటం ఒక వయో లక్షణమా? వ్యక్తి స్వభావమా? అనేకమార్లు దిగాను. నా దృష్టిలో నన్ను చులకన చేసుకోవటం యిష్టంలేక దిగాను. ఆంధ్రా యూనివర్సిటీలో ఆనాటి విప్లవోద్రేకాలతో ఊగిపోయాను. అది నా స్వభావమనీ, నా ప్రకృతి అనీ అనుకోటంలో ఉన్న 'శక్తి'ని గుర్తించాను. అంతా అనుకోవటం మీదనే ఉందనీ - అదేమీ 'వయో లక్షణం' కాదనీ యీ మధ్య మరీ గట్టిగా అనుకుంటున్నాను.

నేను కదలలేదు.

సుబ్రావ్ నన్నలాగే వదిలి, రెడ్డి చుట్టంతో కిందికి వెళ్ళాడు. తిరిగి వచ్చాడు. "పద, పల్లెను చూసొద్దాం" అన్నాడు. పాదాలు భూమిలోకి కూరుకు పోయివుంటే - లాక్కొని వెళ్తున్నట్టు మేడ దిగాను.

'సుబ్రావ్ పెళ్ళాం ముచ్చట తీర్చాడన్నమాట!'

మేమూ మరో యిద్దరూ ఊళ్ళోకి వెళ్ళాం. పోలీసులు రెడ్డి చుట్టానికి సలాం కొట్టారు. అతను వాళ్ళతో ఏదో అన్నాడు. వాళ్ళు నన్ను వింతగా చూస్తున్నట్లు, నవ్వుతున్నట్లు కనిపిస్తోంది. ఫీలింగ్స్‌ని అణుచుకుంటూ పల్లె పరిస్థితి చూడసాగాను.

మా వేపులాగే ఊరికి చివరగా ఉంది. ఒకే ఒక పెంకుటిల్లు. మిగిలినవన్నీ గుడిసెలు. అన్ని యిళ్ళూ కాలిపోయాయి. ఫైర్ యింజన్ల వల్ల కాబోలు - నీటికి తడిసి గోడలు పడిపోయాయి. వారం రోజులయిందిట. గుడిసెల మీద ఏవో పరిచి లోపల ఉంటున్నారు మనుషులు. మానవులు!

మానవులు! మానవులు!

వృద్ధులు - పిల్లలు - ఆడవాళ్ళు - అశక్తులే కనిపిస్తున్నారు. యువ ముఖాలు కనపడటం లేదు. తరిమేయబడ్డారా - తప్పించుకున్నారా?

ఈ ప్రపంచంలో ప్రతి మనిషీ తనకు బ్రతికే హక్కుండాలని ఎలా వాంఛిస్తాడో, అలాగే యితరులకీ ఉండాలని వాంఛిస్తే - యీ ప్రపంచం యిలా ఉంటుందా?

ఇది పూర్తిగా 'అయితే' 'కానీ'ల ప్రశ్న. గాలి. ఉత్తిగాలి. వాస్తవమేంటంటే - ప్రస్తుత ప్రపంచం కొన్ని 'ఆచరణల' ఫల స్వరూపం. ఈ ప్రస్తుత ప్రపంచంలో విషాదముంది. చైతన్యం ఉంది. అవి మరికొన్ని 'అచరణల'కు దారి తీస్తాయి. నాకు కలుగుతున్న విషాదంతో, నాకున్న చైతన్యంతో ఈ సమాజంలో నా కెదురయే

వాటిని నలుగురి దృష్టికీ తెస్తాను. అదీ ఒక ఆచరణే! ప్రపంచంలో సోమాలియా, ఇథియోపియా, రవాండా, యెమన్ వంటివి ఉన్నాయని ఒక మనిషి, మరో మనిషికి చెప్పటం.... ఆచరణే!

ఒక వృద్ధురాలిని పలకరించాను. ఆమె నా వెనక మనుషులని చూసి చటుక్కున తన గుడిసెలోకి వెళ్ళిపోయింది.

మరో నడివయసు స్త్రీని పేరేమిటని అడిగాను. మాట్లాడలేదు.

"చెప్పవే -" కళ్ళెర్రజేసాడు రెడ్డి.

ఏదో గొణిగింది. అక్కడనించి పారిపోయింది.

స్తబ్దుగా నిలబడ్డాను.

అర్థమవుతోంది - నాతోడి మనుషులనిబట్టే గుర్తింపు నాకు! ఇలాంటి చోట్లకి రకరకాల సమూహాలు వస్తాయి. విలేఖర్లు, ఫోటోగ్రాఫర్లు, వీడియో మాగజైన్లవాళ్ళు, ఫాక్ట్ ఫైండింగ్ కమిటీలవాళ్ళు... యిదంతా ఓ సమూహం. పోలీసులు, సైనికులూ మరో సమూహం. రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులు మరో సమూహం. నేనా క్షణంలో ఏ సమూహానికీ చెందను. నాకు ఒక పరిచయం లేదు. ఉంటే - ఆలస్యమయినా వాళ్ళు గుర్తిస్తారు. స్పందిస్తారు. 'నాగరికులు'గా, 'ప్రజాస్వామ్యవాదులు'గా, 'మానవతామూర్తులు'గా, 'కర్తవ్యపరాయణులు'గా, 'రక్షకులు'గా నటించేవాళ్ళతోసైతం వాళ్ళు ప్రవర్తించ గలరు! నాతోమాత్రం ఆ క్షణంలో వాళ్ళకు అది సాధ్యం కాదు.

దౌర్జన్యానికి లోనవుతున్నవాళ్ళపట్ల నా అంతరంగంలోని సంచలనంలో, వేదనలో ...ఎటువంటి నటనా లేదు. ఇది ముమ్మాటికీ సత్యం. ఈ వేదనకి మానవ సమాజ గమనంలో పాత్ర ఏమిటి? నేను నమ్మే భావజాలం - నా యీ 'వ్యక్తిగత వేదన' మీద, నా 'కర్తృత్వం' మీద నాకు నమ్మకం కలిగించలేదు. సమాజంలో వ్యక్తితత్వంలో 'సామాజిక సమవేదన'' అనే అంశం మీద, ఎలాంటి గౌరవమూ కలిగించలేదు. కేపిటలిస్టు సమాజం యీ వేదనకి ఎన్ని దారులు ఏర్పర్చింది!

నాలోని యీ 'వేదన' శేఖర్‌ని స్పర్శించగూడదనేగదా - సుబ్రావ్ ప్రయత్నం!

కొంతసేపు తిరిగి - లేదు - వాళ్ళు తిప్పితే తిరిగి - లేదు నా శక్తి మేరకు తిరిగి - పలకరించబోయి, భంగపడి, - కనిపిస్తున్న దృశ్యాలు హృదయాన్ని మూగతనంతో నింపుతూంటే - నలుగుతున్న ఆలోచనలు మెదడును కాలుస్తూ వుంటే -

తిరిగి రెడ్డి యింటికి చేరాను. గదిలో మంచం మీద వాలాను.

చీకటి - లోపలినుంచి పైకి - పైనుంచి లోపలికి!

"ఎలాంటి రెడ్డి - ఎలా మారిపోయాడు!" అన్నాడు సుబ్రావ్. మాట్లాడలేదు.

"ఈ పద్యం విను - పల్లెలో దృశ్యాల మీద వాళ్ళ దుస్థితి మీద - ఒకనాడు రెడ్డి రాసిన పద్యం - " అంటూ చదవసాగాడు.

ఆ వాడలో దృశ్యాలను గుండె కరిగేలా చెపుతున్నాడు, కవి.

"ఆపు!" అసహనంగా అన్నాను.

"ఏం?" అన్నాడు ఆశ్చర్యంగా.

జవాబీయలేదు.

"మేం చదువుకునే రోజుల్లోనే రాసాడీ కావ్యం. ప్రపంచంలోని పక్షులన్నీ వచ్చి మానవులు సృష్టించుకున్న అసమానతల గురించి చెప్పుకుంటాయి. మానవుడికి సందేశం యిస్తాయి. అలాంటి రెడ్డి - వాడను తగలబెట్టించాడంటే - ఎందుకిలా మారాడో!" అన్నాడు.

"అతనెందుకు మారాడన్నది నీ బాధ. వీళ్ళెందుకు మారలేదన్నది నా ప్రశ్న"

"సమాజ శాస్త్రజ్ఞులురాలివి నువ్వు చెప్పాలి. అయినా ఎందుకు మారలేదూ- బీ యస్ పీ ఇండియాని రూల్ చేయబోతోంది. ప్రెసిడెంటు వాళ్ళవాడు అవబోతున్నాడు!"

"అవునవును - దళితుల దుస్థితి మీద ఆదిశంకరుడూ మాట్లాడాడు. రామానుజుడూ పోట్లాడాడు. ఏం మారింది? ఈ రోజు ఒక పార్టీకి అధికారం వస్తే - ఒకరు ప్రెసిడెంట్ అయితే - వాళ్ళ దుస్థితి మారుతుందా? మారదు!"

అయితే ఎలా మారుతుందని అడగాలి సుబ్రావ్. ఎందుకడుగుతాడు? మారరాదన్న పట్టుదలా లేదు. మారాలన్న కోరికా లేదు. ఆ దుస్థితి వల్ల అతనికి ప్రయోజనమూ లేదు. నష్టమూ లేదు. నాకు కోరిక ఉంది గదా - దాంతోబాటు మార్పు ఫలానీలా మాత్రమొస్తుందన్న అంచనా ఉందిగదా - ఎప్పుడొస్తుందా పెనుతుపాన్? అందాకా యింతేనా?

మనసంతా ప్రశ్నలు, జవాబులు.

కొంతసేపటికి లేచి పుస్తకాలు చూడసాగాను. అవి డ్రాయింగ్ రూంలో అలంకారం కోసం కొన్నట్లు లేవు. ఆ కలక్షన్‌లో ఒక అభిరుచి ఉంది. గాంధీ, నెహ్రూ, అంబేద్కర్, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, శ్రీశ్రీ.... అన్ని రకాలవాళ్ళూ ఉన్నారు. అవి చదివిన గుర్తులు ఉన్నాయి. ఏవో రాసుకున్న నోట్సులు ఉన్నాయి - ఆ పుస్తకాల మీద.

'మహాప్రస్థానం' తీసుకు కూర్చున్నాను.

రెడ్డి చదువుకున్నవాడనిపించటంతో - చదువుకున్నవాళ్ళ మీద ఏర్పడే సాఫ్ట్‌కార్నర్ ప్రభావం నా మీద పనిచేస్తున్నట్లుంది. ఆలోచనల ఈగలు రెడ్డి చదువు చుట్టూ ముసురుతున్నాయి.

ఎనిమిదింటికి భోజనాలు - తొమ్మిదిదాటాక రెడ్డి వచ్చిన కబురూ - ఆ తర్వాత రెడ్డి రమ్మన్నాడన్న కబురూ

సుబ్రావ్ మొహం నిండా స్నేహప్రకాశం. అంతవరకూ రెడ్డి తన కోసం పరుగులు పెడుతూ రాలేదని మొహం మాడ్చుకు కూర్చున్నాడు. కబురు రాగానే 'పద పద' అంటూ తొందర చేసాడు. మా కోసం వచ్చిన మనిషితో వెళ్ళాం.

అసలు యింటికి కాస్త లోతట్టుగా ఉంది రెడ్డి ఉంటున్న గది.

గది బయట కుర్చీలున్నాయి. అక్కడ కూర్చోబెట్టారు. తతిమ్మా కుర్చీల్లో కొద్దిమంది కూర్చుని ఉన్నారు. నలుగురు మనుషులు అక్కడక్కడ నించుని ఉన్నారు. ఇద్దరి భుజాలనించి తుపాకులు వేలాడుతున్నాయి. ఒకవారగా బకెట్లున్నాయి. వాటిలో ఏవో గుండ్రపాటి వస్తువులు నీటి మీద తేలుతున్నాయి. బాంబులు కాబోలు! ఆ వాతావరణం యుద్ధం మధ్యలో విరామాన్ని గుర్తుతెస్తోంది.

అక్కడ, ఆ రాత్రివేళ ఆ మనుషులూ, ఆ తుపాకులూ....

మనసు పరిపరివిధాల పోతోంది - ఇదంతా ఆత్మరక్షణకా? మరొకరి భక్షణకా?

ఆ వాతావరణం గురించి కొంత ఊహించటం వల్ల పెద్దగా ఆశ్చర్యమూ లేదు, భయమూ కలగలేదు. సుబ్రావ్ మొహం మాత్రం ఎక్సైటింగ్‌గా ఉంది. స్నేహితుడిని చూడబోతున్నందుకా? అతని ఆర్భాటాన్ని చూస్తున్నందుకా?

కొంతసేపటికి మరో యిద్దరు బయటకు వచ్చారు.

"పోండి సార్ - రెడ్డి సూస్తాండాడు" అన్నాడు ఒకడు.

గది లోపలికి వెళ్ళాం.

విశాలంగా ఉంది. ఫర్నిచరు లేదు. ఒక మంచం, ఒక ఫోను, కొంత ఎడంగా రెండు కుర్చీలూ, గోడల మీద - నెహ్రూ, గాంధీ, బాబూ రాజేంద్రప్రసాద్, నేతాజీ.... ఫోటోలు. ఒక రెండు తెలియని మొహాలు ఫోటోల్లో.... పూర్వీకులేమో - రెడ్డికి!

మంచం మీద ఒక వ్యక్తి కూర్చుని ఉన్నాడు. శాలువా కప్పుకుని ఉన్నాడు. సుబ్రావ్ అతన్ని సమీపించి - "గుర్తున్నానా - రెడ్డీ?" అన్నాడు.

అతను గుర్తుపట్టినట్టులేడు.

సుబ్రావ్ అతని పక్కనే కూర్చుని, భుజం మీద చెయ్యి వేసాడు-

"ఎన్నాళ్ళయిందిరా నిన్ను చూసి? ఈ సైడు వచ్చినప్పుడల్లా - నమ్మితే నమ్ము - లేకపోతే లేదు - వచ్చి చూద్దామనుకోటమే!"

సుబ్రావే మాట్లాడుతున్నాడు. ఈ సుబ్రావ్ ఎందుకో మనసుని కదిలిస్తున్నాడు. అతనిలో ఒక గాఢమయిన స్నేహభావన ఉంది. తమ క్లాస్‌మేట్స్ గురించి.... మా పెళ్ళి గురించి.... ఏవేవో సంగతులు.

సుబ్రావ్ ఉద్వేగాలు నాకు తెలుసు. కాని, ఈ మనిషి విపరీతంగా కనిపిస్తున్నాడు. అంతకన్న - ఎలాంటి ఉద్వేగాలూ లేకుండా కూర్చున్న రెడ్డి మరింత విపరీతంగా కనిపిస్తున్నాడు.

మధ్యలో నన్ను పరిచయం చేసాడు సుబ్రావ్. నమస్కరించి కూర్చోమన్నాడు. ఒక కుర్చీలో కూర్చున్నాను.

అతను సుబ్రావ్ చేతిని తన చేతిలోకి తీసుకుని గట్టిగా నిట్టూర్చాడు. తనని తను కూడదీసుకుంటూ మెల్లగా అన్నాడు - "అయ్యగారూ! నేను మీ క్లాస్‌మేట్‌ని కాను. మా అన్న మురళీమోహనరెడ్డి. నేను మదనమోహనరెడ్డిని."

"సారీ సర్!" అంటూ గబుక్కున లేవబోయాడు సుబ్రావ్.

అతను వదలలేదు. పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

"చాలా కాలమయింది - మీ అన్నని చూసి. పొరబడ్డాను. ఎక్కడున్నాడు మీ అన్న?" అన్నాడు సుబ్రావ్.

"మీరూ, మా అన్నా క్లోజ్ ఫ్రెండ్సా?"

"ఏం లాభం? ఇరవై నాలుగేళ్ళలో ఒక్కసారికూడా కలుసుకోలేదు. ఎక్కడ పని చేస్తున్నాడు - మా రెడ్డి?" అన్నాడు.

"మిమ్మల్ని చూస్తే మా అన్నని చూసినట్టుంది" అంటూ ఆగి కొంచెం గద్గదమవుతున్న గొంతుతో - "అన్నను చంపేసినారు సార్.... నాలుగేళ్ళయింది" అన్నాడు.

సుబ్రావ్ కళ్ళలో ఆర్ద్రత - "ఎంతమంచివాడు! ఎవరు చంపేసారు?" అన్నాడు. అతను బాగా షాకయాడు.

రెడ్డి అతని భుజం మీద చెయ్యి వేసి నొక్కుతున్నాడు.

సుబ్రావ్‌ని చూస్తే జాలి. అతన్ని చూస్తే జాలి. ఆ నిశ్శబ్దం గడుస్తున్నకొద్దీ- నేను బాధపడుతున్నాననీ, వారి మీద జాలి పడుతున్నాననీ అర్థమయినకొద్దీ నామీద నాకే జాలి, చిరాకు. అసహ్యం. వాళ్ళిద్దరికీ ఆ చనిపోయిన మనిషి ఏదో ఒకటి అవుతాడు. నాకు ఏమీ కాడు. వారిద్దరి దుఃఖంలో సంబద్ధత ఉంది. నా దుఃఖంలో? కాలిన గుడిసెలలో... బంధువులను కోల్పోయినవారి నేత్రాలతో....నాలో రేగిన కసి, కోపం ఏమయ్యాయి? రాక్షసుల మరణాలకు సంబరాలు జరుపుకుని, నరక చతుర్దశులు చేసుకునే సంప్రదాయం మనకుంది - ఆ రెడ్డి మాత్రం నరకాసురుడు కాదా? మంచివాడా? ఎలా అవుతాడు?

క్రమంగా అతను వాళ్ళ అన్న చనిపోయిన వైనం చెప్పసాగాడు. నా మనసులో ఆలోచనలు జోడిస్తూ వింటున్నాను. ప్రతిదాని వెనకా ఆర్థిక కారణం కనిపెట్టడానికి యిచ్చగించే మనసుకి ఆ తగాయిదాలలో ఆర్థిక కోణం అంతుపట్టడం లేదు.

మధ్య మధ్యలో సుబ్రావ్ రెడ్డి మంచితనం గురించి మాట్లాడుతూ ప్రశ్నలు వేస్తున్నాడు.

బండపల్లి రెడ్లకీ - వాళ్ళ కుటుంబానికీ మధ్య తరతరాలుగా గొడవలున్నాయిట. స్వతంత్రానికి ముందు ఒకరి మనుషులను ఒకరు బహిరంగంగానే ఎదుర్కొనేవారుట. క్రమంగా రహస్యంగా దెబ్బతీయడాలు పెరిగాయి. ఎవరికివారు ఆత్మరక్షణ కోసం మనుషుల్ని పోషించటం, ఆయుధాల ఖర్చు తప్పనిసరయింది. అనేక యితర అంశాలు యీ గొడవలకు తోడయాయి. రాజకీయాలు, ఎన్నికలు, బూత్‌లు పట్టుకోవడాలు, సారా పాటలు, పోలీసులు..... కేసులు,.... మోహన్రెడ్డి కొన్నాళ్ళు ఉద్యోగం చేసాడట. అతని తండ్రిని చంపేసాక, ఉద్యోగం విడిచిపెట్టి కుటుంబ బాధ్యతని తీసుకున్నాడుట. అతని తండ్రిని చంపిన వాళ్ళని చంపించాడట. మరికొన్నేళ్ళు వాళ్ళు వేటాడారట. అనేకసార్లు తప్పించుకున్నాడట. చివరికి బాంబులు వేసి, అతను ప్రయాణం చేస్తున్న జీప్‌ని పేల్చేసారుట.

అతను చెప్పుకుపోతున్నాడు.

హత్య!

ఎంత సాధారణ విషయం యిక్కడ! ప్రపంచమంతటా హత్య అనాగరికమన్న భావన ఎక్కువవుతోంది. వ్యక్తిగత కారణాలతో హత్య జరగటం అనాగరికమని దాదాపుగా అంగీకరించబడింది. జాతి, మతం వగైరా సమూహ నామాలతో జరిగే హత్యలమీదమాత్రం అటువంటి ఏకాభిప్రాయం లేదు గదా!

వాళ్ళ మాటలను వింటూ, గొంతుకలను గమనిస్తున్నాను.

బాధ. ఓదార్పు.

హరిజనవాడ గుర్తొస్తోంది. కాలిన యిళ్ళు. బాధాభరిత మానవ నేత్రాలు...

ఈ ప్రపంచం దుర్మార్గుల నవ్వుని భరించలేదు. దానిని వికృతహాసంగా ప్రదర్శిస్తుంది కళ. దుర్మార్గుడు గొంతెత్తి ఏడిస్తే? బహుశా ప్రపంచం కరుగుతుందేమో! దాన్ని చిత్రించగలిగిన కళకు ఉదాత్తత ఏర్పడుతుందేమో!

నాకు మాత్రం ఆ రెడ్డి విషాదం దుస్సహంగా ఉంది. దాన్ని కప్పిపుచ్చుతున్నది నా 'నాగరిక ప్రవర్తన'గా అనిపించి, నా మీద నాకే రోతగా ఉంది.

"మా ప్రాంతంలో యీ ఫాక్షన్ ఫైట్స్ లేకపోతే - మేమూ మీవాళ్ళలాగే బాగుపడేవాళ్ళం" అంటున్నాడు.

సుబ్రావ్ గంగిరెద్దులా అన్నింటినీ ఒప్పేసుకుంటున్నాడు. రక్తం చూస్తే కళ్ళు తిరిగి క్రిందపడే పెద్దమనిషి ఆ హత్యలు జరగాల్సినవేనన్నట్లు తలూపుతున్నాడు.

"మీరన్నదంతా బాగానేవుంది రెడ్డిగారూ! మీ అన్న గురించి యింత బాధపడుతున్నారు గదా - మీరు చంపిన దళితుల మాటేమిటి?" అన్నాను. అడగవలసిన ప్రశ్న అడగవలసిన పద్ధతిలో అడగలేకపోయానన్న బాధ.

సుబ్రావ్ కంగారుగా - "ప్లీజ్ సునీ! ఇది సమయం కాదు - సందర్భం కాదు" అన్నాడు యింగ్లీషులో. అంటూ లేవబోయాడు.

సుబ్రావ్ చేతిని వదలలేదు రెడ్డి. నా ప్రశ్నకి ఆశ్చర్యపడలేదు కూడా. నిదానంగా నావేపు చూసాడు. సన్నగా నవ్వాడు. సుబ్రావ్‌ని పక్కన కూర్చొబెట్టుకున్నాడు.

"అమ్మా! మీరిందాక పల్లెలోకి వెళ్ళారుట - పైపైని చూసారు - లోపల విషయాలు మీకు తెలియవు" అన్నాడు యింగ్లీషులో.

"ఎందుకు తెలీదూ" అంటున్నాను.

"మీకు తెలిస్తే - ఏం తెలుసునో చెప్పండి."

"పేపర్ తెరిస్తే తెలుస్తుంది - రేడియో వింటే తెలుస్తుంది - టీవీ చూస్తే తెలుస్తుంది - దళితుల మీద దాడులు. మీరు తాగిన చోట కాఫీ తాగారనో - చూసిన చోట సినిమా చూసారనో - మొక్కిన దేవుడిని మొక్కారనో - మీ మాట వినలేదనో - మీరు వెయ్యమన్న చోట ఓటు మీద ముద్ర గుద్దలేదనో! అది మీకు తోక జాడించటం - మీ డ్యూటీ దాన్ని కత్తిరించడం - " మనసులో ఉన్నదంతా కక్కేసాను.

'మీరేం చదివారు?"

"సోషియాలజీలో ప్రొఫెసర్ని."

"నేను లా చేసాను. ప్రాక్టీసు మానుకుని - యీ ఊరికి వచ్చాను."

ఏం చేబుతున్నాడో అర్థం కాలేదు.

"సమాజాన్ని కొందరు నడిపిస్తారని నేనూ నమ్మానమ్మా! కొందరిని నేనూ, మా అన్నా ఆరాధించాం! కానీ - క్రమంగా తెలిసిందేమిటంటే - ప్రతి మనిషినీ-వాడు ఎంత హోదాలో ఉన్నా - సమాజమే నడిపిస్తుంది-" అంటున్నాడు.

"అవునవును - మీ చేతికి కిరోసిన్ డబ్బా. అగ్గిపెట్టె యిచ్చి, ఆ గుడిసెలను కాల్చమంది - సమాజం!" అన్నాను వ్యంగ్యంగా.

"మీరు కరెక్ట్‌గా చెప్పారు" అన్నాడు నిష్కర్షగా.

ఆ సమాధానంలో నిస్పృగ్భతనం కనిపించి, నన్ను ఆశ్చర్యచకితురాలిని చేసింది.

అతను ఎలాంటి ఆవేశమూ లేకుండా అన్నాడు - "చూడమ్మా! తన చేనుకి, పంటకీ వెయ్యిన్నొక్క కాపలాలు కాసుకోవాలి రైతు. ప్రకృతి నుంచి, పిట్టల నుంచి, క్రిమికీటకాల నుంచి, జంతువుల నుంచి, దొంగలనుంచి, రాజ్యం

నుంచి. బ్రతుకంతా రైతుకి పోరాటమే! గోష్పదమంతటి మడి చెక్కకోసం తన ప్రాణాలు ధారపోస్తాడట భారతీయ రైతు. ఆ మాట అన్నది ఎవరో కాదు - మార్క్స్! ఆ స్వభావం మంచి చెడ్డలు నాకు తెలీవు. అది రైతు స్వభావం. గ్రామ స్వభావం. ఉందనుకున్నదేదో పోతుందనిపించితే దాని రక్షణకు ఏమయినా చేస్తాడు. ఎంతకయినా తెగిస్తాడు. నేను కాదంటే మరొకడు వాళ్ళని నడిపిస్తాడు. వాళ్ళ చేతిలోంచి కిరోసిన్ డబ్బా, అగ్గిపెట్టె అందుకుంటాడు-" అంటున్నాడు.

"చూస్తున్నారుగనక చెత్త సినిమాలు తీస్తున్నారుట - చదువుతున్నారు గనక చెత్త రాస్తున్నారుట - కొంటున్నారు గనక చెత్త తయారు చేస్తున్నారుట - ప్రతివాడూ తన తప్పులను - ప్రజల మీదికి నెట్టేస్తాడు. ఇంతకాలంగా జరుగుతున్న కుల, మత కలహాలను - యీ అనాగరిక చర్యలను - మీరు తలుచుకుంటే ఆపలేరా?" అన్నాను.

మా సంభాషణ యింగ్లీషులో సాగుతోంది.

"ఆపలేం!" అన్నాడు రెడ్డి.

"చాలా దారుణంగా మాట్లాడుతున్నారు" అన్నాను.

"అది దారుణంగా వినిపించినా సత్యం! కుల, మత కలహాలు అనాదిగా జరుగుతున్నాయని మీరంటున్నారు. ఒక కులానికీ, ఒక కులానికీ మధ్య దాదాపుగా చరిత్రలో ఎక్కడా యుద్ధం జరగలేదు."

"శైవ, వైష్ణవ యుద్ధాల మాటేమిటి?" అన్నాను సాలోచనగా.

"అవి రెండు మతాలని యీనాడు ఎవరూ అంగీకరించరు. కులాల మధ్య అంతులేనంత ఏహ్యత ఉన్నా - కులాలుగా - మనం ఎప్పుడూ కొట్లాడుకోలేదు"

ఆలోచనగా చూసాను.

"రాజులు రాజ్య విస్తరణ కోసం, పగలకోసం, పౌరుషాల కోసం తమ కులం వాళ్ళమీదే దండెత్తి మాకులాగ చంపుకున్నారు గాని - ఒక కులం మరో కులం మీదకు దండెత్తి చంపలేదు. మతం కూడా అంతే!"

"నిజమేనండీ! ఈ విషయం నాకు ఎప్పుడూ తట్టలేదు" అన్నాడు సుబ్రావ్.

నన్ను ఆలోచనలో పడేసిన ఉత్సాహంతో అన్నాడు రెడ్డి:

"మన దేశం కులాలుగా విడిపోయి బ్రతికిందిగానీ - కొట్లాడుకోలేదు."

"సమూహాలను అణచి, చెప్పుచేతల్లో ఉంచుకోటానికే కులాలను ఏర్పరిచాయి పాలకవర్గాలు" అన్నాను.

"అది మీ అభిప్రాయం. నేను చెపుతున్నది వాస్తవాలు - కుల, మత కలహాలు యిప్పుడు ప్రారంభమయాయి. స్వతంత్రానికి ముందు బ్రిటిష్ వాడి చలవ వల్ల మత కలహాలు మొదలయాయి. ఇది వాస్తవం. దీని వెనక చైతన్యం ఉందా - అణిచివేత ఎక్కువయిందా? యివ్వన్నీ అభిప్రాయాలు" అన్నాడు.

"అంతా రాజకీయం సార్!" అన్నాడు సుబ్రావ్.

రెడ్డి అతని మాట పట్టించుకోలేదు. నన్నే చూస్తూ కొనసాగించాడు. అతను ఎటు నడుపుతున్నాడా అని ఆలోచిస్తున్నాను నేను.

"కులం పోవాలని అందరూ అంటారు. దాన్ని మరిచిపోయి - కులాంతర వివాహాలు జరిగితే కులం పోతుందని చాలా కాలంగా అంటున్నారు. కులానికి స్థానం లేని పారిశ్రామిక యుగంలో కులం దానంతట అదే పోతుందని కమ్యూనిస్టు మిత్రులు అన్నారు. మీ పట్నాలలో, నగరాలలో ఆదర్శవాదులూ ఉన్నారు - పారిశ్రామిక సమాజమూ ఉంది - అక్కడ కులం పోయిందా?" అన్నాడు రెడ్డి ఆదోలా.

"పోయింది రెడ్డిగారూ మాది కులాంతర వివాహమే" అన్నాడు సుబ్రావ్.

"నేనూ క్రిస్టియన్‌ని పెళ్ళాడాను. ఇలాంటి కొన్ని పెళ్ళిళ్ళ వల్ల కులం పోతుందని - పోయిందని నాకు అనిపించటం లేదు."

"మీరేం చెప్పదల్చుకున్నారు?" సూటిగా అడిగాను.

"నేనేం చెప్పదల్చుకున్నానంటే - మీకు పల్లెటూళ్ళు తెలియవు. వాటి సమస్యలు తెలీవు. ఈ రోజున నేను ఎవర్నో నరికితే రేపు వాళ్ళు నన్ను నరుకుతారు. కుల కలహాలూ, కులాంతర కలహాలూ రెండూ తెలుసు నాకు. చంపేవాడెవడైనా చావుకి తెగించినవాడే!" అంటూ ఆగి -

"చూడమ్మా! మా బ్రతుకులు మేం నడిపించుకోవాలని - మా అన్నా, నేనూ - ఎన్ని కలలు కన్నాం - ఏమయింది? మా తాతలూ, వాళ్ళ తండ్రులూ గర్వంగా, పౌరుషంగా కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడగలిగేవారు. కనీసం మాకు ఆ అవకాశం కూడా లేదు. మేం శాంతి గురించి కబుర్లు చెప్పాలి. అహింస గురించి పేపర్ స్టేట్‌మెంట్లివ్వాలి. మేం చేసిన వాటిని కాదనాలి. నిన్ను మా మీద జాలిపడమనటం లేదు. మాలాంటివాళ్ళ చావువల్ల యీ సమాజం బ్రహ్మాండంగా మారిపోతే - మంచిదే! చాలా మంచిది! కాని, మారదు. ఇది వాస్తవం. కొత్త రూపాలలో పాత సమస్యలే వస్తాయి. కొత్త వేషాలతో పాత నాయకులే వస్తారు. మీలాంటి పడక కుర్చీ సిద్ధాంత వేత్తలకు పుస్తకాలు తెలుసు. సిద్ధాంతాలు తెలుసు. ఎందులోకీ దిగకుండా అన్నింటినీ వ్యాఖ్యానించటం తెలుసు! మీరు ఆస్తులు పెంచుకుంటూ - ఆస్తి హక్కు వద్దనగలరు. మీరు సంసారాలు చేసుకుంటూ - యింకొకరిని చేసుకోవద్దనటం తెలుసు! మీ పిల్లలకి పెద్ద పెద్ద చదువులు చెప్పించుకుంటూ - మీ భావమాలిన్యం అంటకుండా పెంచి - మరొకరి పిల్లలని త్యాగాలు చేయమని, తుపాకులు పట్టుకోమని అరవటం తెలుసు! కుల మతాలు వద్దని కబుర్లు చెబుతూ - మీ యూనివర్సిటీలలో పిల్లగాళ్ళ బ్రతుకుల్ని కుల రాజకీయాలతో సర్వనాశనం చెయ్యటం తెలుసు! మా పొలిటీషియన్స్ - మీలాంటి వాళ్ళ లెక్కల ప్రకారం -

కుల, మత భావాలను - రాజకీయ లాభంకోసం వాడుకుంటాం - కుల సంఘాలు నడుపుతాం - మత కలహాలతో అమాయకులను చంపుతాం - మీవంటి ప్రొఫెసర్లు - పెద్ద చదువులవాళ్ళు - ఏ లాభాల కోసం యూనివర్సిటీలను కుల రాజకీయాలతో ముంచేస్తున్నారు?"

అతను ఆవేశంగా అన్న మాటలకు నా దగ్గర సమాధానాలున్నాయి. నువ్వు తప్పు చేస్తున్నావంటే - నువ్వు చెయ్యటం లేదా అంటున్నాడు. నా భావాలూ, చేతలూ వేరు కావు. దుర్మార్గుడికన్నా, వాడి సిద్ధాంతం ప్రమాదకరం. తోడి మనుషులు తమతో సమానులు కారన్న భావజాలపు పునాది మీద ఉన్న భారతీయ సమాజం యిలాంటి బలహీనులనే నాయకులుగా చేసుకుంటుంది.

ఇలాంటివాడితో మాట్లాడి ఏం లాభం? చెవిటివాడి ముందు శంఖనాదమే! మోహరించివున్న రెండు సైన్యాల మధ్య కృష్ణుడంతటివాడు - నీతులు చెప్పలేదు. యుద్ధం నడిపాడు. యుద్ధం చెయ్యమన్నాడు. ఏదో పక్షం వహించాడు.

ఆ సైన్యాలు రెండూ పేదలూ, ధనికులూ అవుతాయని నమ్మాను. ఆ యుద్ధం యిలా పరిణమించటం - పరిణామక్రమమా? దానికి అవరోధమా? ఇది యింజనీర్-డా? మనసుని ఆలోచనలు సలుపుతున్నాయి.

గట్టిగా నిట్టూర్చాను.

"మేడమ్‌కి నా పనులూ నచ్చవు - నా మాటలూ నచ్చవు. ఈ విషయం వదిలేద్దాం! సుబ్బారావుగారూ" అంటూ సన్నగా నవ్వాడు.

వాళ్ళ మాటలు మొదలయాయి.

సన్నని మంట. నా హృదయాంతరాలలో నన్ను నేను వేసుకోలేని - నిలదీసుకోలేని ప్రశ్నల మంట.

నేను సెలవు తీసుకుని గదికి వెళ్ళాను.

అతని నవ్వు నన్ను తరుముతోంది. మనసంతా ఆలోచనా శూన్యం.

పైపైపొరల నుంచి శేఖర్ నవ్వు. శేఖర్ పిలుపు. శేఖర్ ఏడుపు.

అలా పడుకుని ఉన్నాను.

కొంతసేపటికి సుబ్రావ్ వచ్చాడు - లైటు వేసాడు. నేను కళ్ళు మూసుకున్నాను. మొదలెట్టాడు -

"సునీ! నువ్వు నిజంగా వండర్‌ఫుల్ - నీకు ఎక్కడ మొదలు పెట్టాలో తెలుసు- ఎక్కడ విడిచి పెట్టాలో తెలుసు."

రెడ్డిలాంటివాడిని పేల్చేసానుట!

నాతో బ్రతుకు అద్భుతంట! సెక్యూర్‌డ్‌ట!

"షటప్!" అరుద్దామనుకున్నాను.

నిస్సత్తువ!

"నిద్రపోయావా?" అని అడిగాడు దగ్గరకు వచ్చి. నన్ను కదపటానికి సాహసించలేదు.

తెల్లవారుజామున బయలుదేరాం.

మెయిన్‌రోడ్ మీదకు వచ్చేసరికి - సూర్యుని రాక తెలిపే ప్రకాశం.

కొండలు, గుట్టలు. చల్లని గాలి స్పర్శ. రాత్రంతా నిద్రలేమి.

లోపలి స్వార్థాలూ, భయాలూ... ఆ పై పొరలోని నమ్మకాలూ, చేస్తున్న పనులూ ఒకదాన్ని ఒకటి ఢీకొంటూంటే.... ఒకదాన్ని ఒకటి అనుసంధించాలని ....ఒక్క రాత్రితో అవుతుందా? ఒక జీవితం సరిపోతుందా?

తప్పదు - ఎక్కడో ఒకచోట ఆరంభించాలి - ఇక్కడే ఇప్పుడే ఆరంభించాలి -

"ఇన్‌సెక్యూర్డ్ ప్రపంచంలో జీవిస్తూ ....సెక్యూరిటీ అనే మృగతృష్ణ వెనకాల ఎన్నాళ్ళీ పరుగు సుబ్రావ్? శేఖర్‌ని మనతోటే ఉంచుకుందాం. కారు వెనక్కి తిప్పు" అన్నాను దృఢంగా.

నా మాట అర్థం కానట్టు - "రాయలసీమలో గొడవలకీ మన వాడి స్కూల్‌కీ సంబంధం లేదు - అర్థం చేసుకో" అంటూ ఆరంభించాడు తాపీగా.

"సుబ్రావ్! నటనలు విడిచిపెడదాం - కారు వెనక్కి తిప్పు" అన్నాను.

నాకు తెలుసు -

సుబ్రావ్ కారు వెనక్కి తిప్పడు.

ఇంతవరకూ - మా ఉమ్మడి జీవితంలో పరస్పరం చూస్తూ వచ్చిన ఆ సెక్యూరిటీ కూడా మాయమౌతుంది - అదీ తెలుసు.

*భద్రమైనదీ, బలమైనదిగా భావించే ప్రతీదాని పునాదీ డొల్ల! డొల్ల!! డొల్ల!!!* - అనికూడా తెలుసుకున్నాను.

*('రచన' మాసపత్రిక - ఏప్రిల్, 1995)*

# రొట్టెముక్క

మాలపల్లి నుంచి ఊరికి వచ్చే రోడ్డుమీద వెంకమ్మ నడుస్తోంది. నల్లని చాయ! మాసిన గళ్ళచీర! ఆమె యవ్వనంలో ఉన్నా ఎందుకో ఉండవలసినంత ఆకర్షణీయంగా ఉన్నట్లు లేదు.

చూచుకాలు నల్లబడి భర్తల హృదయాలు కళవళపడగా రాకుమార్తెలు గర్భం దాల్చి రాజమాతలు కాబోయే తరుణం - మాలదీ, బీదదీ అయినా ఆడదికూడా కావటంవల్ల ఆమెకు కూడా వచ్చింది. ఏవో ఆలోచనల మేఘాలు ఆమె ముఖాన్ని క్రమ్మిఉన్నాయి:

ఆ ఆలోచనల మేఘాలకి ఆకారం-ఒక పెద్ద రొట్టె! కారణం ఒక చిన్న రొట్టెముక్క. ఆమె చేతిలో పురికొసతాళ్ళతో మూతులు కట్టిన మూడు సీసాలూ, మడత పెట్టిన రూపాయి కాగితమూ ఉన్నాయి. మరో చేతిలో కుండ ఉంది.

షావుకారు కొట్టు దగ్గిర సీసాలనీ, రూపాయినీ ఇచ్చి, బేడ చింతపండు, బేడ కిరస నూనె, బేడ నూనె, అర్ధణా 'కారం', అణా పొగాకు కట్ట తీసుకుంది. పొగాకు కట్ట వాసన చూస్తూ "వాసనే లేదు" అంటూ ప్రతిదాన్నీ "కూంతెయ్యండి షావుకారయ్యా!" అంటూ కొసరుతూ బేరం పూర్తిచేసింది. మిగిలిన డబ్బులు రొంటిన దోపుకొని సీసాలను ఆ అరుగుమీదే విడిచి చెరువుకు నడిచింది. ఆ చెరువుకు మాలవాళ్ళ రేవు అది. మిగిలిన రేవులన్నీ కాస్త బాగా కట్టబడి ఉన్నాయి. ఈ రేవులో మాత్రం నాలుగు రాళ్ళని పేర్చి రేవు చేశారు. జాగ్రత్తగా చూసుకోకపోతే నాచుపట్టిన వంకరటింకర రాళ్ళమీద చాలా ప్రమాదం.

చెరువులో నీళ్ళు ముంచుకొని ఒడ్డుమీదకు వచ్చేసరికి ఆమెకు అలుపు వచ్చింది. కొద్దిసేపు నిలబడి ఆయాసం తీర్చుకుంటూండగా బిందె తోముకుంటున్న నారమ్మ పల్కరించింది.

"ఏటుందప్పా! అలుపొచ్చింది."

"అంతేమరి! సేతి సాయం లేదాయిరి" అంటూ నారమ్మ తోమిన బిందె తొలచటాన్కి రేవులోకి దిగింది.

చెరువు పక్కనే నుయ్యి! నూతి దగ్గర పెద్ద కులాలవాళ్ళు నీళ్ళు తోడుకుంటున్నారు. కాపుల్ని బ్రతిమలాడుకుంటూ కొందరు మాలవాళ్ళ ఆడవాళ్ళు కుండలతోటి, బిందెలతోటి నూతి చపాటా చుట్టూ నించున్నారు నీళ్ళకోసం. "ఆళ్ళు యెకసక్కాలాడతా పేద్ద గొప్పగా పోస్తారు" అనుకుంటుంది వెంకమ్మ. ఆమెకు నూతి నీళ్ళకోసం దేబిరించటం 'అసయ్యం.'

చెరువు గట్టుమీద "బామ్మర్లు" చేరి హస్కుకొడుతున్నారు. సాయం కాలందాకా పేకాట! సాయంకాలం అయేసరికి చెరువు గట్టుమీద చేరటం.

"మా రోజుల్లో ఊరు మొత్తానికి రెండో మూడో పెంకుటిళ్ళుండేవి. ఇప్పుడు.. వూళ్ళో మూడోవంతు పెంకేపేశారు. అప్పుడు... అంకిలోరి లోగిట్లో సుబ్బారాయుడూ, మా తాత, మరో యిద్దరో తప్పితే ముగ్గురో పయిమీద చొక్కా కట్టేవారు, పంచె కట్టేవారు. ఇప్పుడు నూటికి నూరు మందీ పంచెలూ కడుతున్నారు, చొక్కాలూ తొడుగుతున్నారు. ఇత్తడి బిందెలు, రాగి బిందెలూ వూళ్ళో నాలుగయిదు కొంపల్లో ఉంటే రెండుమూడు ఇళ్ళల్లో వాటిని అటకలమీద దాచుకునేవారు! పండగలకు తోముకునేవారు. యిద్దరో ముగ్గురో, మంచినీళ్ళకువాడుకొనేవారు. ఇప్పుడు - అలా చూడరా నూతి చుట్టూ యిత్తడి బిందెలే, ఆఖరికి ఆ మాలాళ్ళకి కూడా .... తస్సాదియ్యా! మన ఇళ్ళలో ఏమున్నాయి? నా మొఖం! అలా మాలపల్లిలో కెళ్ళిచూడు.... అందరిదగ్గరా ఎంతో కొంత ఇత్తడి... వూరికే తిట్టుకోటమే కాని స్వాతంత్ర్యం వచ్చాక ఎంత అభివృద్ధి జరిగింది! ఎంత మార్పు..." పెళ్ళాం తరపు ఆస్తి కలిసివచ్చి నాలుగు రాళ్ళు వెనకేసుకుని అందరి చేతా ఔననిపించుకుంటున్న అనంతనారాయణ ఉపన్యాసం: ఉన్న వూళ్ళోనే ఆయన మాస్టారు.

"ఉండదా! వాళ్ళ యిళ్ళలో చిన్న పిల్ల దగ్గిర్నుంచి ముసలి వగ్గుదాకా అందరూ కష్టపడేవాళ్ళే. ఏమాట కామాటే చెప్పుకోవాలి. పెద్ద పెద్దాళ్ళ దగ్గర నుంచి మన కుర్రాళ్ళ దాకా అంతా వాళ్ళకి వత్తాసే! రూపాయి కూలేం కిడుతుంది? రూపాయిన్నర అన్నారు. రూపాయిన్నర రెండున్నర అయింది. ఇప్పుడు మూడున్నర అవుతోంది. ఈ డబ్బంతా ఏం చేసుకుంటారు? వాళ్ళకి ఎంత తెచ్చుకున్నా గంజినీళ్ళే. మనకి ఏం లేకపోయినా కంచంలోకి నాలుగూ ఉంటేనేగాని గడవదు. అందుకేరా అబ్బాయ్! వాళ్ళు అలా అలా పయికి పోతున్నారు. మనమిలా తగలడుతున్నాం." మరొక పెద్ద బొజ్జ పెద్దమనిషి వ్యాఖ్యానం.

బామ్మర్లు ఎందికిలా మాట్లాడుకుంటుంటారో ఆమెకి అర్థం కాదు. ప్రతిరోజూ అక్కడే ఏదో వాదించుకుంటూ ఉంటారు. ఆమె సీసాకాయలను తీసుకుని గుడిసెకు వెళ్ళింది. లోపలంతా చీకటిగా ఉంది. సీసాకాయల్ని కొంచెం వంగి దించేసరికి ఆమెకు కడుపంతా బిగబట్టినట్లయింది.

అలాగే నెమ్మదిగా భుజంమీదకి, భుజంమీంచి చేతుల మీదకు, చేతులమీంచి మోకాలి దన్ను మీదకి దించి కిందకు పెట్టింది కుండను. కొంచెం సేపు సేద తీరాక, నెమ్మదిగా తడుముకుంటూ వెళ్ళి దీపంబుడ్డి తెచ్చి, అందులో కిరస నూనె పోసి, వత్తి కొద్దిగా పయికి లాగి, దానిని వెలిగించి గూటిలో పెట్టింది.

కొద్దిగా నూకలుంటే, దాకలో వేసి, గంజి కాచింది. మిరపకాయలు, చింతపండూ, ఉల్లిపాయా కలిపి కారం తయారుచేసింది. భర్త యింటికి వచ్చేసరికి బయట కూర్చుంది. ఇందాకట్నుంచి ఆమె ఏవేవో పనులు చేస్తూనే ఉంది. అయినా మనసంతా రొట్టె మీదనే ఉంది.

పొద్దుటే అమె యజమాని యింటికి వెళ్ళింది. పాచిపని, కళ్ళాపు జల్లటం, పేడపని అన్నీ అయేసరికి వీరాయమ్మగారు పిలిచింది.... "అసలే వట్టి మనిషివి కాదు! యింకేం పాటడతావుగాని వచ్చి ఈ రొట్టెముక్క తినిపో! అన్నట్టు అ వసారా మీద కుంచెడు బియ్యం పోశాను, కాస్త చెరిగేసి వెళ్ళిపో" అన్నది.

శనివారం రాత్రి పట్నం వెళ్ళిన మొగుడొస్తాడుగదా అని ఆవిడ రొట్టె ఎక్కువగా కాల్చింది. తీరా అతను రాకపోయేసరికి సగానికి సగం మిగిలిపోయింది. పొద్దుటి ఆ రొట్టె వాసన చూసి 'వెధవది, పాసిపోయిందో ఏమో!' అని అనుమానపడింది మనవలికి పూర్తిగా బొక్కబెడితే, బాగుండదని సగంముక్క 'దాని యెదాన కొట్టాల్సొస్తోంది" అనుకుంటూ "పోన్లే పుణ్యమేగదా" అని మనసు నచ్చజెప్పుకొని వెంకమ్మకు పడేసింది.

ఇల్లు చేరాక రొట్టె ముక్క తింది వెంకమ్మ. అది తిన్న దగ్గరనుంచీ ఆమెకు ఎలాగయినా చక్కగా కాల్చిన రొట్టె తినాలని ఒకటే మనసయిపోయింది.

"దానికేటుందే! అమ్మగోరితో సెపితే సిటికలో కాల్చి పెడతారు" అన్నాడు కుప్పాలు. అతని పూర్తి పేరు కృపానందం. మతం పుచ్చుకోవటం వల్ల ఆ పేరు పెట్టారు. ప్రతి ఆదివారం వెళ్ళకపోయినా పనుల్లేని రోజుల్లో మాలపేట మొగదల్నే ఉన్న "మాల చర్చి"కి వెళతాడు. ఆ వూళ్లో మూడు చర్చిలు ఉన్నాయి. మాల చర్చి పాకలో ఉంటే, గొల్లల చర్చి పెంకుటింట్లో ఉంది. కాపుల చర్చి పెద్ద కట్టడంలో ఉంది. ఒకరి చర్చిలోకి మరొకరు వెళ్ళరు.

కుప్పాలు యిప్పుడు పాలికాపుదనం మానేశాడు. కూలి పనుల రోజుల్లో గంజి నీళ్ళకి లోటు లేకుండా జరుగుతున్నా కూలి లేని రోజుల్లో ఆగంజినీళ్ళకి కూడా కటకట పడిపోతున్నాడు. దూరం అనుకోకుండా పోయొస్తూంటే అంతంత మాత్రంగా పనులు దొరుకుతున్నాయి. ఏదయినా రెండు మూడొందలు పోగుచేసి చిన్నమడి చెక్క "పాలు"కి తీసుకోవాలన్న ఊహయితే ఉందిగాని రెండు మూడు వందలంటే మాటలా! పాలికాపుగా ఉంటూ కాపు మంచాడయితే పుంతలు ఊడ్చుకోవచ్చుగాని - ఎందుకో అతనికి ఇష్టం లేకపోయింది.

చిన్నతనం నుంచి నారాయణమూర్తి కవతంలోనే ఉండేవాడు. బామ్మర్లన్న మాటేగాని కాపుకన్న ఎక్కువగా కష్టపడేవాడు మూర్తిపంతులు. ఆయన దగ్గరే దుక్కిదున్నటం నేర్చుకున్నాడు కుప్పాలు. ఆయన దుక్కిని చూసి కాపులు ముక్కు మీద వేలు వేసుకునేవారు. అయితే ఏం లాభం? పట్నం ఆసామీ భూమి 'కవులు'కి తీసుకుని వ్యవసాయం చేసేవాడు మూర్తిపంతులు. అది కాస్తా కౌలుదారీ చట్టం వస్తుందనేసరికి ఆ అసామీ అమ్మేసుకోటం; మూర్తిపంతులూ, ఆయన తమ్ముడూ రెక్కలే ఆధారంగా నిలబడటం జరిగిపోయింది.

ఆ రోజు కుప్పాలుకి బాగా గుర్తు. తమ్ముడు "ఉప్పు బస్తా పట్టుకొచ్చి భూమంతా జల్లేస్తా"నని కళ్ళమ్మట "రగతంసుక్కలు" రాలుతూండగా గొడవ చేశాడు. అన్న కన్నా ఎక్కువగా గొడ్లు కడగటం దగ్గర నుంచి అన్ని పనులూ చేస్తూ అహర్నిశలూ భూమినే నమ్ముకుని పొలంలోనే ఉండిపోయేవాడు. ఆ క్షణంలో మొదటిసారిగా కుప్పాలుకి అనిపించింది. "బగమంతుడు నేడేమో! యింత గోరకలి జరగతా వుంటే సూత్తా వూరుకుంటాడా?" అని.

కాని "బగవంతుడు సూత్తానే" ఊరుకున్నాడు. అన్నదమ్ములిద్దరికీ చెరికో ఎకరాన్నరా మిగిలింది. అది కూడా పంచేసుకుని విడిపోయారు ఏదో మాటమీద మాటొచ్చి. మూర్తిపంతులు విడిపోయే రోజున చాలా బాధపడుతూ చెప్పాడు. "ఇంత జీతగాణ్ణి భరించలేనురా కుప్పాలూ, మరో కవతం చూసుకో."

"ఆరి కవతంలోనే తన పెళ్ళయింది. ఆ పెళ్ళికి నూటపదార్లు కట్న మిచ్చారు పంతులుగోరు. ఆరినిడిసిపెట్టి యెల్లటవా?" బాధ పడ్డాడు కుప్పాలు. చిన్న జీతగాణ్ణి కుదిర్చిపెట్టి కుప్పాలు పని మానేశాడు. ఆ తరువాత మళ్ళా కొత్తమావాస్యదాకా ఎవరిదో కవతంలో కుదిరాడు గాని. 'యిది బాపనెవసాయంగాదురా' అని ఎద్దేవా చేయటంతో.... జీతగాడుగా కుదరటం మానేశాడు.

"పంతులుగోరికి కర్నీక వంటే అసయ్యం! సివరికి పరాయిూరెల్లొస్తున్నారా పని మీదే...." అనుకుంటుంటాడు ఎప్పుడయినా బోగందాని చెరువుగట్టుమీంచి ఏ కూరగాయలో పుస్తకాల సంచీయో మోసుకుంటూ పోతున్న గంభీరమైన ఎత్తైన శిధిల దేవాలయం లాంటి ఆ విగ్రహాన్ని చూస్తూ.

ఆ ఎకరంనరా కూడా ఈ మధ్య కూతురు పెళ్ళి కాస్త ఘనంగా చేయటం కోసం అమ్మేశాడు మూర్తిపంతులు. ఓమారు కుప్పాలు దోవలో కలిశాడాయనను. మనసులో బాధనంతా ఆప్త స్నేహితునితో చెప్పుకున్నట్టు చెప్పాడు.

"కర్నీకం కూడ వైదీకులు చేయలేరని మా తాత అనేవాడు. నియ్యోగపాడివేనా అని అడుగుతున్నారు కొందరు. అందరికీ సర్వే చేస్తే వందరూపాయలిస్తే... ఒకరి నెప్పుడయినా చెయ్యి జాచి అడిగిన పాపానపోయానా!

ఈ నాటికి ఇలాగయింది...పాతిక రూపాయలు చేతిలో పెడతారు. అంతదూరం నడిచి యెండలో తిరిగి సర్వేచేసి...ఒక్కో మారు తిండి కూడా కుదరదు. ఒక్కో వూళ్ళో పురోహితుడు కూడా ఉండడు... నా భోజనం సంగతి నీకు తెలుసుగా...."

ఆయన పరిస్థితంతా కుప్పాలుకు తెలుసు. మూర్తిపంతులు భార్య కుప్పాలు చెప్పిన అమ్మగారు, ఆవిడ ఉన్నరోజులో చేతికి ఎముకలేకుండా పెట్టింది. ఇప్పుడలా సాగకపోయినా బాధలేదుగాని తినే నోళ్ళు జతపడి తింటానికి లేకుండా మాడుతుంటే... ఆవిడ కడుపు చెరువయిపోతుంటుంది. మొగుడు ఆ పూటకి ఏమయినా తెస్తేనే.... పూట గడుస్తుంది. లేకపోతే కడుపుకి కాళ్ళే మిగులు, కళ్ళకి నీళ్ళే మిగులు!

ఎప్పుడయినా రాత్రి భోజనాలయాక... కుప్పాలో, పాపాయమ్మో, యీరాసామో రేకు తలుపు తడుతుంటారు. రాచ్చిప్పలో మిగిలిన పులుసు చుక్కో, పచ్చడి పిసరో వాళ్ళు తెచ్చుకున్న గిన్నెలో వేస్తూంటుంది. కుప్పాలు గానుగాటల రోజుల్లో పిప్పి తేవటమో, ఏ తద్దినమయినా వస్తే అరిటాకులూ, బలుసు కూరా, పనసకాయలూ ఎవరినయినా అడిగి తెచ్చి యివ్వటమో చేస్తుంటాడు. పెరట్లో గడ్డి గోకి పెట్టటమో, పారతో నీటి కాలువలో మట్టీ బురద పెళ్ళగించడమో సాయం చేస్తుంటాడు. అప్పుడప్పుడు బ్రరింక పుల్లలు పళ్ళు తోవుకోటానికి కోసి తెస్తుంటాడు. మొదట్లో సావిత్రమ్మ ఊరగాయ బద్దలు కూడా పడేసేది. "మొగిలి రేకులు తెచ్చే పిల్లలికీ యిచ్చి వీళ్ళకీ యిస్తే అడుక్కు తిన్నట్టే" అని పెద్దకూతురు లేకిబుద్ధులు ప్రదర్శించటంతో చాటుగా పని ఎక్కువ చెప్పినప్పుడు కుప్పాలుకు మాత్రం పడేసేది.

గిన్నె పట్టుకుని ఆ రోజు కుప్పాలు సావిత్రమ్మ పెరటి తలుపు తట్టాడు. ఆవిడ మంచం నట్టి వాకిట్లో వేసుకుని "ఈయన యింకా రాలేదేమిటి చెప్మా" అని ఆలోచిస్తూ నడుం వాల్చింది. చప్పుడు వినగానే లేచి వెళ్ళి తలుపు తీసింది.

"కూర్చోరా! యింకా అయ్యగారు రాలేదు" అంటూ మళ్ళీ మంచంమీద నడుం వాల్చింది. కుప్పాలు పాక దగ్గిర గోడవారకి జారబడి ముంగాళ్ళమీద కూర్చున్నాడు. ఆ కబురూ ఈ కబురూ అయాక కుప్పాలు తన మనసులో సంగతి బయటపెట్టాడు.

"రొట్టె ముక్కకేం మారుభాగ్యంరా! రేపు మీ అయ్యగారు రాగానే చెపుతాను. నాలుగయిదు రోజుల్లో దాని నోట్లో కావలిసినంత రొట్టె" అంది సావిత్రమ్మ ఛీపురుపుల్లతో పళ్ళలో దూరినదేదో కెలుక్కుంటూ.

"అయ్యగోరికా కట్ట వెందుకండి! రేపుటెల్లుండిలో కాసిన్ని మినువులు నానే తెచ్చుకుంటాను..." అంటూన్న కుప్పాలుకి ఆమె అడ్డుపడింది.

"మీ అయ్యగారికి రెక్కలు భగవంతుడింకా వుంచాడురా! సర్దుబాటవడం కాస్త కష్టంగా ఉందని యిలా మాట్లాడతావట్రా?" ఆమె బాధపడింది.

కుప్పాలు నెమ్మదిగా ఆవిడకు నచ్చజెప్పి "మీ బిడ్డలాటోణ్ణి, నాకాడ మొగమాటవేటమ్మా?" అంటూ ఒప్పించాడు. కాస్సేపు మాట్లాడుకున్నాక కూతుర్ని పిలిచి, పులుసు తెచ్చి సగం పోయమంది. "వచ్చే టయిమయిపోయింది.... అయినా అదే సరిపోతుంది" అంటూ.

ఇది జరిగిన మూణ్ణాలుగురోజుల తర్వాత కుప్పాలు ఎవణ్నో అడిగి ఓ తవ్వెడు మినుములు సంపాదించాడు. అవి పయిగుడ్డలోపోసి తెచ్చి సావిత్రమ్మగారి చేటలో పోశాడు. "బాగా కాల్సాలమ్మగోరూ! మీ సేతి సలవవల్ల దానికి రొట్టెముక్క లాంటి బిడ్డుట్టాల" అన్నాడు. అతని కళ్ళు ఆ క్షణంలో తాజమహల్ కట్టిన షాజహన్ కళ్ళలా ఉన్నాయి. పారిజాత ప్రసూనం సాధించిన కృష్ణుడి కళ్ళలా ఉన్నాయి. పయిగుడ్డ దులిపి వీధిలోకి వచ్చాడు. అనంత నారాయణ పెళ్ళాం వాణ్ణి పలకరించి అంతా ఆరా తీసింది.... "దిక్కుమాలిన రొట్టెముక్కకు నీ దగ్గర మినుములు తీసుకుందా సావిత్రమ్మ....." బుగ్గలు నొక్కుకుంది.

"ఇంట్లో రొట్టె కాల్చి ఎన్నాళ్ళయిందో" అనుకుంది సావిత్రమ్మ. "అన్నానికే సరిగ్గా గడవకపోతుంటే రొట్టె ఎక్కణ్ణుంచి తెస్తుంది? పాపిష్టిదాన్ని! వాళ్ళకి నోళ్ళు వచ్చేసరికే..... ఇలా చేశాను; నా బతుకుగాలా" అని తిట్టుకుంది. "తేనెపాకం వేసి నంచుకు తింటే ఎంత బాగుంటుంది! ఆయనకి మహాయిష్టం. ఏం చేస్తాడు! పది రూపాయలు దెచ్చినా కుంచెడు బియ్యం రావటంలేదు... రేపెలాగయినా ఎవర్నయినా బతిమాలి సాయంపట్టమనాలి పప్పు విసరటానికి. రేపో యెల్లుండో ఓ ఏబులం నూనె ఎక్కువ తెప్పించాలి" ఊహలు చేస్తుండగా భర్త వచ్చాడు.

భోజనాలు పూర్తయ్యాక తలకి కొబ్బరూనె రాసి కాళ్ళు పడుతూ కూర్చుంది. "రోజుకి పది మైళ్ళయినా నడుస్తారుగదా! అయినా కడుపు పూర్తిగా నిండదు. పెద్దాడు వాదిస్తుంటాడు... అదేదో దేశంలో అందరూ కష్టపడి కడుపు నిండుగా తింటారుట! అది యేనాడొస్తుందో భగవంతుడా! యింత కష్టపడుతూ... కాళ్ళకి జోడులేదు. పాదాలు పగిలి రాళ్ళయిపోయాయి. మనిషి కడుపుకి యింత కష్టవా! నువ్వే దారి చూపాలి! పడినగోడలు లేవకుండా ఉంటాయా! త్రినాథవ్రతాలు... అవునవును యింకా రెండూ ఉండిపోయాయి. గంజాయి తెప్పించాలి...."

మర్నాడు మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో సోమసుందరంగారి అమ్మాయి పెద్దమనిషయింది. సోమసుందరంగారికి ఎత్తైన మేడ వుంది. దానిమీద సున్నం వెలవడం మానేసింది. ఇంట్లో గదులున్నాయి: గదుల్లో నిలువెత్తు బీరువాలు ఉన్నాయి. వాటి అద్దాలలో ఉన్న బొమ్మలకన్న అందంగా ఆ యింట్లో మనుషులు కనిపిస్తుంటారు. ఎత్తైన పందిరి పట్టెమంచాలున్నాయి. మంచాలమీద చిలక బొమ్మలున్నాయి. అలమరాల్లో ఎప్పుడూ నిలవవుండే స్వీట్సున్నాయి. గదిలో

ధాన్యం ఉన్నాయి. భూమిలో బోరింగులు ఉన్నాయి. కరిణీకం పుస్తకాలలో అమాంబాపతు నూట అరవయి రెండెకరాల ముప్పయిరెండు సెంట్లున్నాయి. సోమసుందరంగారి భార్య లావు! ఆవిడ మెడ లావు! ఆ మెడమీద చంద్రహారాల గొలుసుల్లాంటి సరుకులు గంగిరెద్దుకు తగిలించిన బొంతల్లా చూసేవాళ్ళకి బరువుగానూ, ఆ శరీరానికి తేలికగానూ వేలాడుతుంటాయి. వాళ్ళ అబ్బాయి మోటరు సైకిలు మాలోళ్ళ చంటోడిమీద కెక్కినా.... కాపుల కోడిమీద కెక్కినా ఒకటే విలువ.

సోమసుందరం, మూర్తిపంతులూ తాతా సహోదరులు. సోమసుందరం కరణీకం గుమాస్తాని బెట్టి చేయిస్తాడు. జమాబందీకి ఆయన వెళితే తాసిల్దారు కళ్ళు మూసుకుని పుస్తకంమీద సంతకం పెడతాడు. రూపాయ యివ్వాల్సిన పనికి పెద్దోడికి రూపాయెలా యిస్తామని అయిదు రూపాయలిస్తారు జనం. ఏనాడో ఉన్న ప్రాంసరీ నోటు వ్యవహారంలో సోమసుందరం మూర్తిపంతులు మీద దావా నడుపుతున్నాడు.

అందరితోబాటు సావిత్రమ్మనూ బొట్టుపెట్టి పిలిచారు. సావిత్రమ్మ వెళ్ళింది. అందరితో కలిసి చిమ్మిలి దంచింది. వసంతం నీళ్ళు తయారు చేయటంలో సాయపడింది. కొత్త వడ్లపోసి చాపవేసి కూర్చోబెట్టిన సవర్త పెళ్ళికూతురికి హారతి యిస్తూ పాతకాలం పాటలు పాడింది. ఇన్ని చేసినా ఆవిడ మొగం చిన్నబుచ్చుకునే ఉంది. అప్పటి కప్పుడే మైసూర్‌పాక్ చేసి తీసుకొచ్చింది అనంత నారాయణ పెళ్ళాం. సీతారామచంద్రమూర్తి భార్య జంతికలు పట్టుకొచ్చింది. "వాళ్ళిద్దరికన్నా దగ్గరచుట్టం తను! యింకా ఏమీ యివ్వలేక పోయింది!" అదీ ఆవిడ బాధ!

సవర్త కబుర్లు చెప్పటానికి పెద్దకొడుకుని పంపింది సావిత్రమ్మ సోమసుందరం భార్య సూచనపై.

ఆ రోజు రాత్రి మూర్తిపంతులు కొంచెం పెందరాళే వచ్చాడు, సావిత్రమ్మ అతను విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో కదిపింది మధ్యాహ్నం జరిగినదాన్నిగూర్చి. "ఏదయినా చేసి పంపలేకపోయావూ?" అన్నాడతను.

"పంపాలనే ఉంది! కాని ఏం చేయటానికి చెయ్యాడలేదు. మీరొచ్చాక చూద్దామని అలాగే తిరిగేశాను గుంభనగా! ఆ నారాయణ పెళ్ళాం మరీ గొప్పలకి పోతుంది...."

"ఇవ్వేళ ఎక్కడా పైసా పుట్టలేదు." కొంచెంసేపు ఊరుకుని అన్నాడు.

"పోనీ ఓ పని చెయ్యి. నిన్న రొట్టె కాలుస్తానన్నావుగదా! ఆ మినువుల్తో మినప సున్ని నొక్కి యిచ్చేయ్!"

"కుప్పాలు మనసుపడి తెచ్చుకున్నాడని చూస్తున్నాను... యిందాకే తట్టింది గానీ...."

"ఫరవాలేదు లేవే! మన కష్టసుఖాలూ, గౌరవం వాడికి మాత్రం ముఖ్యం కావా? వాడేమీ అనడులే!" అటువైపు తిరిగి పడుకుంటూ అన్నాడు.

"మరయితే బెల్లం....నెయ్యి...." అంది.

చివరకు అడ్డెడు తవ్వెడు గిన్నె సోమసుందరంగారి యింట్లోకే పంపి అణావడ్డీ మీద పాతిక రూపాయలు తెప్పించారు. పది రూపాయలు పట్టుకొని ఏ కొట్టులోనయినా మిగిలింది అరువుపెట్టి ఉన్నంతలో కాస్తడాబుగా అమిరే బట్టలు కొనడానికి మూర్తిపంతులు తెల్లారగట్లే లేచి వెళ్ళాడు. మిగిలిన డబ్బుతో నెయ్యి బెల్లం తెప్పించి భోజనాలు అవకముందే మినప సున్ని తయారుచేసింది సావిత్రమ్మ.

ఒంటి గంటకు ఎండలో వగరుస్తూ బట్టలు పట్టుకొచ్చాడు మూర్తిపంతులు. భోజనం చేయకుండానే మినప సున్ని, బట్టలు పట్టుకుని వెళ్ళి యిచ్చి వస్తూ సావిత్రమ్మ నారాయణ పెళ్ళాన్ని పలకరించింది.... 'ఓ యాభయి ఉండ లిచ్చాను వదినా!' మాటలో మాటగా చెప్పింది.

ఆ రోజు సాయంకాలం నారాయణ పెళ్ళాం పనిగట్టుకుని కుప్పాలుని పిలిచి అడిగింది - "రొట్టెముక్క తిన్నావట్రా" అంటూ! అతనికి అర్థంకాలేదేమోనని "ఏమోమరి! మినప సున్ని చేసి కరణంగారికిచ్చింది" అని కూడా అనేసింది.

అయితే కుప్పాలుకి రొట్టెముక్క కాల్చి పెట్టాలని సావిత్రమ్మ అనుకుంటూనే ఉంది. ఆవిడ నమ్మిన దేవుడు తిన్నగా చూళ్ళేదు. లోకంలో బీదవాళ్లూ డబ్బున్న వాళ్ళూ తప్ప మరెవళ్ళూ లేరని నమ్మిన సోమసుందరం దావా గెలిచాడు. ఇల్లు జప్తు చేయించటంతో ఆవిడ ఊరు విడిచిపెట్టి వెళ్ళిపోవాల్సి వచ్చింది "మాలవాడి కడుపున పుట్టాలేమో భగవంతుడా" అనుకుంటూ!

*('ఆంధ్రజ్యోతి' వారపత్రిక - 2-4-76)*

# బదిలీ

**బదిలీ** అయింది.

దాదాపు ఏడుపుతో యింటికి చేరాడు రామచంద్రుడు. కుర్చీలో కూలబడి పోయాడు. విషయం విన్న జానకి పై ప్రాణాలు పైనే పోయాయి.

ఆ రోజు లగాయితూ వాళ్ళ యింటికి బంధువులూ, స్నేహితులూ తీర్థ ప్రజలా వస్తున్నారు, పోతున్నారు.

"ఎక్కడికీ? కొచ్చినే!

యింకేముందర్రా! అంతా అయిపోయినట్టే! దేశంగాని దేశం! భాష గాని భాష! ఆ తిళ్ళూ మీరు తినలేరు. ఆ మనుషుల్తో మీరు తూగలేరు!

మీకెంతటి కష్టం వచ్చిందర్రా?-"

ఈ ధోరణిలో అడిగినవాళ్ళూ అడగనివాళ్ళూ వచ్చి ఊదరగొట్టేస్తున్నారు.

జానకి గుడ్లప్పగించి వింటోంది! గుడ్ల నీళ్ళు కుక్కుకుంటోంది! టీలు కాస్తోంది! వచ్చిన వాళ్ళకి పోస్తోంది!

"మీ ఆయన్ని మా యింటికి పంపించవే! మా వియ్యంకుడి పెత్తాత మనవడొహతను కొచ్చిన్లో ఉన్నాడుట. అడ్రసు యిచ్చాడు. వెతికి యిస్తాను. ఆ మనిషికి ఉత్తరం రాస్తే నా బంధో అంటూ సాయమవుతాడు-" అన్నాడు జానకి మేనమామ.

రామచంద్రుడు కేంద్ర ప్రభుత్వోద్యోగి. ట్రేసర్. మూడో తరగతిలో దిగువ స్థాయి వాళ్ళకు సాధారణంగా బదిలీలు ఉండవు. ప్రధాన కార్యాలయంలో ఓ గురుద్యోగికి ఓ చిరుద్యోగి కంటిలో నలక అయాడు. ఆ చిరుద్యోగి తిక్క కుదరాలంటే అతన్ని కదిలించాలని భావించాడు. ఆ కదలికను ధర్మబద్ధం చేయటానికి వరసవారీ బదిలీలు దేశప్రగతికి అత్యవసరం అన్నాడు. సంబంధిత మంత్రిత్వ శాఖలన్నీ అవును సుమా అన్నాయి. ఆ విధంగా రామచంద్రుడిని విసిరేసారు.

అతను తన ఆఫీసరు దగ్గరకుపోయి - "అయ్యా! మీరు చెప్పిన గీతలెల్లా గీసాను. రాతలెల్లా రాసాను. నోరెత్తి మాట్లాడనివాడిని. పన్నెత్తి పలకరించటం రానివాడిని. వంచిన బుర్ర ఎత్తనివాడిని. వినయమే భూషణంగా గలవాడిని. నన్నిటుల సేయతగునా?" అన్నాడు.

"నిజమే నాయనా! మీ బోంట్ల వినయం మాకు ఉపాహారమే! అయితే మనమంతా పైవారికి కీలుబొమ్మలం! రికమెండింగ్ అథారిటీలు వేరు! అడ్మినిస్ట్రేటింగ్ అథారిటీలు వేరు! మళ్లీ నువ్వు వృద్ధుడివయాక యీ విశాఖ వయిపు వద్దువుగానిలే! యీలోగా ఏ అథారటీకయినా నీ ఏడుపు వినపడిందా - సరే! నీ అదృష్టం పలుకుతుంది!-"

ఈ ధోరణిలో ఆయన తన నిస్పృహాయత వెల్లడించాడు.

కొచ్చిన్ ఆఫీసు చాలా చిన్నది. ఆ ఆఫీసులో ఉద్యోగులు ఎవరూ రామచంద్రుడికి గాని అతని సహోద్యోగులకిగాని తెలియరు.

"ముందుగా వెళ్ళి అక్కడ జాయినవు! సెలవు పెట్టిరా! ఈలోగా యిల్లూ. పిల్లల స్కూలు సీట్లూ సెటిల్ చేసుకురా! తర్వాత వచ్చి సంసారాన్ని మోసుకుపో!-" అన్నారు మిత్రులు.

రామచంద్రుడు ఆ సలహా పట్టుకుని యింటికి చేరాడు.

భార్య తన మేనమామ చెప్పిన కబురు చెవిని వేసింది. మర్నాడు పొద్దుటే ఆ పెద్దమనిషి యింటికి పరుగెత్తాడు.

"చూసావు రామచంద్రం! నువ్వుత్తి తిక్కముండావాడివి! నీ పెళ్ళిలో నువ్వు చేసిన యాగీ ఉంది చూసావూ - అది నే మరిచిపోలేను" అంటూ ఎత్తి పొడిచాడు.

రామచంద్రుడు ప్రతిదీ ఇన్‌టోటో ఒప్పేసుకున్నాడు. దేన్నీ డినై చేయలేదు.

"కానీ - నీ పెళ్ళాం బహుదొడ్డది! ఆ పిల్ల మొహం చూసి నీకీ సాయం చేస్తున్నాను! రాఘవరావని - మనవాడు! అంటే మన కులం! మన భాష! మనదేశం! చూడూ- మనం పైవాళ్ళతో వ్యవహరించేటపుడు - ఎంత కాదనుకున్నా - యివ్వేనయ్యా నిన్ను పైకి లాగేవీ -! మా వియ్యంకుడికి రాస్తే ఆయన తనూ ఉత్తరం రాస్తున్నానని రాసాడు! యిదిగో! అతని అడ్రస్ కూడా రాసాడు! నేనూ ఓ ఉత్తరం రాసాను! నువ్వు నీకేసాయం కావాలో రాయి! అన్నాడు- స్తోత్రాలకు పొంగే ఉబ్బులింగడిలా!"

ఆపళంగా రామచంద్రుడు యింటికి పోయి ఓ పూటంతా కష్టపడి ఓ ఉత్తరం తయారు చేసాడు.

ముందస్తుగా ఆ రాఘవరావూ తానూ ఏ రకమయిన బంధువులవుతారో లెక్కలు మొదలుపెట్టాడు. దాన్లో జానకీ సహకరించింది. ఆ విధంగా సంబోధిస్తూ

ఉత్తరం మొదలించాడు. ఆ తర్వాత తామెంత 'క్లోజో' ఎస్టాబ్లిష్ చేసాడు. 'నీవే తప్ప యింతఃవరం బెరుగ' అన్న ధోరణిలో చనువు ప్రదర్శించాడు.

"నా సమస్యలు మూడు (1) యిల్లు (2) పిల్లల చదువులు (3) స్టేషన్‌లో నన్ను రిసీవ్ చేసుకోటం- మీకు వీలయితే స్టేషన్‌కి రాగలరు. నన్ను గుర్తుపట్టటానికి వీలుగా నా ఫోటో ఒకటి జతపరుస్తున్నాను" అంటూ ముగించాడు.

రామచంద్రుడు తిరుగు జవాబుకోసం ఎదురుచూడటం మొదలుపెట్టాడు.

దానికి జవాబు వచ్చింది.

"మీకు యిల్లు కుదిరింది. స్టేషనుకు రాగలను. మూడు వేలు కనీసం యింటికి అడ్వాన్సు తెచ్చుకోవాలి."

రామచంద్రుడు కనిపించినవాళ్ళందరితోనూ చెప్పసాగాడు.

"చూసారాండీ! మనం మనమే! మనవాళ్ళు మనవాళ్ళే! మన భాష - మనదేనండి మాస్టారూ! మనలో మనకి ఎన్ని ఉన్నా - పైచోటికి వెళ్ళే మనవాళ్ళంతా ఒక్కటేనండి! అయినా అందులో తప్పేముందండి! ఉండాలండి! ఆ మాత్రం కట్టు ఉండాల్లెండి!...."

☆ ☆ ☆

ఉదయం పది గంటల ప్రాంతంలో కొచ్చిన్లో దిగాడు రామచంద్రుడు.

రాఘవరావు సులువుగానే రామచంద్రుణ్ణి గుర్తుపట్టాడు.

అతన్ని ఓ హోటల్లో దింపాడు రాఘవరావు. టిఫిన్లూ స్నానమూ పూర్తయాక యిద్దరూ బయల్దేరారు.

"మీ యింటి ఓనర్! ఉన్నికృష్ణన్!"

ఉన్నికృష్ణన్ పొట్టిగా బందోబస్తుగా ఉన్నాడు. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. అతను మాజీ సైనికుడు.

"తుపాకుల గురించి కబుర్లు చెబుతాడు! కంగారు పడకండి! వంటవాడిగా పని చేసాడు. మేకలు కోసుకు బతికాడు. చూసారు కదా! అలాంటాడు యింత యిల్లు కట్టాడు! దీన్నిబట్టే వీణ్ణి అంచనా వేయొచ్చు" అన్నాడు తెలుగులో రాఘవరావు.

ఉన్ని ఏదో అన్నాడు. రాఘవరావు మలయాళంలో జవాబిచ్చాడు. దాంతో రామచంద్రుణ్ణి చూసి బిగ్గరగా నవ్వటం మొదలుపెట్టాడు. మనిషిని చూసే సగమయిపోయాడు రామచంద్రుడు. రాఘవరావు మాటల్తో నోరు పొడారిపోతే ఉన్ని నవ్వుతో కరచరణాలు ఆడటం మానేసాయి.

ఉన్నికి ముక్కల యింగ్లీషు మాత్రమే వచ్చు.

నలభై ఏళ్ళబట్టి తెలుగు నేలలో పెరిగి తెలుగు గాలి పీల్చి తెలుగు తిండి తింటూన్న రామచంద్రుడికీ యింగ్లీషు అంతంతమాత్రమే వచ్చు.

వాళ్ళిద్దరూ మలయాళంలో మాట్లాడేస్తూ ఉంటే రామచంద్రుడు నోరప్పగించి చూస్తూ ఉండిపోయాడు.

ఇంతలో ఓ అమ్మాయి కాఫీల ట్రే తో వచ్చింది.

"టేక్....టేక్..." అన్నాడు ఉన్ని.

ట్రేలో కప్పు తీసుకుంటూ - 'నామ్ కహాఁ?" అన్నాడు రామచంద్రుడు. టీ అందిస్తూన్న పాపకి గాని, ఉన్నికృష్ణన్‌కి గాని ఏమీ అర్థం కాలేదు.

రామచంద్రుడు సిగ్గుపడుతూ - "నేమ్....షీ... వాట్?"

ఉన్ని బిగ్గరగా నవ్వి -" డాటర్.... డాటర్...మీనూ" అంటే,"షీ గుడ్....అచ్చా...బహుత్ నైస్...." అన్నాడు రామచంద్రుడు.

ఇంటి యజమానిని సంతృప్తిపరచటమే సుఖజీవితానికి ప్రథమ సోపానమనీ - అది టెనెంట్ తాలూకు పవిత్ర కర్తవ్యమనీ - విశాఖపట్నంలో పదిహేడేళ్ళ అద్దెకొంపల అనుభవంలో అతను నేర్చాడు.

"సీ... హవున్" అంటూ తీసుకెళ్ళాడు ఉన్నికృష్ణన్.

వెనకాలనడుస్తూ -"మీరేం మాటాడకండి! మీకు తెలీదు! అమ్మో! యీ మలయాళీలు మాయల మరాటీలు-" అన్నాడు రాఘవరావు.

బుద్ధిగా బుర్ర ఉపాడు రామచంద్రుడు. యిల్లు చిన్నది. వసతులన్నీ ఉన్నాయి. ప్రస్తుతం ఖాళీగా లేదు.

"వెన్ వేకెంట్?"

"ష్! మీరు మాటాడొద్దన్నానా?" రాఘవరావు గసిరాడు నవ్వుతూ.

"వెన్ యూ కమ్?" అన్నాడు ఉన్ని.

యిల్లు కుదిరిందని రాఘవరావు రాయగానే రామచంద్రుడు రిజర్వేషన్ కుటుంబానికంతటికీ చేయించేసాడు. ఆడేటూ ట్రైనూ చెప్పాడు.

"మీరు స్టేషనుకు వస్తారు గదా?" అన్నాడు రామచంద్రుడు.

"భలేవారే! ఎందుకు రానూ?" నవ్వుతూ అన్నాడు రాఘవరావు.

ఆ తర్వాత మరికొంతసేపు అతనూ ఉన్నీ మలయాళంలో ఏదో అనుకున్నారు. రాఘవరావు రామచంద్రుడిని పక్కకు తీసుకెళ్ళి మూడు వేలు యిమ్మన్నాడు. ఆ సొమ్ముతో ఉన్ని దగ్గరకు వెళ్ళి మాట్లాడి వచ్చాడు.

తర్వాత హోటలుకు వచ్చేదాకా ఉన్నిని తిడుతూనే ఉన్నాడు రాఘవరావు. "పరమ కర్కోటకుడు! వీడనేగాదండి, యీ మలయాళీలంతా యిదే వరస! యిల్లు ఖాళీ చేయకుండానే సగం అద్దె బయానా యివ్వాలిట! మనవేపు ఎక్కడా చూడలేదు గదండీ?"

తనని యింటికి రమ్మంటాడని అనుకున్నాడు రామచంద్రుడు. ఆఖరుకి అతని యింటి అడ్రస్ అడిగాడు.

"నే వచ్చి తీసుకెళ్తానుగదండి! యీ వూళ్ళో మీరెక్కడ పాట్లు పడతారూ?" అన్నాడు రాఘవరావు.

యిద్దరూ హోటల్లో స్థిమితపడ్డాక -

"అన్నట్టు - మళ్ళీ మర్చిపోతానండీ! అద్దె మూడూ యాభై! అడ్వాన్సు మూడు వేలు యిచ్చాను! మీరొచ్చే దాకా అద్దె రెండొందలు! బ్రోకరుకి మూడు వందలు! అయిదు వందలూ నా జేబులోంచి పెట్టాను! మనలో మనకి ఆ మాత్రం అవకపోతే ఎలాగండీ?"

రామచంద్రుడి మనసంతా అతని పట్ల కృతజ్ఞతతో ఆర్ద్రమయిపోయింది. అతని రెండు చేతులూ పట్టుకుని-

"మీలాంటి మంచి మిత్రుడ్ని పొందినందుకు ఎంతో ఆనందంగా ఉంది సార్! ముక్కూ మొహం తెలీని నేను ఓ ఉత్తరం ముక్క రాసినందుకు యింత సహాయం చేసారు" అన్నాడు.

మిగిలిన డబ్బు యిచ్చేసాడు రామచంద్రుడు.

"మిమ్మల్ని మా యింటికే తీసుకెళ్ళాలి. ఆవిడకి వంట్లో బాగులేదు. చాలా బాధపడుతున్నాను."

సాయంకాలంవరకూ అతనితో గడిపాడు రాఘవరావు.

మందు అలవాటు లేదన్నాడు రామచంద్రుడు. అతన్ని తీసుకోమన్నాడు, రెండు బీరకాయలతో కాలక్షేపం చేసాడు రాఘవరావు. స్టేషన్లో కలుసుకుందామని చెప్పుకుని విడిపోయారు.

మర్నాడు రామచంద్రుడు జాయినింగ్ రిపోర్టు యిచ్చాడు.

సెలవు దొరికింది. తిరుగు ప్రయాణమయాడు.

జానకీ రామచంద్రుడు అంత డబ్బు పోయాల్సి వచ్చినందుకు నడుములు విరగ్గొట్టినట్టయిపోయారు. అంత డబ్బు పోసినా అంత సాయం దొరికినందుకు ఎంతో ఆనందించారు.

"అదే తెలీని వాళ్ళయితే యింకెంత పోయాల్సి వచ్చేదోనర్రా! మనాడు మధ్య నుండి మిమ్మల్ని గట్టెక్కించాడు! తెలీని దేశం! తెలీని లోకం! ఏమయిపోదురో!" అన్నాడు రాఘవరావుని పరిచయం చేసిన మేనమామ.

"అంతే మామయ్యా!" అంది జానకి.

★ ★ ★

ప్రయాణం రోజు రానే వచ్చింది. సామాన్లు బ్రేక్‌వాన్లో ఎక్కాయి. భార్యాపిల్లల్తో రామచంద్రుడు రైలు ఎక్కాడు.

మద్రాసులో రైలు మారారు.

గంటన్నర పైగా లేటుగా నడుస్తోందని కబురు తెచ్చాడు రామచంద్రుడు.

పొరబాటున అంది జానకి - "అంత లేటయితే ఆయన వస్తారో రారో!"

"నీకు లోకం ఏం తెలుసునూ! యిలాంటి పరాయి చోట్ల ఓ భాష వాళ్ళు ఓ దేశం వాళ్ళు ఎంత కలిసికట్టుగా ఉంటారో! ఒకళ్ళకి ఒకళ్ళు ఎంత అవుతారో! అయినా - నాకు బుద్ధి లేదులే! ఆడాళ్ళతో అన్నీ చెప్పగూడదు!" తోక తొక్కిన తాచులా లేచాడు.

ఈ ధోరణిలో విరుచుకు పడిపోతున్న రామచంద్రుడిని చూసి జానకి బిత్తరపోయింది. కంపార్టుమెంట్లో ఎవరూ తెలుగువాళ్ళు ఉండర్లే- అని సర్దుకుంది. అయితే అతను అంతలా ఎందుకు కోప్పడుతున్నాడో ఆవిడకి బొత్తిగా అర్థం కాలేదు.

మరో అరగంట వరకూ మరో తెలివి తక్కువ ముక్క అనలేదు జానకి. రామచంద్రుడు శాంతించాక అంది:

"అవునండీ! నాకు తెలీకడుగుతానూ - ఆయన ఓ వేళ రాలేదనుకోండీ - మీరు ఆ యిల్లు గుర్తుపట్టగలరా?"

వెంటనే నాలిక కరుచుకుంది.

ఈమారు రామచంద్రుడు నిప్పు తొక్కిన కోతిలా ఎగిరాడు.

"అనుమానాలు ముందు పుట్టి ఆడాళ్ళు తరవాత పుట్టారుట! చిచ్చీ! చిచ్చిచ్చీ! వెనకటికెవరో శుభం పలకరా మంకెన్నా అంటే పెళ్ళికూతురు ముండ ఎక్కడ చచ్చిందని అడిగాడ్ట-"

ఆ అరుపులకి జానకి యీమారు గాభరా పడలేదు. ఈ పిచ్చి మానవునికి ఆ యిల్లు గుర్తు పట్టగలనన్న నమ్మకం లేకనే యిలా ఎగుర్తున్నాడని ఆవిడ పట్టేసింది.

"చాలించండి నిర్వాకం! మీకన్నా నేను లక్షరెట్లు నయం! యీ తిప్పలన్నీ పడే బదులు - చక్కగా మీ ఆఫీసులోనే ఎవరినో ఒకరిని సెలవు చేసుకొని యిల్లూ గట్రా చూసుకోవచ్చు గదా! కర్మ! కర్మ" అంది తనూ గొంతు పెంచి.

వెంటనే తగ్గిపోయాడు రామచంద్రుడు-

"నేనేం చేయను జానకీ! నువ్వేగదా మీ మావయ్య దగ్గరకు పంపావు?" అన్నాడు గాభరాగా.

బయల్దేరేలోగా మూడు ఉత్తరాలు రాసాడు రాఘవరావుకి! ఒక్కదానికీ జవాబు లేదు! ఏమయినా ఒంట్లో బాగులేదో! సెలవులో ఉన్నాడో! ఎలాగయినా స్టేషనుకు వస్తాడులే - అని సరిపెట్టుకున్నాడు.

జానకి అనుమానాలన్నీ రామచంద్రుణ్ణీ దొలుస్తున్నాయి. అవి జానకి

నోటంట వినేసరికి అగ్గిబరాటా అయిపోయాడు. కార్నర్ సీట్ల కోసం పిల్లలు కలియబడి పోతూంటే వాళ్ళమీద కలియబడి ఉతికేసాడు. ట్రైన్లో ప్రయాణీకులు గాభరా పడిపోయి వాళ్ళకి కార్నర్ సీట్లు యిచ్చేసారు.

కొచ్చిన్‌కి రెండున్నర గంటల లేటుగా చేరింది రైలు.

పిల్లలతో సామాన్లతో ప్లాట్‌ఫారమ్ మీద దిగాడు రామచంద్రుడు. ప్రయాణీకులంతా వెళ్ళి పోతున్నారు. కూలీలు మూగేసి మలయాళంలో అడిగేస్తున్నారు. రామచంద్రుడికి పిచ్చి ఎక్కుతున్నట్టే ఉంది.

ఉన్న ఒక్క రోజులోనూ నేర్చిన 'వేండ! వేండా!' అంటున్నాడు.

ప్లాట్‌ఫారమ్ ఖాళీ అయిపోతోంది! రామచంద్రుడి చేతివేళ్ళ గోళ్ళన్నీ ఖాళీ అయిపోయాయి.

వాడిన మొహాలతో పిల్లలు పెట్టెల మీద కూర్చున్నారు. ఆఖరు కుర్రాడు 'ఆకలి! ఆకలి' అంటూ అమ్మ కొంగు పట్టుకుని ఏడుస్తూన్నాడు. రెండు తన్నులు తిన్నా వారి ఆకలి తీరలేదు.

జానకి నోరు విప్పి తనకు తోచిన సలహా ఏదో చెప్పాలనుకుంటోంది. భర్త వాలకం చూసి ఆవిడకి ధైర్యం కలగడం లేదు.

యింతలో 'హో హ్హో హ్హో' అన్న నవ్వు! రామచంద్రుడి భుజం మీద ఎవరిదో చెయ్యి పడింది. చటుక్కున వెనక్కి తిరిగాడు.

ఉన్ని! అతని వెనక మీనాక్షి!

అతను ఏదో మాట్లాడేస్తున్నాడు. ఒక్క ముక్క కూడా అర్థం కావటం లేదు.

"రాఘవరావ్...యువర్ ఫ్రెండ్?" అంటున్నాడు ఉన్నికృష్ణన్.

"నాట్‌కమ్....." బుర్ర ఆడిస్తూ అన్నాడు రామచంద్రుడు.

కూలీలను కుదిర్చాడు ఉన్నికృష్ణన్. బ్రేక్‌వాన్లో సామాను రాలేదనీ తర్వాత బండిలో వస్తుందనీ చెప్పారు స్టేషన్లో! రామచంద్రుడు కంగారుపడ్డాడు. ఉన్నికృష్ణన్ ఏదో చెపుతున్నాడు.

అందరూ యిల్లు చేరారు.

భార్యాపిల్లలు యిద్దరూ తమ వాటాలోకి ప్రవేశించారు. స్నానాల గదిలో రెండు బాల్చీలతో నీళ్ళున్నాయి. వంటగదిలో మంచినీళ్ళున్నాయి.

మీనాక్షి పిల్లలతో మాట కలిపింది. తనతో తీసుకువెళ్ళింది. భార్యాభర్తలు స్నానాలు చేసారు.

భోజనాలకు పిలిచింది ఉన్ని భార్య.

ఆ రుచులు ఎలాగున్నా అందులో అభిమానం రుచి వాళ్ళ కడుపు నింపేసింది. ఒకరి భావం ఒకరికి అందదు.

ఆ తర్వాత నలుగురూ హాలులో కూర్చున్నారు.

"యూ మీల్స్ ఇన్ హోమ్ - మై హోమ్! -" అంటున్నాడు ఉన్ని.

పెట్టిన తిండికి డబ్బులు యిమ్మంటున్నాడు కాబోలు అనుకున్నాడు రామచంద్రుడు. డబ్బులు తీసి యివ్వబోయాడు.

"నో! నో" అంటూ ఉన్ని వారించాడు. మీనాక్షిని పిలిచి ఏదో చెప్పాడు. ఆమె గబగబా బయటకు వెళ్ళింది.

'హ హ్హా హ్హా' అంటూ నవ్వుతున్నాడు ఉన్ని ఏదో అంటూ.

రామచంద్రుడు తమ వాటాలోకి నడిచాడు. పక్క పరిచింది జానకి. అప్పటికే పిల్లలు పడుకున్నారు.

భార్యాభర్త లిద్దరూ మౌనంగా భారంగా ఎవరి ఆలోచనల్లో వాళ్ళు చతికిలబడ్డారు. యింతలో తలుపు మీద చప్పుడు!

రామచంద్రుడు వెళ్ళాడు. ఉన్నికృష్ణన్ ఓ టైపు చేసిన స్టాంపు కాగితాన్ని అతని చేతిలో ఉంచి -

"అడ్వాన్స్ - అగ్రిమెంట్" అన్నాడు.

అతను వెళ్ళాక తలుపువేసి వచ్చాడు.

కూడబలుక్కుంటూ చదివాడు రామచంద్రుడు.

"ఏంటి జానకీ యిది?" గాభరాగా అన్నాడు.

"ఏం జరిగిందండీ?"

"మూడువేలు యిస్తే రెండు వేలే అని రాసాడేంటీ ముసిలాయనా?"

"పాపం, మంచాళ్ళులాగే ఉన్నారండి! మనం అడక్కుండానే రసీదు యిచ్చాడు! ఓవేళ మర్చిపోయాడో ఏంటో!"

"నా బొంద మర్చిపోటం! వెళ్ళి అడిగేస్తాను-"

"బావుంది తెలివి! మన గొడవ వాళ్ళకి అర్థం కాదు! వాళ్ళ గోల మనకి తెలీదు. మీ తెలివితేటలే అంతంత మాత్రం. మధ్యలో ఉన్న రాఘవరావు గారిచేతే అడిగించడం సబవు!"

"అంతేనంటావా!" అన్నాడు రామచంద్రుడు.

"యింతకీ అయన ఎందుకు రాలేదో!" అంది సాలోచనగా.

"ఏమయినా వంట్లో బావులేదేమో జానకీ! పరాయి దేశంలో మనవాళ్ళు మనకి అవకుండా పోరు. మనం ఆ మాత్రం అర్థం చేసుకోపోతే ఎలా?"

జానకి ఏదో అనబోయీలోగా మళ్ళీ తలుపు మీద చప్పుడు!

మీనాక్షి నిలబడి ఉంది. ఆమె వెనకాల ఓ కొత్త మొహం. దాదాపు ఉన్ని వయసే ఉంటుంది.

"నా పేరు కుట్టి. ఉన్ని మా చెల్లెలి హజ్బెండ్‌గా వుంది" అన్నాడు కుట్టి.

ఆయన మాట్లాడేది తెలుగుగా గుర్తు పట్టిన రామచంద్రుడికి అంతులేని ఆనందం కలిగింది.

ఉన్ని, కుట్టీ, రామచంద్రుడూ కూర్చున్నారు.

కుట్టీ చాలా కాలం క్రితం హైదరాబాద్‌లో కొన్నాళ్ళున్నాట్ట. తెలుగులో బాగానే మాట్లాడగలడు. ఆ తెలుగు క్రమంగా రామచంద్రుడికి అర్థమవుతోంది.

ముగ్గురూ సంభాషణలోకి దిగారు.

మొత్తం సామాను వచ్చేదాకా భోజనాలు తమ యింట్లోనే చెయ్యమన్నాడు ఉన్ని. దానికి డబ్బులు యివ్వబోయాడని చెప్పి - "మీ దేశంలో అలా డబ్బులు వసూలు చేస్తారా?" అని అడిగాడు ఉన్ని.

లేదని జవాబిచ్చి సిగ్గుపడిపోయాడు రామచంద్రుడు.

క్రమంగా సాన్నిహిత్యం పెరుగుతోందనిపించగానే అడ్వాన్సులో తేడా గురించి చెప్పేసాడు రామచంద్రుడు.

ఉన్ని గాభరాగా "చచ్చ! నాకు మూడు వేలు యివ్వలేదు. రెండు వేలే యిచ్చాడు. నా పిల్లల మీద ఒట్టు!" అన్నాడు.

అది తెలుగులో కుట్టి వివరిస్తూంటే రామచంద్రుడికి నమ్మబుద్ధి కాలేదు. అయినా నమ్మినట్టు నటించబోయాడు.

కానీ - ఉన్ని దాన్ని గమనించేసాడు.

"ఆ రాఘవరావు - అద్దె ఎక్కువ యిప్పిస్తానని నా దగ్గర కూడా రెండు వందలు తీసుకున్నాడు" అన్నాడు.

రామచంద్రుడు ఆశ్చర్యపోయాడు, మనసులో యింకా అనుమానాలున్నా - రాఘవరావు తనకి టోకరా ఇచ్చాడా అన్న అనుమానం వచ్చింది.

ఉన్ని లేచి లోపలికి వెళ్ళి డబ్బు తీసుకువచ్చి అతని ముందు ఉంచి-

"మీకు నా మాటల మీద నమ్మకం లేకపోతే యీ డబ్బు తీసుకోండి" అన్నాడు.

అతను తెలుగుభాషలో మాట్లాడకపోయినా రామచంద్రుడికి అర్థం అయిపోయింది. అతని మనసులో రకరకాల భావాలు ఒక్కమారుగా చొరబడ్డాయి.

"అయామ్ సారీ! సారీ!" అంటూ అతని చేతులు పుచ్చుకున్నాడు. డబ్బులు అతని చేతిలోనే ఉంచాడు.

రామచంద్రుడి మనసంతా భరించరాని అసహ్యం! జుగుప్స! ఉద్రేకం అపుకోలేక అన్నాడు కుట్టీతో -

"మా తెలుగు వాళ్ళంతా యింతేనండి! వొట్టి లుచ్చాలు! మాకు మేమే గోతులు తవ్వుతాం! చిచ్చీ!"

కుట్టీ నవ్వుతూంటే హేళన తొంగిచూస్తోంది.

"వాట్? వాట్?" అన్నాడు ఉన్ని.

నవ్వుతూ చెప్పాడు కుట్టి. ఉన్ని రామచంద్రుడి భుజం మీద చెయ్యి వేసాడు. కళ్ళలోకి చూసాడు. అవి మానవుడి నేత్రాలు! అవి ఏ భాషకూ అందని భావాలను అతి సులువుగా వ్యక్తపరిచే నేత్రాలు! మానవ నేత్రాలు!

అతను అన్నది ఏమిటో రామచంద్రుడికి వినపడుతోంది. ఆ అనుభూతి అందుతోంది. ఉన్ని మాటలు వింటూ ఉన్న కుట్టి నవ్వూ హేళనా ఆగిపోయాయి.

విషయాన్ని వివరించాడు కుట్టి.

"మిత్రమా! అతన్ని తెలుగువాడని తిట్టుకోకు! యిక్కడ తెలుగూ మలయాళమూ హిందీ తమిళమూ అని లేవు! ఉన్నదల్లా మనుషులు! ఉన్న భేదమల్లా మంచితనమూ - చెడ్డతనమూ అంతే!"

మన భాష, మన కులం, మన మతం, మన దేశంలాంటి భావాలనుంచి బదిలీ కావటం ప్రారంభించాడు రామచంద్రుడు.

లోపల కాసెట్‌లోంచి ముఖేష్ గొంతు వినవస్తోంది -

"బస్ వొ హీ అపరాధ్ మై హర్‌బార్

కరతా హూఁ!

ఆదమీ హూఁ!

ఆదమీ సే ప్యార్ కరతా హూఁ!"

*(ఆంధ్రసచిత్రవారపత్రిక - 27/2, 5/3 - 1987)*

# సందర్భం

సాయంకాలం అవుతోంది.

హైదరాబాద్ నగరం జనసమ్మర్ధంతో ఊపిరి నలపకుండా ఉంది. చార్మినార్ క్రాస్‌రోడ్స్‌కి కొంచెం దూరంగా అశోక్‌నగర్‌లో ఉన్న ఆ అపార్ట్‌మెంట్ తలుపు గంట మోగింది.

మోగించిన కృష్ణారావూ, అతనితో వచ్చిన నారాయణరెడ్డి, రాజమల్లయ్య, శాస్త్రి, మురళీ ఏదో చర్చలో ఉన్నారు.

చర్చ సాగుతూన్నా తలుపు తెరుచుకోలేదు.

ఎదుటి అపార్ట్‌మెంట్ తలుపొకమారు తీసి, ఆ యింటావిడ యీ మంద ఏమిటా అన్న కుతూహలాన్ని ప్రదర్శించి, 'ఆవిడ లోపలే ఉన్నారు-' అంటూ సమాచారాన్ని యిచ్చి తలుపు మూసుకుంది.

కృష్ణారావు కాస్త ఎక్కువసేపు బటన్ నొక్కాడు.

లోపలినుంచి పక్షుల అరపుల గంటమోత బయటకు వినవస్తోంది.

మరికొంతసేపట్లో తలుపు తెరుచుకుంది.

"వస్తున్నానంటినిగా-" అంటున్న ప్రభ వాళ్ళను చూడగానే ఓ బలవంతపు నవ్వుతో తన విసుగును అణుచుకుని "రండి రండి" అంటూ లోపలికి నడిచింది.

"కూర్చోండి-" అంటూ డ్రాయింగ్ రూంలో సోఫా కుర్చీలు చూపించాడు. తలుపు తెరవగానే కనిపించిన మార్క్సు ఫోటోనీ, షోకేస్‌లో ఉన్న లెనిన్, స్టాలిన్, మావోల చిత్రాలనీ చూస్తూ కూర్చున్నాడు మురళి.

వాళ్ళందరూ సోఫాల్లో కుర్చీల్లో సర్దుకుంటుండగా కృష్ణారావు బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

"ఏమయింది ప్రభా, తలుపు తియ్యలేదు?" అడిగాడు కృష్ణారావు. ప్రభ మంచం మీద వేసిన ఫోమ్ పరుపు మీద కూర్చుని ఉంది.

"నీకేమయింది-ఒక్క నిమిషం ఆగలేకపోయావ్?" అంది.

టివీలో ఏదో హిందీ సినిమా ప్రోగ్రాం వస్తోంది. ఫలానా సినిమా ఎలా ఉందన్న ప్రశ్నకు తోసుకు తోసుకు జవాబిస్తున్నారు 'జబర్దస్త్', 'ఫస్ట్‌క్లాస్' అంటూ.

"-యిదన్నమాట ఘనకార్యం-" అన్నాడు కృష్ణారావు, ఆ గదిలోనే అమర్చిన పుస్తకాల సొరుగుల వయిపు నడుస్తూ.

"నువ్వు వెలగబెడుతున్నదేమిటి?" అంది ప్రభ.

ఒక్క చూపు ఆమె వయిపు చూసి, తనకు కావల్సిన పుస్తకం దొరకగానే తలుపు వయిపు నడిచాడు -

చటుక్కున ఆగి - గుర్తుకు వచ్చినట్టు-

"అయామ్ సారీ ప్రభా! నీకు కోర్టుకి ఫోన్ చేసి కనుక్కుంటానన్నాను. కుదరలేదు -" అన్నాడు.

ప్రభ రిమోట్ ద్వారా ధ్వనిని ఆపి - అతని వేపు తిరిగింది.

"కుదరలేదా- మర్చిపోయావా?" అంది.

"ఏదైతేనేం - సారీ చెప్పానుగదా! ఇంతకీ జడ్జీ తీర్పు యిచ్చాడా?"

"హాయిగా టైముకి వెళ్ళి ఫోన్లు చేసుకుంటూ, గోళ్ళు గిల్లుకుంటూ టైముకి యింటికి వచ్చే బాంక్‌లో లా ఆఫీసరువి - నీకెలా కుదురుతుంది-?" అంది ప్రభ. ఆమె గొంతులో తేడా కృష్ణారావుకి అందింది.

"సారీ- అన్నానుగా?"

"సో సింపుల్ - మన రిలేషన్స్‌ని మెంటైన్ చెయ్యటానికి నీ కంట్రిబ్యూషన్ ఏంటి? సారీ- ట -సారీ!"

"ఆ లెక్కలకి మనకి చాలా సమయం ఉంది-"

"మనకి - అనకు. మగాడివిగా - నీకు-ఉండటమే యింపార్టెంట్!"

కృష్ణారావు జవాబివ్వకుండా బయటకు నడిచాడు. అతనింకా గదిలోంచి వెళ్ళకుండానే ప్రభ రిమోట్‌లో మ్యూట్ మార్చింది.

కృష్ణారావు వచ్చి ఒక కుర్చీలో కూర్చున్నాడు. ఆ యింటికి తొలిసారిగా వచ్చిన మురళి ఆ గదిలో బొమ్మలను చూస్తున్నప్పుడు అతని మొహంలో మారిన రంగులను గమనించిన శాస్త్రి అతనితో ఏదో మాట్లాడుతున్నాడు.

కృష్ణారావు కుర్చీలో కూలబడినట్లు కూర్చున్న సంగతి గ్రహించిన మురళి- "ఏమయింది సార్?" అన్నాడు.

"జస్ట్ - అలసట- అంతే!" సర్దుకోటానికి ప్రయత్నించాడు కృష్ణారావు.

"పోనీ - యీ రోజుకి డిస్పర్స్ అయిపోదామా?" అన్నాడు రాజమల్లయ్య-

"ఛఛ - బలేవాళ్ళే - మనం పనిలో దిగాల్సిందే - ఆ అమ్మాయి ఏం చెప్పాలో మనం జాగ్రత్తగా ప్లాన్ చెయ్యాలి. ఆలస్యం జరగకూడదు-" అన్నాడు కృష్ణారావు.

"-స్టేట్‌మెంట్‌కేం ఫర్వాలేదు - తొందరలేదు - ఎగ్జామిన్ చేసిన డాక్టర్ ఒకప్పుడు ప్రోగ్రెసివ్. పీడీయస్‌యూలో ఉండేది. ఎంతో కొంత వాసనలు మిగలకుండా పోవు. మనం వెళ్ళి కలిస్తే తప్పకుండా సహకరిస్తుంది - ఆవిడ మన పక్షాన్న వుంటే యిప్పుడు మనం ఏం మాట్లాడినా ఫరవాలేదు - ఆ అమ్మాయి ఏం చెప్పినా ఫరవాలేదు -" అంటూ ఆగి, -"మనం చూడాల్సింది ప్రెస్‌ని. వెంటనే ప్రెస్‌మీట్ ఏర్పాటు చేయాలి-" అన్నాడు నారాయణరెడ్డి.

"అవతల మనిషి సామాన్యుడు కాడు- మంత్రికి మనవడు-కోర్టులో మనం చెప్పబోయేదీ- ప్రెస్‌లో చెప్పేదీ ఒక్కటే అవాలి. అది కేస్‌కి బలం యిస్తుంది. ముందు స్టేట్‌మెంట్ గురించి చర్చిద్దాం-" అన్నాడు కృష్ణారావు సాలోచనగా.

"మనకి రెండూ ముఖ్యమే" అన్నాడు జుత్తు బాగా తెల్లబడిన శాస్త్రి.

"ప్రెస్సూ, పబ్లిక్ ప్రొటెస్టూ ఒకదానితో ఒకటి లింకు. కేసు తేలటానికి చచ్చినంత టైముంది. బోల్డంత చర్చించవచ్చు-" అన్నాడు రెడ్డి.

రెడ్డి వాదన కొనసాగుతోంది-జర్నలిస్టులను పోగేసి ప్రెస్‌మీట్ ఏర్పాటు చెయ్యటం సులువుగానే అవుతుంది. జనాలను పోగెయ్యాలి. దానికి తయారీ అవసరం-

అతనిది పెద్ద గొంతుక.

ఓరగా తెరచి వున్న పడకగది తలుపుని లాగి, పెద్ద శబ్దం చేస్తూ వేసింది ప్రభ.

ఒక్క త్రుటి మాటలు ఆగిపోయాయి. చూపులు అటువేపు తిరిగాయి.

కృష్ణారావు చటుక్కునలేచి - "కాఫీ తెస్తాను-మాట్లాడుతూండండి-" అన్నాడు.

అతని వెనకే పడకగది తలుపు మూసుకొంది.

ప్రభ అతనివేపు తిరిగి - "ఎందుకంత అరుపులు?" అంది.

"మేం సరదాగా కబుర్లు చెప్పుకోవటం లేదు-" గొంతు తగ్గించినా కోపంగా అన్నాడు.

టీవీలో ప్రోగ్రాం ఆగి, ప్రకటనలు మొదలయ్యాయి. మ్యూట్ నొక్కింది ప్రభ.

"కోపం తెచ్చుకోవాల్సింది నేను - తెచ్చుకుంటున్నది నువ్వు."

"ఎన్నిసార్లు సారీ చెప్పాలి? అంత చిరాగ్గా ఉన్నావు - కేసు కొట్టేసారా?"

"వాయిదా పడింది. అయినా ఫోన్ చెయ్యమన్నది నేను. అది నా సెంటిమెంట్. నీకెందుకు పడుతుంది-యింతకీ ఏం పనిమీద వచ్చావు-? నాకు బుద్ధి చెప్పటమే అయితే ఆ పని పూర్తయినట్టేనా?-యింకా ఉందా?"

"కాఫీ-" అన్నాడు.

కళ్ళు పెద్దవిచేసి- తల పైకీ కిందకీ ఆడిస్తూ-"ఎన్ని?" అంది.

"అయిదు కప్పులు చాలు-"

"మీ కోటేశ్వరరావుగారికి సుగర్ కాబోలు-"

"గుర్తుంచుకొన్నందుకు థాంక్స్ - అతనింకా రాలేదు!"

"ఏంటి గూడుపుఠాణీ - అందరూ చేరారు-"

"రేప్"

"రేపా? ఎవరూ?- కొంపదీసి-! జోకు వేస్తే ఏడుస్తావుగదా!"

దేన్నయినా జోక్ చేయగల తత్వం ఆమెది. మొదటినుంచీ ఆమె అంతే! ఆ తత్వం ఎప్పుడూ అతనికి నచ్చలేదు. అప్పుడూ నచ్చలేదు-అయినా దాన్ని లాగకుండా పీకకుండా అన్నాడు.

"ఒక కన్స్ట్రక్షన్ కూలీని - ఒక మంత్రి మనవడు-" క్లుప్తంగా సీరియస్‌గా మొదలుపెట్టాడు కృష్ణారావు.

ప్రకటనలు ఆగి, కార్యక్రమం మొదలవగానే టీవీ మ్యూట్ మార్చింది.

చెపుతున్నది టక్కున ఆపి, ఆమెను పరిశీలనగా చూసాడు. ప్రభ టీవీలో మునిగిపోయింది.

"కాఫీ పెడతావా ప్రభా!" అనునయంగా అడిగాడు.

"సరే-" అంది బుర్ర తిప్పకుండా.

"థాంక్స్-" అనేసి, తలుపు నెమ్మదిగా వేసి, డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు. వస్తూనే, పెన్నూ కాగితాలూ తీసుకువచ్చాడు.

"మీరు మేడమ్‌కి ట్రబుల్ యివ్వకుండా ఉండాల్సింది." అంతవరకూ సంభాషణలో పాల్గొనకుండా ఉన్న మురళి అన్నాడు.

"నో - నో - నాటెటాల్-" అంటూనే - "చెప్పండి - ఏం నిర్ణయించారు?" అన్నాడు.

కృష్ణారావు గొంతు మురళికి నచ్చలేదు- వెంటనే అన్నాడు-

"నాక్కూడా మన పనే ముఖ్యం - అయినప్పటికీ చెప్పక తప్పదు-మనకీ, తతిమ్మా మగాళ్ళకీ తేడా ఏంలేదు. పేకాటలు ఆడుకునే మగవాళ్ళూ కాఫీలు అందించమని ఆడాళ్ళకి ఆజ్ఞాపిస్తారు-మనమూ అదే చేస్తాం - అఫ్‌కోర్స్ - మనం సోషల్ ఏక్టివిటీస్‌లో ఉన్నాం గనుక- మరింత అథారిటీ చలాయిస్తాం-"

"అబ్బెబ్బే - అదేంలేదు - మీరూ అఫెండయారు- నా ఉద్దేశ్యం-" అంటూ ఏదో చెప్పబోయాడు కృష్ణారావు.

"ఊరుకోండి సారూ- ఆ అబ్బాయికింకా పెళ్ళికాలేదు-" అన్నాడు రాజమల్లయ్య.

మురళి మొహం జేవురించింది - "అవును- చేసుకోను కూడా! స్త్రీని గౌరవించగల శక్తి సంపాదించుకున్నప్పుడే నేను పెళ్ళికి అర్హుడిని -" అన్నాడు.

"అయితే-నన్నిప్పుడేం చేయమని?" అన్నాడు కృష్ణారావు.

"మేడమ్ ప్రాక్టీసు చేస్తున్న పెద్ద లాయర్ అని విన్నాను-"

"పెద్దేముందిలెండి - ఏదో -" మోడెస్టీగా అన్నాననుకున్నాడు కృష్ణారావు.

"అవును సర్! ఆడవాళ్ళ ప్రాక్టీస్‌దేముంది! ఏదో అయినప్పటికీ, ఆవిడను మన సమావేశాల్లోకి ఆహ్వానించకపోటం తప్పు. కనీసం - యిలాంటి స్త్రీల సమస్యల చర్చలోకయినా - మేడమ్‌ని అనుమతించకపోటం టూమచ్! కాఫీకేముంది? అందరం మాట్లాడం గదా- ఖాళీగా ఉన్నవాళ్ళు పెట్టవచ్చు! వంటింట్లోకి నాలాంటి వాళ్ళకి అనుమతి ఉంటే - నేను పెడతాను" అన్నాడు మురళి.

అక్కడ ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరించుకుంది.

రెడ్డి, రాజమల్లయ్య, శాస్త్రి ఒకరి మొహాల్లోకి ఒకరు చూసుకుని కృష్ణారావు వేపు చూసారు. అతను పాడ్ మీద అస్తవ్యస్తంగా రాస్తూ ఒక్కమారుగా లేచి, మురళిని సమీపించి, భుజం మీద చెయ్యివేసి నొక్కాడు.

"మీ వయసులో నేనూ మీలాగే ఉండేవాడిని. మీరు ఏమీ అనుకోకపోతే - మన యీ సంభాషణని ప్రస్తుతానికి ఆపుదాం-మనం ఆ అమ్మాయికి న్యాయం జరిగేట్టు చూడాలి. కోర్టులో కేసు బలంగా ఉండాలి. పబ్లిక్ అవేర్‌నెస్ కోసం, పార్టిసిపేషన్ కోసం ప్రయత్నించాలి. ప్రొటెస్ట్ నిర్వహించాలి. ప్రెస్‌ని కదిలించాలి-ప్లీజ్-మనం కొంత గట్టిగా, పట్టుదలగా-"

తలుపు గంట మోగింది.

"కోటేశ్వరరావు అయుంటాడు-" అంటూ తలుపు తీయటానికి వెళ్ళాడు-

"నువ్వన్నదాంట్లో పాయింటుంది తమ్ముడూ - సారు నువ్వనుకునే రకం కాదు. నీకే తెలుస్తుంది" అంటూ చల్లార్చటానికి నవ్వాడు రెడ్డి, మురళి వయిపు చూస్తూ.

కోటేశ్వరరావు వస్తూనే 'నమస్కారాలు నమస్కారాలు'-- అంటూ సోఫాలో రెడ్డి పక్కనే చతికిలబడ్డాడు. అతనికి ఈ మధ్యనే పెద్దగా గుండెపోటు వచ్చింది- 'పోదామనుకున్నాను. యింకా విప్లవం రాలేదు-ఎందుకు పోడంలే? అనేసి మానేసాను'- అంటూ తన మీద తనే జోక్ వేసుకున్నాడు అతన్ని గురించి అందరూ వేసే జోకేంటంటే - 'ఎక్కడ అన్యాయం జరిగినా-అక్కడ ఎవరితోనో ఒకరితో కుస్తీ పడుతూ కనపడతాడు-' అంటారు. అతన్ని డాక్టర్లు కొంచెం తిరుగుడూ, గొడవలూ మానమన్నారు గుండెపోటు వచ్చాక-

'అప్పుడింక యీ గుండె ఉండేం లాభమబ్బా!' అనేసాడు.

వస్తూనే- "ఏందబ్బా! ఎస్. సి పిల్లకాయలు ఫస్ట్‌క్లాసులు యివ్వకపోతే మీ ప్రొఫెసర్ల మాడు పగలగొడతామంటున్నారంట-అదేదో యూనివర్సిటీలో!" అన్నాడు కోటేశ్వరరావు రెడ్డి చేతిని గట్టిగా నొక్కుతూ.

రెడ్డి కంగారుగా అన్నాడు - "కోటిబాబూ! ఈయన మురళి-చాలా చురుకు-నువ్వు కలియలేదా?"

"అదేంటబ్బా? ముసిలాడినయిపోయాననంటావా ఏంది? ఓమారు చూస్తే చాలు - కంప్యూటర్లో సెటిలయిపోతుంది - దళితుల చేత మలం తినిపించిన కేసులో మనతో ఫాక్ట్ ఫైండింగ్‌కి వచ్చాడు - ఎక్కువ మాట్లాడ్డు-" అన్నాడు కోటేశ్వరరావు.

"మీకు మురళి తెలుసు! మురళీ యస్. సీ అని రెడ్డిగారు పరిచయం చేస్తున్నారు-" అన్నాడు మురళి.

కృష్ణారావుకి పరిస్థితిని ఎలా సర్దాలో అర్థం కాలేదు. కోటేశ్వరరావు పని దెయ్యమేగాని మాటలో కాస్త వదురు. ఈ పరిస్థితిని అతడు సరదాగానే తీసుకుని, ఏదోలా మరో జోకు వెయ్యబోతాడు. మురళి దాన్ని ఎలా తీసుకుంటాడో!- అనుకున్నాడు.

"నేను కాఫీ తీసుకొస్తాను. మాట్లాడుతూండండి-" అంటూ కదలబోయాడు.

మురళికి జవాబివ్వటానికి కోటేశ్వరరావు కొంచెం తడబడ్డాడు. మురళియే తీవ్రంగా అన్నాడు-

"సబ్జక్ట్స్‌ని నిర్ణయించేది మీరు -. పరీక్షల విధానం మీది - మార్కులు యిచ్చేది మీరు - అప్పుడు మాకు ఫస్ట్‌క్లాస్ రావాలి. అదీ మా ప్రతిభకు యార్డ్‌స్టిక్. అప్పుడే మాకు మినిమమ్ ఎలిజిబిలిటీ వస్తుంది. పీజీ లెవెల్లో మా పెర్ఫార్మెన్స్‌నీ, గ్రాడ్యుయేట్ లెవెల్లో - అందులోనూ - ఆర్ట్సులో మా పెర్ఫార్మెన్స్‌నీ ఎవరయినా - బేరీజు వేసారా? మీ పెద్దకులాల చిన్నబుద్ధులు అప్పుడు బయటపడతాయి"

కృష్ణారావు అతని మాటలు అవగానే అక్కడనుంచి కదిలి గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. 'మురళి ఆరోపణలో నిజం ఎలా వెరిఫై చేయటం?' అనుకున్నాడు.

కృష్ణారావు ప్రభ తలవద్ద నిలబడి టీవీ ప్రోగ్రాంనీ, ఆమెనీ మార్చి మార్చి చూసాడు.

"ప్రభా!" గొంతు సవరించుకుని అన్నాడు.

"ఏంటి?" అది చూపు మార్చకుండా.

"కాఫీ-పెట్టావా?"

"ఓ... సారీ... మరిచేపోయాను-" అనేసి, తలెత్తి చురుక్కున అతన్ని చూసింది.

"ఏం... నువ్వు పెట్టుకోరాదా - కాఫీ?"

"పెడతానన్నావు గదా-"

"అన్నాను-మాటవరసకు అన్నాను-పోన్లే-అలిసిపోయింది-పనిలో ఉందని-నువ్వే పెట్టుకోవచ్చుగా!"

"పని...అవునవునూ....పనే!" అంటూ వంటింటివేపు నడిచాడు.

"నీ ఉద్దేశ్యమేంటి?"

"ఏముంది? ఏమీ లేదు-" అంటూ వంటయింట్లోకి వెళ్ళాడు. స్టౌ వెలిగించాడు. పాలు ఫ్రిజ్జులోంచి తీసి స్టౌ మీద పెట్టాడు. బ్రూ ఎదురుగానే కనిపించింది. తీసి, కప్పులు కడిగి, ట్రేలో సర్దాడు.

పాలు కాగుతున్నాయి. అతని మనసు పరిపరివిధాలపోయింది.

బ్రూ తనకి యిష్టముండదు. ప్రభ చేతి ఫిల్టరు కాఫీ చాలా రుచిగా వుంటుంది. కనీసం డికాక్షనయినా వెయ్యమంటాడు. టైం లేదంటుంది. ఎప్పుడూ బ్రూ కలిపి యిస్తుంది! ఎంత మారిపోయింది ప్రభ!

దిగులుగా అనిపించింది కృష్ణారావుకి!

కాఫీలాంటి చిన్న విషయంలో మార్పుకి బాధ పడటం ఏమిటి? ప్రభలో ఎంత మార్పు! ఎంత పతనం!

*కాలేజీ రోజుల్లో ఇద్దరినీ ఉద్యమం ఆకర్షించింది. ఉత్తేజపరిచింది. తనకన్నా ఎప్పుడూ ప్రభ ముందుండేది. ఇద్దరూ కలిసి ఎన్ని కబుర్లు! ఎన్ని చర్చలు! ఎన్ని స్వప్నాలు! స్లమ్స్‌కి వెళ్ళి పాఠాలు... పాటలు! గద్దర్ పాటలు విని, శ్రీశ్రీ కవిత్వం చదివి, జ్వాలాముఖి ఉపన్యాసాలు విని... ఎంత ఆవేశం! ఎంత ఉద్రేకం! ఎమర్జన్సీలో శ్రీశ్రీ పట్ల ఎంత కోపం! పతనం పట్ల ఎంత ఏవగింపు!*

*ఆ ఉద్రేకం, ఆ ఉత్తేజం - యిద్దరినీ దగ్గర చేసింది. చివరకు ఏకం చేసింది. కేవలం ఆ ఉద్రేకమేనా యిద్దరినీ ఏకం చేసింది? అది సత్యమా? అంతేనా-?*

*ఉద్రేకం కలిగించేవి - బహిరంగ పరిస్థితులా - అంతరంగ స్థితా? సామాజిక పరిస్థితులా - శారీరక పరిస్థితులా?*

*సామాజిక పరిస్థితులూ, ఉద్యమాలూ, బహిరంగ ప్రభావమే మానవుని సామాజిక చైతన్యానికి, అతని ప్రవర్తనకీ, ఆంతరంగిక ఆనంద విషాదాలకీ, హృదయంలో యిష్టాయిష్టాలకీ- అన్నింటికీ కారణంగా భావించటం అలవాటయింది. అలా భావించటమే సిద్ధాంత నిబద్ధతగా అనిపించేది.*

**కానీ,**

మనిషి మనిషికీ ఉన్న తేడాలూ, అతనిపై వయోప్రభావం, మెదడు చురుకుదనం, హృదయపు మెత్తదనం మొదలయినవాటి ప్రభావం మానవుడి

సామాజిక చైతన్యానికి, అతని ప్రతిస్పందనకీ, ప్రతి క్రియకూ మూలం కావచ్చున్నది - ఎన్నడూ అంగీకరించబుద్ధి కాలేదు. కనీసం ఆలోచనలోకి కూడా రావటం యిష్టముండేది కాదు.

వర్గ మనస్తత్వం అంటే వ్యక్తికి ఉండే స్వభావమేనా అని అప్పుడప్పుడూ అనుమానం వచ్చి చర్చించేవారు గాని, వ్యక్తి స్వభావానికి సాంఘిక పరిస్థితులు మాత్రమే కారణంగా భావించటంలో ఎప్పుడూ సంశయించలేదు.

- తమ మధ్య బంధం పుట్టటానికీ, అది బలపడటానికీ కారణమైన సామాజిక ఉద్రేకం తనను విడిచిపెట్టలేదు. ప్రభను విడిచిపెట్టింది. - ఇది తన అభిప్రాయం కాదు- ఇది తన నమ్మకం! అది సరయినదేనా? తనని తను నమ్మించుకోటం కాదూ?

ఇందాకా మురళితో ఏమన్నాడు? వయసులో నేనెలా ఉండేవాడినో నువ్వు గుర్తుచేసావన్నాడు.

అంటే అర్థం ఏమిటి?

అప్పటి తన ఉద్రేకం యీనాడు లేదనే గదా! కనీసం కొంత తగ్గిందనే గదా!

తగ్గటమే పతనమయితే-ప్రభలో పూర్తిగా తగ్గిపోయిందనీ, అది పతనమనీ భావించే తను కూడా అంతో యింతో పతనమయినట్లే గదా? పతనం అన్నది ముఖ్యమా - అది ఎంతన్నది ముఖ్యమా?

తనది పతనం కాదు. తన ఉద్రేకం కొంత తగ్గింది. అంతే అనే అనుకుందాం! దానికి కారణం ఏమిటి?

సామాజిక పరిస్థితులతో వ్యక్తుల ఆంతరంగిక చైతన్యం సమాంతరంగా అనులోమానుపాతంలో ఉంటుందని గదా తన సిద్ధాంతం, తన నమ్మకం. తన ఉద్రేకం తగ్గటం ఆధారంగా సామాజిక పరిస్థితులు మెరుగయాయని అనుకోవాలా?

అంటే-

సమాజంలో దోపిడీ, పీడనల స్థాయికీ, దాని ప్రతిఘటనోద్యమ స్థాయికీ సంబంధం నిర్దుష్టమా? ప్రతిఘటనోద్యమ స్థాయి తనలాంటివాళ్ళను ఉద్రేకపరచగలదనే అనుకుందాం - మాటవరసకి - వ్యక్తి వయసుకీ, స్వభావానికీ పరిమితం కాదనే అనుకుందాం - యిప్పుడు తన ఉద్రేకం తగ్గిందంటే ప్రతిఘటనోద్యమం తగ్గినట్లా? అంటే - దోపిడీ తగ్గినట్లా?

కృష్ణారావు మరిగిన పాలను కప్పుల్లో పోసి, బ్రూ వేసాడు. పంచదార కలిపాడు. ముందు బ్రూ - తర్వాత పాలూ వెయ్యాలా? కలిసేవి ఆ రెండేగదా- రుచిలో ఎలా తేడా వస్తుంది?

కృష్ణారావు వెచ్చని గిన్నెతో నుదురు వెచ్చబరుచుకున్నాడు. కప్పుల్ని ట్రేలో సర్ది, ప్రభదగ్గరకు వచ్చాడు.

తన కప్పు తీసుకుంటూ "అయామ్ సారీ కృష్ణా! బాగా ఇంట్రస్టింగ్‌గా వుంది ప్రోగ్రాం" అంది.

కృష్ణారావు వెంటనే అన్నాడు - "ప్రభా! చిన్న రిక్వెస్ట్-"

"చెప్పు."

"నువ్వు కూడా మా మీటింగ్‌లోకి రారాదూ?"

తాగుతున్న కప్పు కిందపెట్టి - "పంచదార తక్కువైంది" అంటూ వెళ్ళి సీసా, చెంచా తీసుకువచ్చింది.

"అరె! యింకా నిలబడ్డావేం? కాఫీలు చల్లారిపోవూ?" అంది పంచదార తన కప్పులో వేసుకుంటూ-

"నువ్వు ఏమయినా చెప్తుతావేమోనని-"

"ఏ విషయం?"

"మా మీటింగ్ - బయట అందరూ వున్నారు-"

"ఎందుకూ?"

"చెప్పానుగా-ఒకమ్మాయిని రేప్ చేశాడు. ఆ అమ్మాయి బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్‌లో కూలి. ఆ రోజు తడపటానికని కొంతమందినే రమ్మన్నారు. కాంట్రాక్టర్ కొడుకు - చాలా ఇన్‌ఫ్లూయెన్స్ ఉంది. మినిస్టర్‌గారి మనవడు - ఆ పిల్లను ఓ గదిలోకి లాక్కెళ్ళి పాడు చేశాడు."

"సో?"

కృష్ణారావు మాట్లాడలేదు. అతన్నించి జవాబు రాకపోయేసరికి, ప్రభ టీవీ నుంచి చూపు తిప్పింది.

"ఆ తర్వాత ఏం జరిగిందని?"

"యింకా ఏం జరగలేదు-నువ్వు కూడా వస్తే - ఏం చెయ్యొచ్చో ఆలోచించవచ్చు."

"యిప్పుడు షారుఖ్‌ఖాన్ యింటర్వ్యూ ఉంది-" అంది కొంచెం అపాలజిటిక్‌గా!

"నీలో సింపతీ అన్నది చచ్చిపోయింది- కనీసం తోటి స్త్రీల సమస్యలు కూడా నిన్ను కదిలించటంలేదు" అన్నాడు.

ప్రభలో అతను ఆశించిన మార్పు కనపడలేదు-ఆమె కళ్ళల్లో కదుల్తున్నదేమిటో అతనికి అందలేదు.

ఎగాదిగా అతన్ని పరిశీలించి, భరించరాని అసహ్యం చూపులోనూ, గొంతులోనూ కనపడుతూండగా అంది-

"నీకు - నీకు - సింపతీ ఉందనుకుంటున్నావా? నథింగ్! నిన్ను నువ్వు బూస్ట్ చేసుకోకు-"

అతను ట్రేతో అక్కడనించి కదిలాడు. ఆమె అసహ్యం, ఛీత్కారం అతన్ని కోపంతో నింపి, మెదడు పనిచేయకుండా చేసాయి.

తలుపు తెరవటంకోసం, అతను ట్రేని కిందపెట్టి వంగుతూంటే భంగిమలోని ఆ మార్పు-అతన్ని ఆలోచనారాహిత్యాన్నించి బయటకి లాగింది.

ఎందుకంత అసహ్యం? తాను వ్యక్తం చేసిన అసహ్యానికి ప్రతీకారమా? లేక మరేదయినా ఉందా? పాతికేళ్ళ పైగా కలిసి బ్రతుకుతున్నారు. కలిపి ఉంచేందుకు మంత్రాలు లేవు. మంగళ సూత్రాలు లేవు. చట్టబద్ధమైన కాగితాలు లేవు. చిట్ట చివరికి పిల్లల బాధ్యతలు కూడా లేవు. అయినా కలిసే బ్రతుకుతున్నారు - యింత పరస్పర అసహ్యంతోనా?

పడకగది తలుపు మూసేసి, డ్రాయింగ్ రూంలో మిత్రులను సమీపించాడు. అందరూ తలో కప్పూ తీసుకున్నారు.

కృష్ణారావు బాత్రూం నెపంమీద వెళ్ళి మొహం కడుక్కుని తిరిగి వచ్చాడు.

సమావేశం సాగుతోంది.

డాక్టర్ని కలియటం, ప్రెస్‌మీట్. పబ్లిక్ ప్రొటెస్ట్‌కి ప్లాన్ చెయ్యటం, కరపత్రం వెయ్యటం వగైరాలమీద చర్చ సులువుగానే తెగింది.

శాస్త్రి అన్నాడు- "ఆ అమ్మాయి వయసెంత?"

"ఏం సారూ?" అన్నాడు రాజమల్లయ్య.

"పదిహేడో పద్దెనిమిదో ఉండొచ్చు-" అన్నాడు కృష్ణారావు.

"నాకు గుర్తున్నంతవరకూ పదహారేళ్ళలోపు పిల్ల అయితే - ఆమెకు యిష్టమున్నా లేకపోయినా అది రేప్ అవుతుంది" అన్నాడు శాస్త్రి.

"ఏం సామీ - ఏం పాయింటు లాగావూ. సూడబ్బా కృష్ణారావూ-పుస్తకం సూడు."

ఆ పని వాళ్ళు చేస్తుంటే కళ్ళు మూసుకుని కూర్చున్న మురళిని శాస్త్రి పరిశీలించాడు. నస్యం ముక్కుతో పీల్చి, నెమ్మదిగా లేచి అతని భుజం మీద చెయ్యివేసి కుదిపాడు.

"రెస్ట్‌లెస్‌నెస్ మంచిదికాదు బాబూ!"

"నాకేం సర్! బాగానే వున్నాను."

శాస్త్రి అతని చెయ్యి పట్టుకుని బయట బాల్కనీలోకి నడిచాడు-

"గుంపు అంటేనే విభిన్న స్వభావాలు. విభిన్న విధానాలు. ఒక్కోమారు మనం నడవాలి. ఒక్కోమారు మనం నడపాలి. మనకి ఎన్నో ఉన్నత భావాలూ, ప్రాణాలు అర్పించగల త్యాగగుణం ఉన్నప్పటికీ - మన జాతికి ఒక బలహీనత

వుంది. మనకి - ముఖ్యంగా చదువుకున్నామనుకునే వాళ్ళకి - ఒకరి వెనక నడవటానికి సంకోచం. పదిమందిని నడపటానికి కూడా మనలో అహాన్ని ఎంతోకొంత తగ్గించుకోవాలి. మనం వందమందిలో కలిసి నడవలేం! పదిమందిని కూడగట్టుకుని నడవలేం! నిజమైన కార్యకర్త ఒకే సమయంలో అనుచరుడూ, నాయకుడూ రెండు పాత్రలూ వెయ్యాల్సి ఉంటుంది."

"మీరేం చెబుతున్నారు సార్?"

"వస్తా! భూమి పుట్టినప్పట్నించీ ఉన్న చర్చ యిది. లక్ష్యాలు ప్రధానమా? విధానాలా? చిత్తశుద్ధి - శివపూజ చర్చ అంటుంటాను- నారాయణ అంటే చాలు మోక్షం అని ఒకడూ - చిత్తశుద్ధి లేకపోతే ఉత్తి శివపూజలు వ్యర్థమని యింకొకడూ-"

"ఇద్దరూ మీ బ్రాహ్మలే" అన్నాడు మురళి.

"కరెక్ట్ - యిద్దరూ ఆయా కాలాల్లో ఆలోచనాపరులే!"

"బ్రాహ్మలు మాత్రం ఆలోచనాపరులంటే నేను ఒప్పుకోను. వాళ్ళలో ఆలోచనాపరుల ఆలోచనలు మాత్రం రికార్డయాయి."

శాస్త్రి మురళి కళ్ళలోకి చూసాడు. ఒక అగ్ని - దాన్ని ఎవరో చాలా నేర్పుగా దారి మళ్ళిస్తున్నారు-అనిపించింది.

"అబ్బాయ్! నాకు నీతో ఎలా మాట్లాడాలో అర్థం కావటంలేదు. గడచిన చరిత్రకూ, వర్తమానానికీ తప్పకుండా సంబంధం ఉంటుంది. వర్తమానంలో మనం ఉన్నస్థానం నుంచే చరిత్రను చూస్తాం! అయితే - వర్తమానం ఎంత సంక్లిష్టమయిపోయిందంటే - మనం ఆలోచనల శకలాల మధ్య నిలబడి ఉన్నాం. మనం ఏ శకలానికి చెందుతామో, ఏ శకలం మనది అని మనం అనుకుంటామో- ఆ రెండూ ఒక్కటే అయి అవకాశమే క్రమేపీ తగ్గిపోతుంది. ఒక్కోమారు మనిషి స్వయంగా ఆలోచించగలడా - ఆ భ్రమలో బ్రతుకుతున్నాడా అనిపిస్తుంది. ప్రపంచంలో పాలకులూ, వర్తకులూ ఏకమవటం ఒకపక్క, పాలితులు దేశాల పేరిట, జాతుల పేరిట, మతాల పేరిట, కులాల పేరిట ప్రాంతాల పేరట.... రకరకాల పేర్లతో....ముక్కలు ముక్కలయిపోవడం మరో పక్కా చూస్తుంటే.... చాలా దిగులుగా వుంటుంది. మన మస్తిష్కాలను కూడా ఎవరో రేప్ చేస్తున్నట్టు. అవి అనాథ శిశువులను కంటున్నట్టు..." అంటూ ఆగాడు శాస్త్రి, ముక్కు పొడుం మరోసారి పీలుస్తూ.

"మీ మాటలు నాకు బోధపడట్టం లేదు సార్-"

"అవి నాకే స్పష్టంగా లేవు. నువ్వన్నదానికి నేను ఆవేశంలో ఏదో అంటున్నాననుకోకు! నేను చెప్పదలుచున్నదొకటే - ఏదయినా విషయం మరీ క్లిష్టంగా ఉంటే సామాజిక శాస్త్రవేత్తలు అనుసరించే మార్గం ఒకటి ఉంది. Kiss దాన్ని అంటారు. అంటే - కీప్ ఇట్ సింపిల్, స్టుపిడ్ - ఆ సూత్రం ప్రకారం

చెప్పాలంటే పని చెయ్యదలుచుకున్న కార్యకర్తకి వచ్చే సమస్యల్లో లక్ష్యాలు ప్రధానమా? విధానాలు ప్రధానమా? అన్న విచికిత్స నిరంతరం ఎదురవుతూంటుంది. విధానాల్లో పొరబాటుంటే దిద్దుకునే అవకాశం ఉంటుంది. లక్ష్యం అంటూ లేకపోతే ఉన్న చోటనే తిరుగుతూ లాంగ్‌మార్చ్ చేశాననే భ్రమలో ఉంటాడు మనిషి"

మురళి కొంతసేపు మాట్లాడలేదు.

అతనికి రోడ్డు మీద జనం - వాహనాలూ వాటి కదలికలూ - అంతా అస్తవ్యస్తంగా వున్నాయి.

"నాకు లక్ష్యం లేదంటారా?"

"నువ్వు చురుకయిన వాడివి" అంటూ ఆగి, ఆలోచనగా అన్నాడు శాస్త్రి. "నా కది ఏమిటో తెలియదంటాను. అలా అనటం నిన్నవమానించటానికి కాదు. అయితే - నేను గమనిస్తున్న దేమిటి అంటే - ఒక కులంలోని ఒక వ్యక్తి రాజకీయాధికారం సంపాదించుకుంటే, ఆ కులం మొత్తం, దాని సాధారణ స్థితి పూర్తిగా బాగుపడుతుంది అనే భావన. కుల, మత రాజకీయాలు ఈ భావనను ఒక యిరుసుగా చేసుకుని సాగుతున్నాయి. ఇది రాజ్యాంగానికి లోబడీ, బయటా రెండింటా కూడా సాగటం-"

"మీకు లక్ష్యం ఉందా?"

"ఉంది."

"ఏమిటది?"

"వర్గరహిత సమాజం-"

"అది స్వప్నం. ఇతర దేశాల సంగతి నాకు తెలియదు. ఈ దేశంలో ధనంలో పేదలు కూడా కులంలో ఘనత కోసం ప్రాణాలిస్తారు. ప్రాణాలు తీస్తారు-"

"అది వాస్తవం. అయితే దాన్నించి నువ్వేర్పరచుకున్న అభిప్రాయంతో నేను ఏకీభవించలేను. దోపిడీ నిరాటంకంగా, పీడన కనబడకుండా కొనసాగటానికి - ఉపయోగపడింది - కులం."

"ఇన్నాళ్ళూ కమ్యూనిస్టులు అన్నదే - కొత్తేముంది?"

"అభిప్రాయాలు మారనవసరం లేదని నేను అనుకోను. అలాగే - కొత్త కోసం కొత్త అవసరం లేదు. పేదరికం, అసమానత అనేవి కనిపించినంత కాలమూ, - నేను చూడకుండా ఉండలేను. వాటిని దైవబద్ధంగా కొంతకాలమూ, ధర్మబద్ధంగా కొంతకాలం చట్టబద్ధంగా కొంతకాలమూ - అన్ని సమాజాలూ చేసాయి. యీనాడు వాటిని 'మానవత్వం' పేరుతో ఎదుర్కొనే ప్రయత్నం చేస్తున్నట్లు చాలా సంఘటితంగా నమ్మించే ప్రయత్నం కనిపిస్తోంది. వాటికి

మూల కారణాలు దోపిడీ, పీడనలేనని మార్క్సు చెప్పాక దోపిడీదారుడు కొత్త మార్గాలు కనిపెడుతూ తన లక్ష్యం మార్చుకోకుండా సాగుతున్నాడు. కాని - మనం విధానాలే ప్రధానంగా విడిపోతూ సాగుతున్నాం."

"అయినా - మీది స్వప్నం కాదంటారు-"

"కొన్ని స్వప్నాలు పారిస్ కమ్యూన్‌లో డబ్భై రోజులు నిజమయ్యాయి. అలాంటివే సోషలిస్ట్ రష్యాలో డబ్భై ఏళ్ళు నిజమయాయి. అవి ఈసారి ఏడువందల - కాదు- ఏడువేల సంవత్సరాలు నిజమవుతాయి. అవి అన్ని హద్దులూ చెరిపేయవచ్చు-"

శాస్త్రికి మురళి చూపులో ఏదో ఆశ కనపడింది.

"ఏందబ్బా-మీ ఇద్దరి గుసగుసలూ?" అంటూ కోటేశ్వరరావు వచ్చాడు.

"సిన్నబ్బా - ముందే తప్పంటినిగదా - యింకా కోపం పోలా?" అన్నాడు.

"అది కాదండీ-" అన్నాడు మురళి. వాళ్ళిద్దర్నీ తీసుకుని లోపలికి నడిచాడు.

"మీరన్నది రైటే శాస్త్రిగారూ! 375 సెక్షన్ ప్రకారం పదహారేళ్ళలోపు పిల్ల యిష్టంతోనయినా, అనుమతితోనయినా సరే-అది రేపే! ఆ అమ్మాయి వయసు పదహారులోపనే అందాం-ప్రెస్సులోనూ, కరపత్రంలోనూ దానిమీద స్ట్రెస్ యిద్దాం" అన్నాడు కృష్ణారావు ఉత్సాహంగా.

"మనమంటే సరిపోదు" అన్నాడు శాస్త్రి.

రెడ్డి నవ్వి - "ఆ పిల్లా, ఆ పిల్ల తండ్రీ మనం చెప్పినట్టు చెప్తుతారు-" అన్నాడు.

"బర్త్ సర్టిఫికెట్?" అన్నాడు మురళి.

"బర్త్ సర్టిఫికెట్టంటేనే తెలవదు - ఆస్తులూ, పాస్తులూ, సదువులూ ఉన్నోళ్ళకి అవ్వన్నీ" అన్నాడు కోటేశ్వరరావు.

"ఆ అమ్మాయి పేరు ఓటర్ల లిస్టులో ఉందేమో కనుక్కోండి" అన్నాడు శాస్త్రి.

రాజమల్లయ్య నాలుకను కొంచెం బయటకు పెట్టి, మునిపంటితో నొక్కుతూ, 'అబ్బో, ముసిలాడు గట్టాడే' అన్నట్టు తలూపాడు.

"పాటుబడే వోళ్ళకీ, అడుక్కుతినీ వాళ్ళకీ ఓట్లెవడిస్తాడబ్బా" అన్నాడు కోటేశ్వరరావు.

"నీ జనరలైజేషన్సన్నీ యిలాగే ఉంటాయి. కనుక్కుందాం శాస్త్రిగారూ!" అన్నాడు రెడ్డి.

"యింకేమయినా పాయింట్లు ఉన్నాయా?" అన్నాడు శాస్త్రి, కృష్ణారావుతో.

పుస్తకం చూస్తూ - "ఎవిడెన్స్ ఫ్రమ్ ది ప్రజెన్స్ ఆఫ్ సెమినల్ ఫ్లూయిడ్, ఎవిడెన్స్ ఫ్రమ్ వెజినల్ డిశ్చార్జి, ఎవిడెన్స్ ఆఫ్ స్ట్రగుల్" అంటూ ఆగి తలెత్తాడు కృష్ణారావు.

"ఎవిడెన్స్ ఆఫ్ స్ట్రగుల్ చాలా ముఖ్యం" అన్నాడు. "మనకి డాక్టర్ హెల్ప్ చేస్తే పని సులువు అవుతుంది."

"చెప్పానుగదా మనం డాక్టరమ్మని కలుద్దాం-" అన్నాడు రెడ్డి.

ఎవరెవరు ఏం చెయ్యాలో నిర్ణయమయాక, కరపత్రం రాయటం మొదలు పెట్టారు. కొంత తర్జనభర్జనలతో కరపత్రం పూర్తయింది. ఆ రాత్రే ప్రింటింగ్‌కి యిస్తానన్నాడు కృష్ణారావు.

అప్పటికి రాత్రి ఎనిమిదవ వస్తోంది.

ఒకరూ, ఒకరూ అందరూ వెళ్ళిపోయారు. మరికొంతసేపు కరపత్రంలో దిద్దుబాట్లు చేసి, పడకగదిలోకి వెళ్ళాడు. వంటగదిలోంచి కుక్కర్ చప్పుడు వినిపిస్తోంది. బట్టలు మార్చుకుని, ఫాన్ వేసుకుని మంచంమీద నడుంవాల్చాడు.

"కాస్త సాయం చెయ్యకూడదూ?" పిలుస్తోంది ప్రభ. కళ్ళు తెరిచాడు. బాల్కనీలో ఉన్నట్లుంది.

ప్రభకి మొక్కలు పెంచటం యిష్టం. ఆమె సేకరించిన కుండీలు బాల్కనీలో ఉన్నాయి. పడకగదిలోనూ, డ్రాయింగ్ రూంలోనూ ఆమె వాటిని ఉంచుతుంది. ప్రతీ మొక్కలో వచ్చే అతి చిన్న మార్పునీ ప్రభ గుర్తు పడుతుంది దాని గురించి చెప్పుతూంటుంది. అవి అంటే ప్రభకి యిష్టమయితే, వాటితో బంధం పెంచుకునే ప్రభ అంటే అతనికి యిష్టం.

అమెను వాటిలో చూస్తుంటే ప్రభ సంతాన రాహిత్యం అతనికి గుర్తు వస్తుంది. చాలామంది డాక్టర్లను చూసారు. ప్రభ గర్భకోశంలోనే లోపం ఉంది. ఆమె గర్భవతి కాలేదు.

పిల్లలు లేనందుకు ఎవరయినా బాధ పడటం సహజం. అయితే ప్రభ దాన్ని వ్యక్తం చేయదు. అది కొంత వింతగానూ, అసహజంగానూ కృష్ణారావుకి అనిపిస్తుంది. ఆమె తననుంచి దూరమవుతోందనిపించినప్పుడల్లా, దానికి కారణం బిడ్డలు లేకపోవటమేనని భావించిన కృష్ణారావు ఆమెను సముదాయించేవాడు. ఆమె దాన్ని ఒప్పుకునేది కాదు. పైగా, కరకుగా మాట్లాడేది. ఆ విషయం ఎత్తడం ఆమెకి అయిష్టంగా కృష్ణారావు భావించలేదు. ప్రభ వేరే ప్రపంచాన్ని నిర్మించుకుంటున్నట్లు అనుకునేవాడు.

తననుంచి దూరం అవటాన్నయినా, కృష్ణారావు అంతో ఇంతో సహించాడుగానీ, తాము యిద్దరూ నమ్మిన ప్రపంచం నుంచి ఆమె దూరమవటాన్ని అతను సహించలేకపోయేవాడు. దాన్ని మొదట్లో చాలా పెద్ద యిష్యూ చేసేవాడు.

'నువ్వు నా కోసం నా భావాలను నమ్మినట్లు నటించావు. నీ స్వార్థం నాకు యిప్పుడిప్పుడు తెలుస్తోంది' అన్న ధోరణిలో వాదించేవాడు.

"నువ్వు మగాడివి. నీ పెత్తనం నామీద సాగాలన్నది నీ లోలోపలి కాంక్ష"- అనికూడా అనేది ప్రభ-

"నేను మగాడినన్న విషయం నాకు యింతవరకూ గుర్తులేదు."

"చెల్లినంతకాలం ఎవరికీ గుర్తు ఉండదు - దాన్ని సహించగలిగినంత కాలమూ నేనూ గుర్తుపట్టలేదు."

"నేను అడిగింది నా స్వార్థం కోసం కాదు- నీ స్వార్థం కొంచెం తగ్గించుకొని పనిచేయమనే నేనంటున్నాను."

"నేనేం చెయ్యాలో నిర్ణయించే అధికారం నీకెవడిచ్చాడు? నువ్వు చేస్తున్నపనికి నేనెప్పుడూ అడ్డు తగల్లేదే- అదెందుకు గుర్తించవూ?"

ఇలాంటి కొట్లాటలు ఒక దశ. అప్పుడు ఆలోచించటానికి తీరిక ఉండేదికాదు. చెన్నారెడ్డి పాలనలో సడలింపు. ఎన్నెన్నో కార్యక్రమాలు ఆశలు- నిరాశలు పని. పని.

దాదాపు మూడేళ్ళు.

ఆ దశలో ప్రభ యీ అపార్ట్‌మెంట్ కొనుక్కుంది. దానిగురించీ పోట్లాటే- కొన్నిసార్లు. తన ప్రపంచంలో రకరకాల జాతీయ, అంతర్జాతీయ పరిణామాలు. అంతవరకూ ఉన్నతంగా పటిష్టంగా కనిపించిన వ్యవస్థలూ, వ్యక్తులలో బీటలు. కమ్యూనిస్టుల చరిత్రలో మొన్న విడిపోయినవాళ్ళకన్న, నిన్నా, యీవేళ విడిపోయిన వాళ్ళే ప్రధాన శత్రువులు - అన్న ధోరణి పునరావృతమవుతూనే ఉంది.

నిరాశలోంచి ప్రభ వేపు చూసాడు. ఆసరా కోసం ప్రయత్నించాడు అనటం కన్న ఆశించాడు అనటమే మరింతగా నప్పుతుంది.

'ప్రభకీ, తనకీ మధ్య ఆగడ్త పూడ్చటం సాధ్యంకాదు' అనుకోసాగాడు కృష్ణారావు. వారి జీవితంలో మార్పులు ఉన్నప్పటికీ కృష్ణారావులో మారనిది మొక్కల మధ్య గడిపే ప్రభపట్ల అనుకంప.

"-ఏం చెయ్యమంటావ్?" లేచి వెళ్ళి అడిగాడు.

"కుండీలు సర్దాలి-" అంది.

ప్రభ చెప్పినట్లు సర్దాడు "కుక్కర్‌ని ఎనిమిదీ పదకొండుకి ఆపాలి. బంగాళదుంపలు తీసి, తొక్కలు వలుస్తూండు వచ్చేస్తా-" అంది.

"ఉల్లికారమా? మసాలాయా?" అడిగాడు.

"ఉల్లికారమే - నేనొస్తాన్లే" అంది.

కృష్ణారావు ఉల్లిపాయలు తరుగుతూ వంటపని చూస్తున్నాడు. ప్రభ వచ్చింది. వంట పూర్తయింది.

భోజనాల బల్లమీద అన్నీ అమర్చాడు కృష్ణారావు. కూర తీసుకుని వచ్చింది. ఫ్రిజ్‌లో సాంబార్ తీసి, వెచ్చజేసుకుని వచ్చింది.

కృష్ణారావు పుస్తకం ఏదో తీసుకుని కూర్చున్నాడు. అయినా చదవటం లేదు. గమనించింది. ప్రభ-

"భోం చేస్తావా?"

"అవును - బయటకు వెళ్లాలి."

"ఎక్కడికి?"

"ప్రెస్‌కి-" అంటూ తయారుచేసిన కరపత్రం యిచ్చాడు.

ఆమె కళ్ళజోడు పెట్టుకుని చదువుతూంటే-

"అవును ప్రభా?"

"ఊ?"

"నీకు స్త్రీల మీద సానుభూతి ఎలాగూ లేదు - నాక్కూడా లేదనటం బాగుందా?"

ఆమె చివ్వున తల ఎత్తి ఒక్క చూపు చూసింది - "అవునవును, నీ నిజాయితీకీ యీ ఎవిడెన్స్ ఉంది" అంది కరపత్రం చూపిస్తూ.

"మరి - సింపతీ లేదనొచ్చా? ఎంత కోపం వచ్చినా?"

ఆ మాటలో ప్రభకి ఏదో అతిశయం వినిపించింది.

"అవును - యిప్పుడూ ఆ మాటే అంటాను - మీకు కూడా ఉన్నది సింపతీ కాదు."

"మరేంటి?"

"మీ కందరికీ ఆ అమ్మాయిపట్ల సింపతీ ఎలాగూ లేదు - సత్యంపట్ల గౌరవమూ లేదు. కోర్టుల పట్ల విశ్వాసమూ లేదు."

"ప్రభా!" అన్నాడు ఉద్రేకంగా.

చేతిలో కాగితాన్ని పక్కన పడేసి టీవీ ఆన్ చేసింది. ఛానల్స్ మారుస్తోంది.

ఆమె ప్రవర్తన అతన్ని మరింత ఉద్రేకపరిచింది. గబగబా వెళ్ళి మెయిన్స్ ఆపాడు. ఇల్లంతా చీకటి అలముకుంది. పడకగదిలో ఎమర్జన్సీ లైట్ వెలిగింది.

"ఏమిటి నీ ఉద్దేశ్యం?" అంది.

"నీ ఉద్దేశ్యం ఏమిటి?"

"నాకు వాదన యిష్టం లేదు."

"నువ్వు నన్ను అవమానించావు."

"నా కలాంటి కోరికేం లేదు - నీకలా అనిపిస్తే - అది నీ కర్మ!"

"మాటలాడుతున్నాం - మధ్యలో లేచి వెళ్ళి టీవీ ఆన్ చెయ్యటం-"

"వాదన ఆపటం."

కృష్ణారావు మాట్లాడలేదు. ఆమె చేతిలో పుస్తకం చూసాడు. ఏదో స్వామి ఉపన్యాసాలు!

దగ్గరగా వెళ్ళి ఆమె తల మీద చెయ్యి వేశాడు. ప్రభది బంగారు వన్నె శరీరం. తీర్చిదిద్దిన మొఖం. నలభైరెండేళ్ళ ఆ స్త్రీలో అందం చెక్కుచెదరలేదు. కొద్దిగా ఒళ్ళు వచ్చింది. అదికూడా ఆమె అందాన్ని పెంచింది. కొంతకాలంగా ఆమె బొట్టుకూడా పెడుతోంది.

కృష్ణారావుకి మొదట్లో ఆ బొట్టు అందానికి సంకేతంలా కనిపించలేదు. అది ఆమెలో మార్పుకి - అంతకన్న పతనానికి గుర్తులా కనిపించింది. దాని గురించి అడిగినప్పుడు ఎన్నడూ లేనిది ఆ రోజు ప్రభ బిగ్గరగా ఏడిచింది.

ఆ క్షణంలో ఆమె బొట్టుకూడా దీనంగా అందంగా కనిపించింది.

"ప్రభా!"

"......"

"నీలో ఏం జరుగుతోంది?"

"......"

"చెప్పు ప్రభా?"

"ఏమీ లేదు."

"ప్లీజ్!"

"ఏమీ లేదంటినిగదా-"

"నా కళ్ళల్లోకి చూసి చెప్పు."

పుస్తకం దూరంగా విసిరేసి - అతని వయిపు చూసింది.

అతని కళ్ళలో అనురాగం, దానివెనుక అగ్ని ఆమె మనసునిండా తీవ్రమయిన అశాంతి.

"కృష్ణా!"

"ప్లీజ్ - చెప్పు ప్రభా!"

"జీవితమంతా మనిషి ఒకేలా ఉండలేడు. యవ్వనంలో తీసిన పరుగులు ఎల్లకాలమూ తియ్యలేడు! లైంగిక స్వేచ్ఛలాంటి విషయాలలో పరుగును మాని, వెనుదిరిగితే - దానికి మనం పెరిగిన వాతావరణం - మనలో మార్పుని తప్పుపట్టనివ్వదు. అదే సామాజిక సంబంధితమైన పరుగయితే - ఆ పరిస్థితి భయంకరం. జారిపోయే వాళ్ళతో నిన్ను పోల్చుకోగలిగితే కనీస ఒక ఆధారం దొరుకుతుంది. కృష్ణా! నీతో జీవించినంతకాలమూ - నేను నిరాధార ప్రయాణం చెయ్యకతప్పదు. నువ్వు నన్ను ద్వేషిస్తేనే నాకు అంతో ఇంతో శాంతి! దయచేసి-యింకేం మాట్లాడకు! లైట్ వెయ్యి - టీవీ చూస్తాను - అది నా మెదడు

పనిచెయ్యకుండా చేస్తుంది - ప్లీజ్!" బోర్లా పడుకుంది ప్రభ. ఆమె ఆ భంగిమ నుంచి బలవంతంగా దృష్టి మరల్చి, కృష్ణారావు మెయిన్స్ ఆన్ చేసాడు. ప్రభ టీవీ ఆన్ చేసింది. వార్తలు వస్తూంటే - "ఉంచు" అన్నాడు.

ఇద్దరూ పొడి పొడి మాటలతో భోంచేస్తున్నారు. జైన్ హవాలా సంగతులు నిర్వికారంగా చెపుతోంది మంజరీ జోషీ. అందులో యిరుక్కున్నవాళ్ళకి సీట్లు యివ్వనంటున్నాట్ట పీవీ.

ఆసక్తిగా వినటానికి ప్రయత్నిస్తున్నాడు కృష్ణారావు.

"భరించలేకుండా ఉన్నాను, కట్టేద్దాం" అంది ప్రభ అసహనంగా.

ఏదో అనబోయి, ఆపేసి "నీ యిష్టం" అన్నాడు.

టీవీ ఆఫ్ చేసింది ప్రభ.

ప్రభ సాంబారులో బెండకాయ ముక్కలు తినదు. అవి కృష్ణారావుకి యిష్టం. తన కంచంలోవి ఏరి- "కావాలా?" అంది. కృష్ణారావు తీసుకున్నాడు.

"ప్రభా! ఆ అమ్మాయిపట్ల మాకు కన్సర్న్ లేదంటావా?"

"లేదు-" అంది. కొంచెం ఆగి,

"ఎందుకలా అనుకుంటున్నావ్?" అన్నాడు.

"ఆ అమ్మాయిని రేప్ చేసినవాడు-ధనవంతుడూ, మంత్రి మనవడూ కనక, వాడికి శిక్ష పడటమే మీ విజయం. జస్ట్ - ఆ అమ్మాయి మీకు యాదృచ్ఛికంగా దొరికిన గుర్రం నాడా - అంతే!"

"అన్యాయంగా మాట్లాడుతున్నావ్!"

"నువ్వేన్ని చెప్పు - యిది పురుషుల ప్రపంచం. యిక్కడ రేప్ చేసేది పురుషుడు. మెడికల్ ప్రూఫ్ ఆఫ్ ఇంటర్‌కోర్స్ ఈజ్ నాట్ లీగల్ ప్రూఫ్ ఆఫ్ రేప్ - అనేది పురుషుడు. రేప్ అంటే ఏంటో - దానిని ఆడది ఎంతవరకూ ప్రతిఘటించిందో - దానినిబట్టి నిర్ణయించమని శిక్షాస్మృతి చేసేది పురుషుడు. దాని ప్రకారం వాదించేది పురుషుడు. దాన్ని నేరమో కాదో తేల్చేది పురుషుడు రేప్ జరిగిన అమ్మాయి తర్వాత జీవితం ఆధారపడేది - పురుషుడి దయాదాక్షిణ్యాలమీద. మీరు చేసిన శిక్షాస్మృతి ప్రకారం ఆరోపించటంకన్న దాన్ని రుజువు చేయటం ఎంతో ఎంతో కష్టం. మీరు ఏర్పరచిన సంఘంలో రేప్ జరిగిందని చెప్పే ఆడది తిరుగుబోతు. ఆమె గౌరవప్రదమయిన కుటుంబంలో పుట్టిన మనిషి కాదు. అలా మీరు నూటికి తొంభై కేసుల్లో వాదిస్తారు. చాలాసార్లు గెలుస్తారు. ఈ మీ ప్రపంచంలో రేప్ కేవలం ఒక రాజకీయం. ప్రెస్‌కి ఒక సెన్సేషన్. విప్లవ రచయితలకి చాలాకాలం వరకూ ఒక విప్లవ కారణం. అభ్యుదయ రాజకీయ వాదులనుకునేవాళ్ళకి కూడా ఆడదాని రేప్- ఒక బంగారు గుడ్లు పెట్టే బాతు-"

"నీ ఆరోపణ అన్యాయం ప్రభా!"

"నాకు నీ మీద ప్రత్యేకించి కోపం లేదు కృష్ణా! ప్రపంచంలో జరిగే రేపుల్లో వ్యక్తిగత కారణాలవల్ల జరిగేవాటికన్న సామూహిక కారణాలవల్ల జరిగేవే చాలా చాలా ఎక్కువ! ఒక జాతి మరోజాతిమీద పగతీర్చుకోవాలంటే రేప్! పాలక యంత్రాంగం పాలితులను టెర్రరైజ్ చెయ్యాలంటే రేప్! సైన్యాలు శత్రుభూముల్లోకి ప్రవేశిస్తే చేసేది రేప్!"

"అవన్నీ నేనూ కాదనటం లేదు ప్రభా కానీ మాకు సింపతీ లేదనటం న్యాయం కాదు."

నవ్వింది ప్రభ. "యింకొంచెం పెరుగు వేసుకో-" అంది.

అన్నాన్ని వేళ్ళతో కెలుకుతున్నాడు కృష్ణారావు. ప్రభ అతనివంకే చూస్తూ ఏదో ఓ నిశ్చయానికి వచ్చినట్టు అంది.

"నిన్ను హర్ట్ చెయ్యాలని నాకిప్పుడు లేదు కృష్ణా! ఇదంతా ఓ పెద్ద చక్రం. ఆలోచించు-ప్రతి చట్టం వెనకా ఒక పక్షపాతం, ఒక వెస్టెడ్ ఇంట్రస్టు కనిపిస్తాయి. సెగ్జువల్ అఫెన్స్‌నే తీసుకో - ప్రపంచంలో ఏ చట్టమయినా చూడు - ఏ తీర్పయినా తీసుకో. దానివెనక స్పష్టంగా కనిపించేది లింగ వివక్ష. పురుష పక్షపాతం. ఆరోపించే ఆడది మగాడి మీద పగతోనే ఆ పని చేస్తుందనీ ఆ పగ నుంచి మగాడిని రక్షించటమే చట్ట కర్తవ్యమనీ అన్నట్టుంటుంది - అసహాయంగా కనిపించే ఆడదాని పట్ల మగాడి జోరావరీకే - సైకాలజికల్‌గానూ, సాంఘికంగానూ - అవకాశాలు ఎక్కువ అనే విషయం ప్రతీ రోజూ, ప్రతీ క్షణమూ రుజువు అవుతున్నాసరే - చట్టం మగాణ్ణి రక్షించటమనే పవిత్ర కర్తవ్యం, ఉద్దేశ్యం మార్చుకోదు. వందమంది ఆడవాళ్ళకి న్యాయం దొరక్కపోయినా ఫరవాలేదు - ఒక్క మగాడికి అన్యాయం జరగకూడదు..."

కొంచెంసేపు ఆగి, ఆలోచనగా అంది ప్రభ- "కనీసం-మీ శిక్షాస్మృతి ప్రకారమయినా ఆడవాళ్ళకు న్యాయం జరగాలంటే, కొంతలో కొంతయినా ఆడదానికి చెప్పుకునే అవకాశం పెరగాలంటే రేప్ ఆరోపణలను కేవలం మహిళా జడ్జీలు వినాలి. మహిళా లాయర్లు వాదించాలి. మహిళా పోలీసులు విచారించాలి మహిళా కోర్టులు మాత్రం తీర్పు చెప్పాలి."

చటుక్కున లేచి కృష్ణారావు "ఈ పాయింట్‌ని కూడా కరపత్రంలో చేరుస్తాను" - అన్నాడు.

"అంతకన్నా నువ్వేం చెయ్యగలవు?, నెమ్మదిగా" నిరాసక్తంగా అంది ప్రభ.

కృష్ణారావు చెయ్యి కడుక్కుని పెన్నూ కాగితం తీసుకున్నాడు.

ప్రభ తనలో తను అనుకుంది. 'నిన్ను నేను భరించలేను కృష్ణా - నువ్వు నా కంటికి గొప్ప వ్యక్తిలాగా, పరమ ఫూల్‌లాగా ఒకేసారి కనిపిస్తున్నావ్- నువ్వు ఫూల్‌వి అనుకుంటేనే నాకు ఊపిరి ఆడుతుంది.'

ఆమె భోజనాల బల్లమీద పని పూర్తి చేస్తుంటే, కృష్ణారావు రాతపని పూర్తి చేసి, బట్టలు మార్చుకుని వచ్చాడు.

"ప్రభా - బయటకు వెళ్ళాలి-"

"నిన్ను నేనేం కట్టెయ్యలేదే-"

"నువ్వూ రాకూడదూ?"

"నేనెందుకూ - యింట్లో ఉంటే సినిమా చూడొచ్చు."

"అవునూ - మనిద్దరం కలిసి -" అంటూ ఆగి - "గుర్తుకు రావటం లేదు" అని గొణుక్కుని "సినిమాకు వెళ్దాం" అన్నాడు.

కళ్ళు పెద్దవిచేసి చూసింది ప్రభ.

"అలా చూడకు - నేనేం చెయ్యగలను? ఇందరు బాధితులి నడుమ ఏ నౌకరుండను సౌఖ్యమొందగా డెందము ఒప్పుకోదు - చిన్నప్పుడు గిలికిన పద్యం - నో ఆర్గ్యుమెంట్స్ - ఏదో ఒక సినిమా - నీ యిష్టం - ప్లీజ్!"

"తప్పదంటావా?"

"తప్పదు!"

తొమ్మిదీ పదిహేనవుతుండగా యిద్దరూ బయటపడ్డారు. కారు బయటకు తీసి, బయలుదేరారు.

చార్మినార్ క్రాస్‌రోడ్స్ దగ్గర - సినిమా హాళ్ళూ, హోటళ్ళూ, దుకాణాలూ, ట్రాఫిక్ నియమాలు అంతగా పాటించని పౌరులూ, వాహనాలూ, డ్యూటీ దిగిపోయేముందు అలసిపోయిన ట్రాఫిక్ పోలీసులూ, - కారుని నెమ్మదిగా ఈదించుతున్నాడు కృష్ణారావు.

"ఏం సినిమాకి వెళ్దాం-" అంది.

వాల్ పోస్టర్ చూస్తూ -"బండిట్ క్వీన్" అన్నాడు.

"అదా? సరే నీ యిష్టం -" అంది.

"అలా వద్దు - నువ్వేది చెపితే అదే-"

"చాలామంది చెపుతున్నారు. పోనీ చూద్దాం-" అంది.

హాలు ముందు అపాడు కృష్ణారావు- 'రష్‌గా ఉన్నట్టుంది - నువ్వు టికెట్లు తీసుకుని వెయిట్ చెయ్యి - పది నిమిషాల్లో వచ్చేస్తాను-' అన్నాడు.

ప్రభ మనసు ఉత్సాహంగా ఉంది. దానిని ఆమె విశ్లేషణకు పెట్టదలుచుకోలేదు. ఒకప్పుడు ఆమె ఆ పని చేసేది. టిక్కెట్లు యివ్వటం మొదలు పెట్టారు. తీసుకుంది.

అప్పటివరకూ ఆమె గమనించలేదు. ఆడవాళ్ళ సంఖ్య చాలా తక్కువగా ఉంది. వచ్చినవాళ్ళు కూడా మగవాళ్ళ వెనక బలహీనంగా నిలబడి వున్నారు.

వాళ్ళను తీసుకొచ్చిన మగాళ్ళు ఏదో వీరోచిత కార్యం చేస్తున్నట్లు, బోరలు విరుచుకున్నట్లు ప్రభకి అనిపించింది.

పూలన్‌దేవి గురించి, సినిమా విడుదలలోని వివాదం గురించి ప్రభ చాలా వింది. సినిమా గురించి ఆమె ఏమీ వినలేదు. పూలన్‌దేవి గురించి ఆమెకు కొంత సానుభూతి ఉన్నా, దాన్ని ఆమె ఎన్నడూ తర్కించుకోలేదు.

ప్రభ మనసు కృష్ణారావు మీదే ఉంది. చిన్న చిన్న పూలతో ఉన్న విమల్ చీర కట్టుకుంది. జనవరి నెల చలికి పమిటని బిగించుకుంది. ఒంటరిగా నించున్న ఆమె చెవిలో ఎవరో ఏదో అంటున్నారు:

"కంపెనీ కావాలా మేడమ్?"

ముందు ప్రభకి అర్థం కాలేదు. అతను తనతో మాట్లాడుతున్నట్లు తోచలేదు. పాతికేళ్ళ వయసు. మంచి బట్టలు, పెదాల మధ్య వదులుగా కదులుతున్న సిగరెట్. అతని చూపులు తననే చుట్టుకొని ఉన్నాయి.

ఆమె శరీరం జుగుప్సతో జలదరించింది. భయమూ, ఆ వెనకే అసహ్యమూ నరనరానా నిండాయి. ఆమెలో పరిణామాలు అతను అర్థం చేసుకోకపోయినా, ఆమె 'షాక్' వల్ల ఏర్పడిన మౌనం, అతన్ని మరింత సమీపించేటట్టు చేసింది.

అసంకల్పితంగా ఆమె అక్కడినించి కదిలింది.

జనాన్ని లోపలకు వదలటంతో, రిజర్వేషన్ ఉన్నప్పటికీ, వాళ్ళు పోలోమని లోపలకు పోతున్నారు.

అప్పటినుంచి ఆమె మగవాళ్ళ గురించి కాన్షస్ అయిపోయింది. ప్రతీవాడూ ఒంటరిగా ఉన్న తననే పట్టి పట్టి చూస్తున్నట్లు, కొందరయితే మీద మీదకి వస్తున్నట్లు ఫీలవసాగింది. నడకలూ, బస్సు ప్రయాణాలూ ఆమెకు కొంతకాలంగా అలవాటు తప్పటంవల్ల, ఆ రకమైన అనుభవాలకు కూడా ఆమె కొంత ఎడం అయింది. ఇద్దరు ముగ్గురు కాస్త సమీపంగా నించుని, సిగరెట్లు పీలుస్తూ, 'నా సొగసు చూడతరమా-' అన్నట్లు విన్యాసాలు చేస్తున్నారు.

ప్రభకి కృష్ణారావు మీద పట్టరాని కోపం వచ్చింది. 'లోకోద్ధరణ అంత అర్జంటా?' అనుకుంది.

కృష్ణారావు రానే వచ్చాడు - "టికెట్లు దొరికాయా?" అన్నాడు.

చేతిలో పెట్టింది.

"లేటయానా?" అన్నాడు హాలు వేపు నడుస్తూ. ప్రభ జవాబివ్వలేదు.

"బాస్టర్డ్స్" అంది ఆవేశాన్ని అణుచుకుంటూ, సీట్లో కూర్చున్నాక.

"ఎవరు?" ఆశ్చర్యంగా అన్నాడు.

"మీ మగ వెధవలు - కుక్కలకన్న కనాకష్టం!"

"ఏం జరిగింది ప్రభా?"

"మాట్లాడకు-"

"సారీ - లేటయాననుకుంటాను."

"ప్లీజ్-డోంటాక్-అయ్ హేట్ - అయ్ హేట్!" అంది.

కృష్ణారావు మూడ్‌కూడా పాడయిపోయింది.

సినిమా పూర్తయింది. ఇద్దరూ ఇల్లు చేరారు. పైకి వచ్చాడు కృష్ణారావు.

ప్రభ మంచం మీద అటు తిరిగి పడుకుంది. లుంగీలోకి మారి, మంచం మీద కొంచెం ఎడంగా పడుకుని లైట్ ఆర్పాడు కృష్ణారావు. అతని మనసంతా ఆ సినిమా ఆక్రమించుకుని ఉంది.

కథలోని సామాజికాంశాలు - పేదరికం, అజ్ఞానం, కులాహంకారం, పోలీసు జులుం, లింగ వివక్ష మొదలైనవన్నీ దర్శకుడు చిత్రమాధ్యమంలో వ్యక్తం చేసిన తీరు కృష్ణారావు మెదడు నిండా నిండి ఉంది. అతనికి అసహనంగా, అశాంతిగా వుంది.

"నిద్రపోయావా?" అంది ప్రభ.

"ఎలా పడుతుంది?"

"ఏం?"

"జీవిత వాస్తవాన్ని ఎంత నగ్నంగా చూపించాడు!"

"అవును - చాలా చాలా నగ్నంగా చూపించాడు."

"అదేంటలా అంటున్నావ్? నీకు నచ్చలేదా?" ఆమెవేపు తిరిగాడు.

"నచ్చటమా? పరమ అసహ్యంగా ఉంది."

"అన్యాయం ప్రభా! మనసు ద్రవించిపోలేదా?"

"ఎందుకు?"

"చెత్త సినిమాల్లో రేప్‌ని రేప్‌చెయ్యి బుద్ధిపుట్టేటట్లు తీస్తారు. యిందులో వెలపరం కలిగేట్టు తీసాడు-"

"అందుకే - హాల్లో ఆ కూతలూ, విజిల్సూనూ-" అంది.

కృష్ణారావుకి మాట తోచలేదు.

"చెత్త సినిమాల్లో ఒకలా ఉంటుందన్నదీ నీ నోషనే! ఇందులో ఇలా ఉందన్నదీ నీ నోషనే! అందులో ఉన్నదీ పెట్టుబడే! యిందులో ఉన్నదీ పెట్టుబడే! ఆ పెట్టుబడికి డబ్బులు వస్తాయి- దీనికి అవార్డులూ. కీర్తీ కిడతాయి. ఈ సినిమాకి కనకవర్షం కురిసినా నేను ఆశ్చర్యపోను" అంది ప్రభ మళ్ళీ.

"ఆ విజిల్స్ లోక్లాసులనించి వచ్చాయి."

"అలాగా! యీ సినిమాకి ఒంటరిగా వచ్చినాననుకుని మీ హైక్లాసు మగ వెధవలు చాలా చాలా సంస్కారం చూపించారు."

"ఏం జరిగిందో - ఎవరయినా ఏమయినా-"

"పెద్ద కబుర్లు చెప్పి పోజులు కొట్టే మీకు మీ సంస్కారం ఉన్నతమైంది. తక్కువ డబ్బులతో తక్కువ క్లాసులకి వెళ్ళేవాళ్ళు లోక్లాసు. వాళ్ళ సంస్కారం హీనమయింది. అందుకే వాళ్ళు విజిల్సు వేసారు. నువ్వెన్ని చెప్పు - రేప్ జరిగితే దొరికినవాడిని నరుకుతారు ఆ విజిల్సు వేసినాళ్ళే! కళా, గాడిదగుడ్డూ, సాంఘిక అసమానతలూ అంటూ ఊదరగొట్టే మీ హైక్లాసుగాళ్ళు రేప్ చేసినవాళ్ళని పట్టుకోమని పోలీసులనూ, శిక్ష విధించమనీ కోర్టులనీ పట్టుకుంటారు. లేదా - జయకాంతన్‌లాగా - తలస్నానం చేసేసి ఇంట్లోకి తగలడమంటారు-"

"నువ్వు చాలా ఆవేశంగా ఉన్నావు. పడుకో-" అన్నాడు.

మరికొంతసేపు గడిచాక-

"నిద్రపోతున్నావా?" అంది ప్రభ, అతని వేపు తిరిగి చేతిని అతని మీద వేసి.

"లేదు - నీకూ నిద్ర పట్టటంలేదా?"

"ఊహు!" అంది.

ఆమె గొంతు అతనికి అర్థమయింది. ఆమె మీద చెయ్యి వేసి - "పడుకుందాం" అన్నాడు.

"ఊహు!" అంది.

రాత్రి రెండున్నరయింది.

కిటికీ దగ్గర నించుని సిగరెట్ పీలుస్తున్నాడు కృష్ణారావు. వెన్నెట్లో నగరం ఆదమరిచి నిద్రపోతోంది. నిద్రలో వత్తిగిలుతున్నట్టూ ఉలికిపడుతున్నట్లూ - ఒకటీ అరా వాహనాల శబ్దాలు.

సిగరెట్ పూర్తయింది.

ఆలోచన పూర్తవలేదు.

మంచంవేపు తిరిగాడు. అస్తవ్యస్తంగా ఉన్న దుస్తులతో మత్తుగా, చంటి బిడ్డలా నిద్రపోతోంది ప్రభ. వెన్నెల కిరణం వచ్చి ఆమె నుదుటి మీద చిరు చెమటకు అంటుకున్న ముంగురులను ముద్దాడుతోంది. పచ్చని పాదం మీది వెండి పట్టీని సవాలు చేస్తోంది-నిద్దట్లో కూడా శరీరాన్ని పూర్తిగా కప్పుకుంటే తప్ప పడుకోని ప్రభ - ఒళ్ళు తెలియకుండా పడుకుంది!

ఆ రాత్రి ఆమె ఉద్రేకం అతనికి అసాధారణంగా అనిపించింది. సెక్సులో ఆమె హిపోక్రాటా? ఆడాళ్ళంతా అంతేనా? అన్న ప్రశ్నతో అప్పటిదాకా అతను రెండు సిగరెట్లు తగలేసాడు.

తనలో ఉద్రేకాలన్నింటినీ - ఆమే కదిల్చింది. అది తప్పే! దానికి బాధ్యత కేవలం ఆమెదే - అన్న ధోరణిలో అతని సిగరెట్లు తగలడ్డాయి.

అంతవరకూ తప్పంతా ఆమెదే అనుకోవటంవల్ల ఆమెపట్ల ఒక విధమైన వ్యతిరిక్తతతో ఉన్నాడు అతను.

ఆమెను దూరం నుంచి చూస్తుంటే, దగ్గరగా చూడాలన్న కోరిక ఆపుకోలేకపోయాడు.

ఆదమరిచి నిద్రపోతున్న ఆమె మొహం ఎంతో అమాయకంగా, నిర్మలంగా కనిపించసాగింది. మూసిన ఆ నయనాలు - ఏవో తీయని స్వప్నాలు లోలోపల కదలాడుతున్నట్లు - అందంగా మృదువుగా చలిస్తున్నాయి.

అతనిలో ఏదో వివశత్వం.

వంగి నుదుటిమీద చుంబించాడు.

ఆ లిప్తలో-

అంతవరకూ ఆమెదే 'తప్పు' అనే భావన పొరబాటు అనిపించింది. తప్పే- అయితే యిద్దరూ బాధ్యులే అనిపించింది. ఆదర్శపరంగా కలగరాని స్పందనలకు శరీరం గురవవచ్చుననిపించింది.

అలా అనిపించడంతో-

ఆదర్శాలూ, ఆచరణలూ మధ్య శరీరానుభవాన్నీ, శారీరకస్పందనలనీ తక్కువచూపు చూడటాన్ని అలవాటు చేసుకున్న ఆ నడివయస్కుడు - సిగ్గుతో- గిజగిజ తన్నుకున్నాడు.

అయితే - అదికూడా శరీరమే సర్దేసింది.

శారీరకావసరమైన నిద్ర - శరీరం శరీరమే, మెదడు మెదడే - అన్న ఆలోచనను మెదడుకు అందించేసింది.

ఆ రాజీతో-

*శరీరం మెదడుని ఆక్రమించుకున్నట్లు, రెండూ ఒకటయిపోయినట్లు ఆ యిద్దరూ ఒకరినొకరు దగ్గరకు తీసుకుని నిద్దట్లోకి జారిపోయారు.*

*('రచన' మాసపత్రిక - ఆగస్టు, 1997)*

# ముడిమనిషి

**ఆ** గుమస్తాగాడేటన్నాడో దెల్సా మాయ్యా!

"అది నా కాడి కొత్తాదీ.... నాను దానికాడ కెల్తానూ... అది నాను సెప్పినట్టల్లా యినుకొంటాదీ.... నాను తొంగోమన్నకాడ తొంగుంటాదీ... కూకోమన్నకాడ కూకుంటాందీ..... నాను దానికి రూపాయలే యిత్తానో.... నగలే దెచ్చి మెళ్ళో దిగేత్తానో... నీకేలే?"

ఓరి యీడి జిమ్మడిపోనూ! పాటుకొచ్చేది గందా ముండేసాలు యెయ్యక సెల్లుద్దా అని గాఁవాల ఆడంత బరిదెగించి పోనాడు! నానొల్లకోలేదు మాయ్యా! గాట్టిగాతీసి రొండు జెల్లలిచ్చేద్దారన్నంత ఉడుకొచ్చేసింది.

"ఓరి బాడుకా! యీ నీళ్ళు నీ అబ్బయ్యీగావు... అబ్బ అబ్బయ్యీగావు...! నీకాడ తొంగుడుండీవోళ్ళకే నీళ్ళిద్దారన్న ఏరుపాటులో వుంటే....నీ యేరుపాటూ నువ్వూ గంగలో బడా! నా నొల్లకుంటాననుకుంటన్నావేమో! ఓయ్! యిది... ఎవత్తో ఎవత్తో అనుకుంటున్నావేమో! నాను నరిసిని! సిమ్మాద్రికిబుట్టిన నరిసిని! నువ్వు పని సూపించాపోతే గడక సస్తాననుకుంటనా వేటి? ఆబ్బోరబ్బోసి! ఏం పాటుగాడు లెగిసినాడల్లా!"

"వల్లకోవే నరిసీ! వల్లకోవే!" అంటా నన్ను జాట్టేసుకుంది మా పిన్నమ్మ.

"ఏటే వల్లకోటం? వున్నదొక్క కుళాయి. వందమంది కూలీలవీఁ, కూళ్ళుదిని, సేతు లెండబెట్టుకుని లైను గాత్తన్నాం! గంట గొడతాడో నేదో 'నెగే! నెగే! అంటూ యెంటదవుల్తాడీడే? 'సూసో సూడకో వల్లకోబాబా' అంటే సెవినెడతాడా? యీడి అబ్బగోరి సొమ్మేదో..... మనం దారిగాసి కొట్టుకెల్తన్నట్టు.... గయ్యీ గయ్యీ లాడిపోతాడు....! యెనకో సుట్టు ఒక్క సెణం లేటయినాదని కలగర్లోళ్ళ అమ్మిని సెయ్యట్టుకు మరీ నాక్కుపోనాడీ బాడుకా! 'నాలుక్కుళాయి లెట్టించూ..... నిన్ను మావఁనక్కర్నేదూ.... నువ్వు మమ్మల్ననక్కర్నేదూ,.... 'అంటే అదంతా పెద్దోళ్ళ యవ్వారమంటాడు! యియ్యాల్టికి లైన్లోవున్న మనవందరవూఁ యీ ఏడు జిల్లాలా సోగ్గాణ్ణిసూసి, వళ్ళు మర్సిపోయి కాలెత్తనేదంట! ఆదెవుత్తో...

ఎత్తిందంట! అందుకంట... ముందలగుంటా అదే నీళ్లు వట్టుకోవాలంట! మీకులాంటి యెర్రిముండలుండబట్టేగందే.... యీడిలా మీదమీదకొస్తున్నాడూ...."

అంటా మా పిన్నమ్మను దవులుకున్నాను.

ఆడీమద్దిలో సల్లగా దూటేసాడు మాయ్యా!

"నువ్వు సేసిందేటే 'గొంతుకెట్టుకు పడిపోద్దీ.... పెంకిముండా' అనిపించు కుంటున్నావ్! ఆడికంట్లో బడిపోతన్నావు! యియ్యాల ఆడిది తప్పయ్యింది... వల్లకొన్నాడు! రేపు... నీక్కాలు నొస్తాది! సెయ్యి నొస్తాది! ఓ సెణం నడుం జారేస్తావు! ఆడు ఒగ్గుతాడా? నీ సెయ్యి ఆరిపోనాదేగాని నీటికాడ కెల్లగల్గావంటే?" .... మావోళ్లు తిట్లు!

"నా జబ్బలో సత్తువుందల్లో! నా పన్నాను సెయ్యగల్లును. ఆడు ఎప్పుడో నానోసెణం పంజెయ్యాపోతే వొగ్గుతాడోనేదో కూడా తెలందానికి - వొగ్గుతాడని బెమ - యెట్టుకుని - యియ్యాల ఆడో మారాజునాగా మనవేఁమో దాసీ ముండల్నాగా యేలుబడి సేత్తంటే - ముసలిముండలు గనక మీరొల్లకుంటే వొల్లకోండి! నాను... నానొల్లకొనంటే వల్లకోను! ఆ!"

ఆ మాటకి యింతంత పాడుగు పొరుసాలొచ్చినాయి మాయ్యా! ఆళ్ళకి!

నాల్రోజులకోనుట్టూ.....వారానికోనుట్టూ....మా మద్దిన సిన్నదీ పెద్దదీ యిలాగంటి గొడవే లెగుస్తానే వుంది!

ముగ్గురో నలుగురో పిల్లతల్లులున్నారు మనోళ్ళలో! పెద్ద పెద్దోళ్ళ పెల్లాలూ....కూతుర్లూ అవుతే తొమ్మిదేసి నెల్లూ.... ఏణ్ణర్దాలూ..... ఎక్కిన మంచం దిగకుండా....సంటిపిల్లకి నీళ్ళపోతలో సెయ్యయినా జాడించకుండా.... జరిపించు కుంటారు. ఆళ్ళకి జరుగుద్ది! మా కెలాగవుద్ది? మా మొగులాళ్ళు నీళ్ళాడిన ముండ ఎప్పుడొస్తాదా.... ఎప్పుడు పన్లోకెల్తాదా అని సూడక.... జాలి పడగల్లురా? జాలున్నా.... సెల్లుద్దా? ఆ పాపల్ని సెట్టుకొమ్మలికి వుయ్యాలేసి అందులో తొంగడోబెట్టి పనిజేసుకుంటారు.

ఆ పెద్దాయన దరమ్మంతుడై వప్పుకున్నాడో - తప్పుకొచ్చే వల్లకొన్నాడో - ఆ బగమంతుడికే దెలాల! మద్ది మద్దినో సుట్టు సాటుకుబోయి పిల్లను జూసుకొత్తారు!

నాకేటి దెల్సు యీ దొంగ నచ్చినోడు అందంటే సస్తాడని! మంతా నన్నానమ్మలేదూ! దాని కోడలు దాని పేరేటబ్బా!..... సుబ్బి "సుబ్బమ్మ" ఏడుస్తుంది.

ముసలి ముండలు దానినోరు నొక్కేస్తున్నారు.

"కాపడకుండా కొంగు కప్పుగోవాల గాని.... ఆడు సూడ్డానికే వచ్చాడనేల దలవడం?" అంటున్నారు.

"ఏటేలప్పా! ఏటే! ఏటయిందే...." అంటానే ఉంన్నాను. సుబ్బి 'బారు' మంది.

ఒవుళ్ళూ మాటాడరు. ముసల్నంజలు 'యేటీనేదు, యేటీ నేదు'' అంటన్నారు.

యెనకనుంచెవత్తో పత్తిత్తుముండ గొణుగుతోంది.

"రాణీవోసం యేపారాలయితే పనికెందుకంటా రావటం? మగాడన్నావోడు కంటబడగూడదంటే అవుద్దా?"

"యేటయిందో సెప్పరేటల్లా" అన్నాన్నేను మల్లా.

మా పిన్నమ్మంది....

"యేరే యేటుందవటాంకి? వొకుడికింద సాకిరీకి వొప్పుకున్నప్పుడే మన మానం మంటగల్సిపోనాది. అసావాటి ముండావాడి కదేంజబ్బో.... పాలిచ్చుకునే వాళ్ళింటే సత్తా ఉంటాడు! యేటిదని యెవురయినా అడిగితే పాలిత్తన్నారో.... పడుకొంటున్నారో.....సూద్దారని వచ్చానంటాడు!...."

యింకా వాగుతూనే వుందా ముండ!

"సిగ్గు నేదంటే....?-

-సాకిరీకీ నవుకరికీ వప్పుకుంటేనే మానం బోడమంటన్నావు ముసిల్దానా! అంతోటిదానికి - పొద్దింకా పొడకుండా నెగిసి అంతదూరం నుంచి యింతదూరం నడిసొచ్చి - వళ్ళు ఉలపరం దగిలేలా పాటడతా యిందంట సవ్వటం దేనికే? సానిపాపల్లా పగలల్లా తొంగుడోని... సందేలకి గుమ్ము గుమ్ముగా రంగేసుకు రోడ్డుపక్క లైను గట్టీగూడదా? యీ డిచ్చేపాటి అందులో కిట్టుబాటవదా? అడిజబ్బేటో..... ఆ యెవ్వారం యేటో.....తేల్సిపారేద్దాం! రండి! రండల్లా అంటూ మమ్మల్నందరినీ నెగదీసి యెంటేసుకు బయలెల్లడం బోయి....వల్లకో! వల్లకో! .... అంటన్నావా?"

కొందరు దిగలాగా, కొందరు ఎగలాగా! తొక్కుళ్ళాడుకు సచ్చారు. కడవాఁన యెల్దారంటే యెల్దారి పదండల్లా అని బయలెల్లాం!

పెద్దాయన గదిగుమ్మంకాడ జమాను అప్పారావని మనోడే మాయ్యా! "ఏటయిందేటప్పా?" అంటా ఎదురొచ్చాడు.

మా కాణ్ణించంతా యినుకొన్నాడు. "పెద్దాయనకి సెప్తా! నిదానించు అప్పా'' అన్నాడు! లోనకెల్లాడు! మావందరం సెట్టుకింద కూకుడున్నాం!

సుబ్బి జరిగిందంతా సెప్పుకొచ్చింది.

అది పాలిస్తందంట! అదెటుతిరిగితే అటే యెల్లీవోడంట! యెదవ నచ్చినోడికి తల్లులూ సెల్లెళ్ళూ లేరో! యేటో!! సన్నసన్నంగా దగ్గరంటా వచ్చినాడంట! 'పిల్లోడు సానా బావున్నా' డన్నాడంట! 'ఆడి బాబు యేటి

సేత్తన్నా'డని వోకబు సేసినాడంట! అదొట్టి బెంబేలుమడిసి! తప్పుసేత్తావుంటే దొరికిపోయినట్టు అల్లాగుల్లం అయిపోయినాదంట! 'పర్నేదూ....బయపడమాక, నాగదిలోకొచ్చీ! ఆడే పాలిచ్చుకో! యీ పూటకి పన్లోకెల్లోద్దులే!' అన్నాడంట!.... అంటానే-యెల్లిపోతున్నట్టు యెల్లి-దానొంక తిరిగి "మాపటికి రాగూడదా! వారం రోజుల్దాకా కూలికి రానవుసరం లేదు....' అన్నాట్ట! అనీసి గబగబా యెల్లిపోనాడంట!

నాకులాంటి గుంటలు నలుగురయిదుగురు తగులుకోవటం వల్ల యిందాకా వొచ్చిందిగాని, నేకపోతే..... యేళ్ళతరబడీ పంజేస్తున్న ముసిల్నంజలు.... యేడిసేదాన్ని 'చుచ్చుచ్చూ' అంటా ఆళ్ళూ యేడిసి నోరునొక్కేద్దురు.

మావిలా వూసులేసుకొంటానే వున్నాం!

బయట కెల్లినాడు గావాఁల! లారీలోంచి దిగడ్డాడు: మావందరం ఆపీసు ముందర కాయటం సూసాడు గావాఁల! యిలా కాపడి అలా జారిపోనాడు! మా కాడికొత్తే మరియాదా మాట దేవుడెరుగు.....సున్నంలో కెవిఁక లేకుండా జేసేత్తా రనుకొన్నాడో యేటో!!

యెందంటో దాగుడుండి పోనాడని మాలోమేం నవ్వుకుంటూనే వున్నాం.... "పెద్దాయన! పెద్దాయన!" అంటా గోలగోల!

ఆయనొచ్చాడు!

వస్తానే 'సెమించాల' అన్నాడు మాయ్యా!

జరిగిందానికి సానాసానా బాదపడతన్నానన్నాడు. తొలీత తప్పు-కిందోడు సేసినా - అలాగంటోణ్ణి యెట్టుకోటం తప్పు మీదోడిదే అన్నాడు! అందుకు తన్ను సెమించాల అన్నాడు!

'అయ్యబాబయ్య బాబు! తవుఁరేటీ సెమించమండవేటీ!' అంటా మావోళ్ళు ఏడిసీసారు మాయ్యా!

'ఆడిపని నాను జూసుకుంటా! మరేటనకండాణ్ణే' అన్నాడు కడవాఁన! అందరవూఁ పన్లో సద్దుకొన్నాం!

ఆడూ పనోడే.... మావూఁ పనోళ్ళవే....ఆడితొప్పిందుగ్గాసినాడూ? ఒకుటే ఆలోసన ఆలోసనైపోనాది మాయ్యా ఆ యేలంతా! నా బుఱ్ఱకేం దోసనేదు.

ఆణ్ణి లోనకిబిలిసి సెప్పుచ్చుకు కొట్టాడంటని కొందరు! జీతం కోసేసినాడని కొందరు! 'మల్లీ యెదవసాలేత్తే.... పన్లోంచి దీసాత్తాన'న్నాడని కొందరూ...! రకరకాల కబుర్లు బయలెల్లాయి! ఏదేటయినా ఆడో వారం దినాలు మా కంటపడనేదు.

బట్వాడారోజున వొంచిన తలెత్తనేదు! 'జడిసిపోనాళ్ళాగుంద'ని.... గుస గుసలాడతా నవ్వుకుంటన్నాం! పిడుగులా అన్నాడాకర్న! పంజెయ్యలేక పోతున్నారంట! పదిమంది మునలమ్మల పేర్లుసదివి, రేపట్నుంచి పన్లోకి రానవుసరం లేదన్నాడు! లోనకెల్లిపోయాడు!

ఆళ్ళొకటే గోల!

పెద్దపెద్దోళ్ళ అమ్మలూ అమ్మమ్మలూ బంగారం మురుగులూ, గొలుసులూ యేసుకొని, తెల్లతెల్లని సీరలు గట్టుకొని, సల్లసల్లని గదుల్లోనూ, కారుల్లోనూ తిరగతా వుంటంటే.... యీ ముసిలమ్మలు యియ్యాలో రేపో అంటావుండిగూడా పనుల్లోకొత్తారు! కర్రోకంపో పోగెట్టుకుని మోపుగట్టుకొని పనయ్యాక యింటికి వట్టుకెల్తారు! గంజికాసుకు తాగుతారు. సీజనయిపోయాక ఎవుడు పనిత్తాడా దేవుడా అంటా సూత్తంటారు...! అలాటోల్లని ఆళ్ళు ఏంజెయ్యలేని మాట నిజమే అయినా..... ఆ తాగీ కసిన్ని గంజినీళ్ళూ తాగకుండా సెయ్యడానిగ్గాపోతే, తీసెయ్యటం ఎందుకంటా?

'నీ గీరువోణవేఁ యింత పంజేసిందం'టా నామీద యిరుసుకు పడిపోయారు మాయ్యా!

"అయ్యేల పెద్దముండవి పెద్దముండవంటూ మమ్మల్నెగసందోసి....అన్నోటీ మాసేత మాటాడించి, ఓమూల గూకుడోని సల్లగా వల్లకొన్న నాపసానీ! యియ్యేల ఆళ్ళు మా కూట్లో బుగ్గిబోస్తే యేటి సేసినావే?" అంటా చుట్టేసారు.

నాకూ పేణం సాలొచ్చిందాళ్ళను సూసి.

"మీరుండండల్లా! నే సెప్తాను" అంటా ఆ వుడుకుమీద వుడుకుమీదే యెల్లి ఆడిమీద పడిపోనాను.

'సేసింది నేను. సెందింది నేను. దెబ్బకొడితే నన్ను కొట్టు! ఆళ్ళ నోడికాడ కూడు పాడుసెయ్యక! పిల్లా పాపా సేర్సుకోవాల్సినోడివి! పయికి రావాల్సినోడివి! ముందు ముందు సానా బతుకు బతకాల్సినోడివి! నీకు నాయంకాదు...." సానాలెక్కల సెప్పుకొచ్చాను మాయ్యా!

నన్ను వాగనిచ్చినాడు! అంతా యిన్నాడు!

"అందర్లాగే నువ్వూ నన్నే అంటావంటే నరిసీ! డబ్బులు ఆయనగోరియ్యా! పనిజేయించుకొనిదాయనా! పంజెయ్యలేనోళ్ళని లెక్కలుగట్టి తీసేసీదాయనా! మీకు రోజువారీ కూలిత్తే .... నాకు నెలకోసుట్టు యిత్తన్నాడు! ఆ బాగ్గేనికి.....నేనే ఏదో సేసీనట్టు - నిందబడ్డం నానా?" అన్నాడు.

సదూకొన్నావోళ్ళూ, సానా సానా రాజేలు తిరిగినోళ్ళూ ఆళ్ళు దీసిన్లెక్కలు నాను తియ్యగల్దునా? ఆరు కోసినంత మెత్తగా గొంతులు నాను కొయ్యగల్దునా? ఆరు ఆడిన మాటలకి నాను జవాబు చెప్పగల్దునా?

"ఆయ్యేల... ఆ గొడవను బట్టేగందా యింత పంజేసినావు?" అన్నాను కడుపుమండి...

"యెయ్యేలా? యే గొడవా?" అన్నాడు. ఆడి నిబ్బరం దిబ్బలో యెట్టా!

"సిగ్గుమాలినాడా! బాడుకా నాయాలా!" అంటా లేచిపోయాను.

'ఏటాగొడవ!' అంటా పెద్దాయనొచ్చినాడు.

నాను సెప్పేదేటో .....యినకుండానే..... ఆణ్ణి లోనకు లాక్కుపోయాడు.

కాళ్ళు పీకులు యెట్టీదాకా సూసాను! ఆడు రాడు! పెద్దోళ్ళ గది! కూకోడం ఎలాగవుద్ది? అప్పారావు "వొత్తాడు వొత్తాడు" అంటున్నాడు.

కడవాఁన ఆడొచ్చినాడు.

'యిక్కడే వున్నావంటే?' అన్నాడు. "నువ్వుగూడా పన్లోకి రామాక!" అన్నాడు.

"అదేటన్నాను"

"ఎవురెవురి గొడవలో పట్టుకొచ్చి కొట్టడాంకి లెగిసీ మడుసుల్తో పనులవ్వని సెప్పి పంపెయ్యమన్నాడు పెద్దాయన" అన్నాడు.

"సూద్దారి! సూద్దారి! అర్నే పిలువ్!"

లోన కూకుడోని తమాసకం సూత్తున్నాడు గావాఁల! పయికొచ్చినాడు నా అరుపులికి! నవ్వుతానే అన్నాడు-

"నీ యేపారం నువ్వు సూసుకోపోతే యిదిగిలాగే అవుద్ది!"

నానిప్పుడు సేసిన తప్పేటన్నాను. నన్ను పన్లోంచిదియ్యడవేలన్నాను? "బాబయ్యా! తప్పుసేసిందాడు! మాం కట్టుగావుండి మీతో సెప్పుకొన్నాం! మా గూర్చి అయ్యా యియ్యా సెప్పిందాడు! ఆణ్ణి కడుపులో యెట్టుకుంటున్నావు! పంజేసీ-పాటడీ - మమ్మల్నెల్లమంటున్నావ్! యిది నీకు నాయంగాదు! పెద్దరికంగాదు దరమంగాదు...." అన్నాను. ఆకాడికి మాలోనే తప్పుంటే ఆణ్ణి ఓ సుట్టు గాసినట్లు మమ్మల్నీ గాయమన్నాను.

ఆడు గాస్తాడా! నాయెర్రిగాని...!

"మా వోళ్ళ నెవర్నీ పన్లోకి రానీకుండా జేసేత్తా" నన్నాను.

'నీ యిట్టం' అన్నాడు.

అపళంగా వచ్చీసాను మాయ్యా! ఏటయ్యిందేటయ్యిందన్నారు మనోళ్ళంతా! సెప్పాను. యేడిమీదున్నారంతా! రేపణ్ణించి పనెలాగవుద్దో సూద్దారన్నారు!

తెల్లారింది. నాను దప్ప అందరూ కారేజీలట్టుకు పనిలోకెల్లిపోతున్నారు ముసిలమ్మల్తోసహా!

తెల్లబోయి నించుండిపోయాను.

వోకబు సెయ్యగా సెయ్యగా తేలిందేటంటే ఆడు ఆ రాత్రంట గూడేలంట తిరిగినాడంట! యిదీ అదీ సేయిత్తా నన్నాడంట! యెవ్వారం యిటుదటు సేసీసాడు!

అప్పుణ్ణాకు అరదవఁయిపోయిందేటంటే....

పెద్దోళ్ళకి మాలాటోళ్ళని యిడదీసి పనులు జరిపించుకునీ అవసరాలు యీళ్ళు దీరుస్తారు! యీళ్ళు జేసే యెదవ పనులన్నిట్నీ కడుపులో యెట్టుకుని - ఆళ్ళకి వట్టం రాకుండా ఉండేదాకా - ఆళ్ళు సూసుకుంటారు.

అవుతే....

ఆళ్ళు అలాగ యెన్నోటి నాటకాలాడినా....ఆడించినా... పంజేసే మావంతా ఒకుటేననీ....ఒకుడికొచ్చే కట్టం అందరదీననీ.... సాలీసాలక దొరికే తిండికోసరం - ఆళ్ళ మాయల్లో బడి - మాలో మేం తన్నుకు సవ్వటం మంచిదికాదనీ.... ఉండగా ఉండగా అరదంగాకుండాపోద్దా మనోళ్ళకి....?

ఆయేళ యీళ్ళూ ఆళ్ళూ మిగుల్తారా?

మాం మిగల్నిస్తావా!?!

*('అరుణతార', మే-జూలై, 1978)*

# గుర్రపుకళ్లెం

అతను గుర్రాజు. అతనికి మీసాలున్నాయి. ఒకప్పుడు ఆ మీసాలు నిమ్మకాయలను నిలబెట్టేవట. ఆ ఒకప్పుడు....... గుర్రాజు కుర్రాడు. చుట్టు చెంగావి పంచె కట్టేవాడు. పేడకాసు రంగు సిల్కుచొక్కా వేసేవాడు. జరీ అంచు కండువా భుజంమీద ఉండేది. ఆరడుగుల మీద పొడవు. పొడవుకుతగ్గ లావు. చూసేవాళ్ళను గుమ్మెక్కిస్తూవుండేవాడట. 'కల్లావోరి అమ్మి ఆ పెరటి గుమ్మం పట్టుకుని వదిలేదేకాదుట!' 'కల్లావోరంటే సిన్నకులపోళ్ళేంగాదు'

ఈనాడూ అతను గుర్రాజే. పొడవు ఆరడుగులే. ఉన్నవి ఆ మీసాలే. అప్పటికీ, యిప్పటికీ ఉన్నది ఆ గుర్రపు కళ్ళెమే.

గుర్రపు కళ్ళానికీ, గుర్రాజుకీవున్న సంబంధం ఏమిటి? ఆ ప్రశ్నకు జవాబు వెతకాలంటే అతని చిన్నతనంలోకి పోకతప్పదు. కొత్తగా కొన్న మైసూరు గిత్తలకు దాణా సరిగ్గా వేస్తున్నారో లేదో ఆరా తీస్తున్నాడు తండ్రి. మరిడియ్య వీపు మీద ఎక్కి ఆడుతున్నాడు 'సిన్నబాబుగోరు' గుర్రాజు.

"మన గొప్పతనం చాలా గొప్పది. మనని జనం దివాణాలు అనే పిలుస్తారు. మనం ఎక్కాల్సింది గుర్రాలని. మనం తియ్యాల్సింది ఆడాళ్ళని. మనం మెలెయ్యాల్సింది మీసాలని. అప్పుడే మన కులం పేరూ యింటిపేరూ నిలుస్తుంది" - యిదీ గుర్రాజు తండ్రి చేసిన బోధన.

బాల గుర్రాజు కుర్ర గుర్రాజు అయ్యాడు. తండ్రి పోయేరోజుల్లో కూడా - 'బాబా! నీ ముత్తాతదివాణంలో సంపాయించిన గవురవం ఆ గుర్రం కళ్ళెంలో వుంది. నీ తాతా నేనూ దానికి తగిన గుర్రం కొనలేకపోయాం! నువ్వయినా ఆ పని చెయ్యాలి!' అనేవాడు. చివరి చూపులో కూడా అతను "పెద్దోడివి! పేరు నిలపాల్సినోడివి! మనం దివాణాలం! గుర్రాలు! ఆడాళ్ళు! మీసాలు!" అంటున్నట్టుండేది గుర్రాజుకి.

గుర్రాజు పేరు నిలబెట్టడానికి చెయ్యగలిగినదంతా చేసాడు. గుర్రాన్ని కొన్నాడు. అళ్ళను తీసాడు. మీసాల్ని మెలేసాడు. తండ్రి మాటలను గుర్తు

చేసుకొంటూ తిరిగాడు. అతనోమారు గుర్రం ఎక్కి సింహాద్రిపురం వెళ్తే ఆ వూరి షావుకారు అన్నాట్ట - "పెద్దకాపుగోరూ! మంచి గుర్రాన్ని కొన్నారే!" మీసంమెలేస్తూ అతనందించిన లెక్క జేబులో దోపుకొంటుంటే అన్నాట్ట- "అయితేనేం లెండి! తమరి గుర్రాలు ఆకలంటాయి! అలసిపోతాయి! ముసిలవుతాయి! మూల బడతాయి! మా గుర్రాలకి అలాంటి బాధలేం వుండవు......." అర్థంకాని గుర్రాజు గుంభనంగా నవ్వేసి గుర్రం ఎక్కి వెళ్ళిపోయాక పక్కనున్న పాపయ్యశాస్త్రి అర్థంకాని మరో ఆసామీకి అందించాట్ట - "ఏటుందండి! షావుకార్ల గుర్రాలు చక్రవడ్డీలండి!"

అతనికి ఓ తమ్ముడున్నాడు. అన్నగారి పెత్తనం మీదా వ్యవహారతనం మీదా అతనికి అనుమానాలేం వుండేవికావు. కట్నానికి లోబడి అతనికి 'చెడి బతికినోళ్ళ' పిల్లని కట్టారు. గుర్రాజుకి ఆ సంబంధం అంతగా నచ్చలేదు. తమ్ముడి క్షేమంగూర్చి నచ్చజెప్పుకొని ఒప్పుకున్నాడు. వచ్చినామె జాగ్రత్తమంతురాలు. వస్తూనే ఆ కుటుంబంలోని లోతుపాతులన్నీ పట్టేసింది-మా కుటుంబం అంతదీ యింతదీ అంటూ చెప్పే గొప్పలనీ, తనని చూసే చిన్నచూపునీ ఆమె భరించలేకపోయింది భర్త లొంగివచ్చేదాకా నోరు మెదపలేదు. నోరు మెదిపాక ఊరుకోలేదు. వేరు పెట్టించింది. కొన్నాళ్ళు కుండలు వేరయాయి. ఆ తర్వాత వ్యవసాయాలు వేరయాయి.

తమ్ముడితో విడిపోయాక గుర్రాజు పుచ్చులు ఒకటి ఒకటీ పయికి వచ్చాయి. అతని భార్య నాలుగు బళ్ళతో సారె తెచ్చుకుందిట. ఆమెకి కూడా భర్తచేసే ఖర్చూ అతని పద్ధతీ అంతగా నచ్చేవికావు. అయితే ఆమె కన్నవారిది కూడా అలాంటి కుటుంబమే. వాళ్ళుకూడా ఆడవాళ్ళను ఆర్థిక విషయాలలో సంప్రదించేవారుకారు. ఆమె తెలివితేటలుకూడా అంతతమాత్రం. దానాదీనా ఆమె భర్తను సరైన మార్గంలో పెట్టలేకపోయింది. భర్త ఒక్కో ఆడదాన్ని తీసినపుడు మాత్రం ఆమె గొంతుక్కి అడ్డూ ఆపూ ఉండేదికాదు. కొన్నాళ్ళు ఆ గొంతు గుర్రాజు పరోక్షంలోనే ఉండేది. తర్వాతర్వాత అది ప్రత్యక్షంగానే సాగేది. గుర్రాజు నోరు ఎత్తేవాడుకాదు. తన పద్ధతి మార్చుకునేవాడూకాదు.

చక్రవడ్డీల చక్రబంధంలో గుర్రాజు కీర్తిపతాక ఎగరటానికి అతని ఆస్తి చిక్కుకుంది. అప్పులన్నీ తీర్చేసి మిగిలిన రెండు ఎకరాల భూమితోటీ ఊరిమీదపడి తిరుగుతున్న అయిదు గుర్రాల (పిల్లల్తో కలిసి) తోటీ, గుర్రాల్లా ఎదిగి పెళ్ళికోసం చూస్తున్న యిద్దరూ, ఎదుగుతున్న ఇద్దరు ఆడపిల్లలూ, ఒకే ఒక కొడుకుతోటీ.... ఊరికి అటొకటీ యిటొకటీ యిద్దరు ఆడవాళ్ళతో,... వాళ్ళ పిల్లల్తో మిగిలాడు గుర్రాజు.

ఆ యిద్దరిలో ఒకామె నల్లగా వుంటుంది. సన్నగా ఉంటుంది. కాల్చిన తాటిమట్టలా వుంటుంది. గుర్రాజు బాగా వెలుగుతున్న చివరిరోజుల్లో ఆమె

ప్రవేశించింది. ఆమె అరుపులు పెళ్ళాం అరుపుల నుంచి గుర్రాజుని రక్షించేవి రెండురోజులకు ఓమారు ఆమె ఊరునీ వాడనీ ఏకం చేస్తుంటుంది - "నాకు ఏటి ఎట్టాడని ఆడిని పట్టుకుని ఏడాల? యిశవాసం గలదాన్ని గనక యిడిసిపెట్టలేక పోతున్నాను'' అంటుంటుంది. నిజానికి ఆమె గుర్రాజు ఎండిపోకముందే రావటంవల్ల, పీల్చదలుచుకున్నది పీల్చలేకపోయినా పీల్చగలిగినది బాగానే పీల్చింది. ఆ తర్వాత గుర్రాజు ఎండిపోయినా ఆమె కూడా ఎండిపోవటంవల్ల - "ఇంక తీసేవాడెవడూ లేకపోవడం వల్లో ఏమో!" అతనితో ఉండిపోయింది. ఆమె ఊరికి దక్షిణాన ఉంటోంది. ఆమెకో చిన్న పెంకుటిల్లు కూడా ఉంది.

ఉత్తరాన ఉన్న ఆమె గుర్రాజు తీసిన ఆఖరు స్త్రీ. ఒళ్ళుగా ఉంటుంది. ఆమెకు ఓ కాలు బోదకాలు. ఉత్తరాన శ్మశానం ఉంటుందంటారు గుర్రాజుకి మాత్రం మిగిలిన శాంతి అవైపే వుంది. శనివారం తెల్లారగట్లే లేచి కాలవకు పోయి స్నానం చేసి పచ్చగా పసుపురాసుకుని పెద్దబొట్టు పెట్టుకుంటూంది పార్వతి. గుర్రాజు ఆమెకు యిచ్చినది చెప్పుకోదగిందేంలేదు. ఆమె ఉంటున్న తాటాకుఇల్లు కూడా ఆమె కష్టపడి కట్టుకున్నదే. ఆ జాగా మాత్రం గుర్రాజు ఇచ్చాడు. అరుపులతోటీ నమ్మకద్రోహంతోనూ నిండిన గుర్రాజు ప్రపంచంలో ఆమె మెత్తనయిన స్వభావం ఓ శాంతి. ఆమె యింటికి మంచినీటి చెరువు దూరం. స్థూలకాయం కావటంవల్ల ఆమె నీళ్ళు తెచ్చుకోటానికి ఆయాసపడేది. కావిడ వేసుకుని గుర్రాజు నీళ్ళు తెచ్చేవాడు. ఆమెకో కుర్రాడు ఉన్నాడు అరేళ్ళ ఆ కుర్రాడంటే గుర్రాజుకి ఎనలేని వాత్సల్యం. సాయంకాలమయేసరికి యింటినీ, యింటి ముందు వాకిలినీ, తుడిచి నులక మంచం వాల్చి ఉంచుతుంది. ఆరేసిన బట్టలు కట్టుకొంటుంది. ఆ కమ్మరింటి రాటను ఆనుకొని కూర్చుంటుంది. అతను వచ్చి వాకిట్లో మంచంమీద కూర్చుంటాడు. చుట్టకాలుస్తూ అపుడూ అపుడూ ఏదో చెపుతుంటాడు. ఒక్కోమారు ఏం మాట్లాడకుండానే గడిచిపోతుంది. కుర్రాడు ఆడుకువచ్చి అతని గుండెలమీద పడుకుని నిద్రలోకి జారుకుంటాడు. ఏ రాత్రివేళో అతను లేచి యింటికి వెళ్లిపోతాడు. అప్పుడు ఆమె లేచివచ్చి ఆ మంచం లోపలికి తీసుకుపోతుంది. దైహిక సంబంధం నామమాత్రంగానే వుండే ఆ యిద్దరికీ ఆ పద్ధతికి భంగం వచ్చిన రోజు ఏదో వెలితిగా వుంటుంది. ఆ కుర్రాడిని స్వయంగా స్నానం చేయించేవాడు. వాడికోసం పులుసూ పచ్చడీ సంపాదించేవాడు.

గుర్రాజు ఆర్థికత మీద చివరి దెబ్బలు కొట్టిన ఖ్యాతి బ్రాకెట్ ఆటకి దక్కింది.

ఆ రోజు - పార్వతి కొడుక్కి రాత్రికి రాత్రి జ్వరం వచ్చేసింది. పగలు పదకొండు గంటలకి గుర్రాజుకి కబురు అందింది. పరుగుపరుగున వెళ్ళాడు. మూసినకన్ను తెరవటంలేదు కుర్రాడు. ఊళ్ళో వైద్యుడు లేడు. కయితం

తీసుకెళ్ళాలి బండి కావాలి. తమ్ముడి దగ్గరకు పరుగెత్తాడు. అతను కాదనలేదు. పెట్టె బండిలో గడ్డి వేసి సర్దాడు. ఎడ్లు పూన్చుతున్నాడు. మొగుడిని వెంటబెట్టుకు వచ్చింది మరదలు.

"-అడ్డమయినవోళ్ళకీ బండి ఇవ్వటానికి నా నొప్పుకోను" అంటూ మొగుడిని ఓ దులుపు దులిపేసింది. తెల్లబోయి తమ్ముడి మొహంలోకి చూశాడు.

"ఏరా! తోలుకెళ్ళమంటావా?"

"నీకయినా వదినా పిల్లలకయినా అయితే అది ఏటీ అనదన్నయ్యా!"

ఒకప్పుడు గుర్రాజు మరదల్ని వేళాకోళం చేసాడు. "కులవూ వర్ణవూ అన్నారు: నలుగుర్ని పోషించే సత్తావున్నావోళ్ళం! గొప్పింటివాళ్ళకే గొప్పబుద్ధులుంటాయిగానీ....." దాన్నే మరదలు యీరోజు తిప్పికొట్టింది.

"ఒక్కళ్ళని కూడా పోషించే సత్తా లేనోళ్ళం మనం! లేనింటిదానికి లేని బుద్ధులు రాకేమవుతాయి?"

కొరడా అక్కడే పడేసి గుర్రాజు కయితంవేపు నడిచాడు డాక్టర్ని తీసుకురావటానికి.

ఏటిలో నీరు అంతగా లేదు. వున్న కొద్దినీరు ఓవారగా పాయలా ప్రవహిస్తోంది. చిన్నప్పుడు ఆడుకున్న ఏరూ ఉంది. ఊరూ ఉంది. అయితే ఎన్నిమార్పులు! నగం పైగా మామిడి తోట కొట్టేసారు. ట్రాక్టర్లొచ్చాయి. బోరింగులు వచ్చాయి. పది కాళ్ళ ఎడ్లూ పది అరకలూ ఉంటే గొప్ప రైతు అనుకునే రోజులు పోయాయి. ఒకడి సాయం ఒకడికి అవసరం లేకుండాపోయింది. యీరోజు తమ్ముడు ఆ మాట అనగలిగాడంటే....!

ఊరు ఆపాటి దూరాన కనిపిస్తోంది. మధ్యాహ్నం ఎండకీ గాడుపుకీ సుడిరేగి ఆకులూ చెత్తా ఎగురుతున్నాయి.

"అయినా వాడి తప్పేముంది....! నా పెళ్ళాంబిడ్డలకి సాయంరాకపోతే తప్పవుతుందిగాని...! అంత శక్తి లేనివాడికి ముందలు దేనికి...? ఏదయినా చేస్తే నేను చెయ్యాలిగాని... యింకోడిని అడగటం.... కాదనిపించుకోటం.....!" తమ్ముడి ప్రవర్తనని సరిపుచ్చుకుంటూ కయితంలో ప్రవేశించాడు.

వైద్యుడి యింటివైపు కదిలాడు.

అప్పుడే అరగంటక్రితమే వెళ్ళిపోయాడన్నారు. చీకటిపడిందాకా వుండిపోయాడు గుర్రాజు అతనికోసం. "అనవసరం కంగారేగాని ఏం జ్వరంలే!" అని సరిపుచ్చుకుంటూ కూర్చున్నాడు. పొద్దుటే వస్తే దొరుకుతాడు! యీ చీకట్లో వస్తాడో రాడో!- అనుకున్నాడు.

డాక్టరు వచ్చాక కబురు చెప్పమని తిరుగుముఖం పట్టాడు.

పురం చేరేసరికి తొమ్మిది. చెరువు గట్టుమీంచి చెక్క భజనలు వినిపిస్తున్నాయి. ఊరంతా అప్పుడే నిద్రలోకి జారుకుంది.

గుర్రాజు కాళ్ళు కదుల్తున్నాయి గాని మనసు కదలనంటోంది. ఏదో కీడు శంకిస్తోంది. చుట్ట ముట్టించుకోటానికి సింహాచలం కొట్లో దూరాడు. జోగుతున్న సింహాచలం - అలికిడికి లేచి - మనిషిని గుర్తుపట్టగానే వార్త చెప్పాడు.

గుర్రాజు చుట్ట జారిపోయింది.

ఆ వార్త వినబుద్ధి కాలేదు, నమ్మబుద్ధి కాలేదు. వినకా నమ్మకా చేసేది లేకపోయింది. పార్వతి వుండే ఇంటివైపు సాగిపోయాయి కాళ్ళు.

గుర్రాజు పార్వతి యిల్లు చేరుకున్నాడు. గుమ్మంలో చిన్నదీపం వుంది. పిల్ల పారబోసిన పాలు తొరకగట్టిన ధారలా పార్వతి నేలమీద తెల్లని చీరలో పడుంది. ఆ కాంతికి అడ్డు వస్తున్న రాట నీడ ఆమెమీద వాలిన భూతంలావుంది. దగ్గరగా వెళ్లికూర్చున్నాడు గుర్రాజు. ఏడిచి ఏడిచి నిద్రపోయింది కాబోలు - ఆపుకుంటున్న ఏడుపు ఆవరించిందతనికి. మగవాడయుండీ గొప్పవాడయుండీ ఏడుస్తున్నానన్న యింగితమే అతనికి కలగలేదు. పార్వతి మేలుకొంది. గుర్రాజు సంబాలించుకోగలిగినా, ఆమె ఆపుకోలేకపోయింది. ఆ ఏడుపుకి చుట్టుపక్కల వాళ్ళు పోగయిపోయారు. కొంతసేపు ఎవరికి తోచిన వేదాంతం వాళ్ళు చెప్పి వెళ్ళిపోయారు. కొంతసేపటికి ఆమె మగతగా కళ్ళు మూసుకుంది. గుర్రాజు చుట్ట వెలిగించుకుని కూర్చున్నాడు.

"బాబా! బాబా!" అంటూ అతన్ని కుదిపారు. చట్టున కళ్ళు తెరిచాడు-కొడుకు!

అతను చెప్పినది వింటూనే ఇంటివయిపు పరుగెత్తాడు. భార్య గొంతు పెద్దదిచేసి మొదలెట్టింది. ఓ మూల కూతురు ఏడుస్తోంది.

"ఎద్దులా గెదిగిపోయుంటే ఎవుడయినా అంటాడు. ఆడి జిమ్మడిపోనూ! నీ కులవేఁటి? బలవేఁటి?" గుర్రాజుకీ మొదలూ తుదీ అర్థంకాలేదు. అంతకన్న గొంతు పెంచాకే ఆమె అసలు విషయం చెప్పింది.

-ఆ వూళ్ళో ఓ పెద్దమనిమన్నాడు. అతనీ మధ్యనే సమితిదాకా ఎదిగాడు పరిషత్తుకు యెదిగే ప్రయత్నాలలో వున్నాడు. అతని కళ్ళని 'దుష్టకళ్లు' అంటూంటారు. అవి ఆడవాళ్ళ బట్టలు చేతుల్తో విప్పకుండానే విప్పగలవు. అందువల్ల అతనికి ఎదురుపడటానికి యిష్టపడరు ఆడవాళ్ళు. గుర్రాజు కులం కన్న అతని కులం కాస్తంత తక్కువ. సాధారణంగా పెద్ద లోగిలివాళ్ళు వీధుల్లోకి రారు. గుర్రాజు యింటి ఆడవాళ్ళు బయటకి రావాల్సివస్తోంది. వచ్చినా మిగిలిన వాళ్ళు భయపడినట్టు గుర్రాజు పెద్దకూతురు పూర్తిగా భయపడలేకపోయింది. ఎక్కడ ఏది ఎలా ఎంత ఎదగాలో అక్కడ అది అలా అంత ఎదిగేసిన ఆ పిల్ల ఆ 'దుష్టకళ్ళ'లో పడనే పడింది.

అతను గలగల నాదం చేశాడు.

"పులి లేడిని తింటాది! అదేటది? పులిని పులి తింటే గొప్ప. అందుకే మనం....మనుషుల్నే తింటాం! తస్సదియ్య! గుంటని కైమా జేసిదినాల!" అతన్ని మందలించేపాటి సాహసం లేని అతని అనుచరులకి - అతన్ని రెచ్చగొట్టి మంచిచేసుకునేపాటి అవసరాలున్నాయి. అలా రెచ్చగొట్టబడిన ఆ పెద్దమనిషి -

"ఎవుర్ని ఎక్కడకొట్టాలో అక్కడే కొట్టాల. ఎవుర్ని ఎలా వంచాలో అలాగే వంచాల. ఎవుర్ని ఏఁవెట్టుకుని పొడాలో అదెట్టుకునే పొడాల - అంది పూర్వం మాట. ఎర్రిబాగుల మాట. యిప్పుడు ఎవుర్నయినా కొట్టాలన్నా, వంచాలన్నా, పొడాలన్నా ఒక్కటే కావాల-! పింగు"

అతను చాలా దర్జాగా గుర్రాజు కూతురుకు కబురంపాడు.

"నీ బాబు పెళ్లిచెయ్యలేడు. చేసినా ఏ పెంటయ్యకో చేస్తాడు. నువ్వు కొత్తబట్టలు కట్టలేవు. నగలెట్టలేవు. కట్టినా చెత్తరకాలు కడతావు. యెట్టినా గిల్టునగలెడతావు. టాక్సీమీదవచ్చిన సంబంధం ఎప్పుడో చెక్కేసింది. కనీసం గాడిదమీద కూడా ఏ సంబంధమూ రాదు" అంటూ ఆమె స్థితిని ఓ ఆడదాని ద్వారా చెప్పించాడు.

"నువ్వా-పిటపిటలాడిపోతున్నావు రోడ్డు మీదకొచ్చావా - ఊరి సూపంతా నీమీదే! నీకా - రోడ్డు మీదకి రాక తప్పదు. నలుగురి కంటా పడకతప్పదు. నువ్వా నలుగుర్నీ సూడకా తప్పదు. ఎప్పుడో ఎవురికో లొంగకా తప్పదు. వయసలాటిది. ఆ తర్వాత ఏటవుద్ది" అంటూ భవిష్యత్తును సూచించాడు.

"అందుకని నా మాట యిను! నన్ను నమ్ముకో! నేను సేరదీస్తానంటే వరసగట్టేవాళ్ళు కో అంటే కోటిమంది. నీ సక్కదనంకన్నా నిన్ను చూస్తే జాలే యేస్తంది" అంటూ చెప్పించాడు.

"పట్నంలో కాపరం యెడతాను. సీరలు కొంటాను. నగలెడతాను. దొరసాన్లాగుంటావు. రాజా బతుకు బతుకుతావు. రాత్రికి రాత్రి ఊరు దాటించేస్తాను. వచ్చెయ్!" అని గీతోపదేశం చేయించాడు.

ఆ పిల్ల ఆ మాటలని మొదట్లో వినటానికి భయపడింది. విన్నందుకూ వింటున్నందుకూ దుఃఖించింది. తన బ్రతుకులోకి సుఖం నిజంగానే రాదా-అని ఆలోచించింది. అలా ఆలోచించాక అతని సలహా గూర్చి కొంత సానుభూతిగా ఫీలయింది. ఆ ఫీలింగ్ కలిగిన వెంటనే యింటికి పరుగెత్తుకొచ్చింది. అక్క ప్రవర్తనలో కొత్తరకం బెరుకు గమనించిన చెల్లెలు నిలదీయటంతో బావురుమంది. తల్లి కలగజేసుకొని గొంతు విప్పగానే ఆ పిల్ల తను చాలా పెద్దపాపం చేసాననుకొంది. నూతికి పరుగెత్తింది. ఆమె యత్నం ఫలించలేదు తండ్రికి కబురు వెళ్ళింది.

"నువ్వేమో పెద్దకాపువి! నీకు పయి పయి నాపసాన్లు ఊడిగాలు సేస్తారు. నువ్వు ఆళ్ళని దీస్తావు. నానులేస్తావు! పట్టెళ్ళేస్తావు! నీ కూతురు - నువ్వు సొంతంగా కన్నకూతురు బజారుదవుద్ది! పయోళ్ళకి సొనవుద్ది'' అంటూ ముగించింది.

గుర్రాజు కోపంతో ఊగిపోయాడు. 'నరికేస్తా' 'పొడిచేస్తా' నంటూ రంకెలేసాడు. 'నా కులవేఁటి? నా బలగవేఁటి? నా వోళ్ళంతా గలిసి ఒక్కసుట్టు ఉమ్మితే ఆడూ ఆడి నడమంత్రం యేపారం ఎక్కడుంటాది?'' అన్నాడు.

"నువ్వు ఎగిరితే సాల్దు. నీకు తమ్ముడున్నాడు. ఓ మాట అతని సెవిని యెయ్యి. పదిమందినీ కూడదీస్తాడు'' అంటూ గుర్రాజుకి నచ్చచెప్పి మరిది యింటికి పంపింది.

కళ్ళు నులుముకుంటూ వచ్చి తలుపు తీశాడు తమ్ముడు, రక్తం పంచుకు పుట్టిన తమ్ముడు, తండ్రిపోయాక తన చేతుల్లో పెరిగిన తమ్ముడు తనవాడు. తనకి మంచీ చెడ్డా చెప్పేవాడు. తన కష్టం సుఖం పంచుకొనేవాడు - గుర్రాజు మనసు చలించిపోయింది. జరిగినదంతా చెప్పటానికి నాలుగువాక్యాలు పట్టలేదు.

"తప్పేమరి! ఆడు అలా సెయ్యకూడదు.'' అనే అన్నాడు అతను. ఆ గొంతు గుర్రాజు ఆశించినట్టులేదు. అయినా తన ధోరణిలోనే అన్నాడు.

"అలాగంటప్పుడు మనం ఊరుకొంటే ఎలా? మన వోళ్ళని కూడ గట్టాల! ఆడి తోలుదియ్యాల!''

"అవునవును!''

"మనోళ్ళకి ఎప్పుడు కవురంపాలో ఏటో సూడు!''

"నేనా! పెద్దోడివి నువ్వు?''

గుర్రాజు కొంచెం నసుగుతూ- "నేను కవురంపడంకన్నా నువ్వు కవురంపితేనే మనోళ్ళు కూడతారు!''

"ఎందుకనీ....?''

గుర్రాజు జవాబివ్వలేకపోయాడు. తమ్ముడు కాస్సేపు చుట్ట పీల్చి - "ఓ మాట! దివాణమే యిలా కవురంపిదనుకో! అప్పుడూ?''

"సచ్చినా- ఆళ్ళలా సెయ్యరు! ఆళ్ళకి ఎవుర్ని ఎలాసూడాలో, ఎవురి విలవ ఎలాఁటిదో తెలుసు!''

"యిది మనం యిన్నదీ, సూసిందీ. మన దివాణంలో మన ఎరికలో యిలాంటియ్యి జరిగుండకపోవచ్చు. ఎక్కడా జరగవా?''

అయోమయంగా చూశాడు గుర్రాజు.

"ఆళ్ళమాట జరిగీది. ఆ రోజులు అయ్యి.''

"దివాణానికీ యీడికీ పూటా యెడతన్నావా?''

"ఏటి తేడ? ఆళ్ళకాడా డబ్బుండేది! యీడికాడ డబ్బుంది."

గుర్రాజు తేరుకుంటూ-

"అయితే ఆ జాత్తక్కవ యెధవని యెనకేసుకొచ్చి నువ్వు సెప్పేదేట్రా?"

"నేను ఎనకేసుకురాటంలేదు. అదా వయసులో ఉంది. నువ్వా పెళ్ళి సెయ్యలేవు. యీడుగాపోతే మరోడు పిలుస్తాడు. మనం పంపలేమా - మనపిల్ల గుమ్మం దాటకుండా సూసుకోవాల. ఊర్లోళ్ళమీద కలబడితే ఊరుకుంటారేటి?"

"ఒరే .... ఒరే.... తమ్ముడూ! నేను పెద్దోణ్ణి! పెద్దబతుకు బతికినోణ్ణి! నువ్వు తమ్ముడివి! సాయానా తమ్ముడివి! యిది....యిదిట్రా నువ్వు సెప్పేది..."

"సెడి బతకడం.... బతికి సెడ్డం అని రెండు లేవు! సెడకుండా పయికొచ్చినోడూ....పయికొచ్చాకయినా సెడకుండా ఉన్నోడూ.... యిప్పుడు ఒక్కడంటే ఒక్కడుండడు! ఆడిని జాత్తక్కువాడంటన్నావు. నాకు తెలకడుగుతాను- జాతి ఎక్కువయినోడు అడిగితే పంపుతావేటి? ఎవుడికాడ డబ్బులుంటే ఆడి జాతే ఎక్కువ. మడుసులకి మూడు గుణాలంట - రజోగుణం, తమోగుణం, సత్వగుణం. మనిషికి తామసం పనికిరాదు. గాంధీగారు ఏటన్నారు? అందరిదీ ఒకటే రక్తం అన్నారు. కృష్ణుడేటన్నాడు? ఎవురి డ్యూటీ ఆరు తెల్సుకోవాలన్నాడు. ఆడి డ్యూటీ ప్రకారం ఆడు కవురంపాడు నువ్వూ ఆడిలా వుంటే కవురంపుతాడా? పంపడు. అందుకని నీ డ్యూటీ నువ్వు తెల్సుకోవాల! నువ్వు ఆడితో కలబడగలవా? కలబడలేవు. ఆడి మాట వొప్పుకోగలవా? ఒప్పుకోలేవు! నువ్వొక్కడివీ ఏం చెయ్యగలవు! నీ డ్యూటీ యేటి! ఆలోసించుకో! నా డ్యూటీ నేను ఆలోసించుకున్నాను. నా కూట్లో నేను బుగ్గిపోసుకోలేను...."

గుర్రాజు బయటకు వచ్చిన వెంటనే ఆ తలుపులు మూసుకున్నాయి. ఆ చీకటి రాత్రి అతనా యింటివేపు చూస్తూనిలబడిపోయాడు. అది తాము ఇద్దరూ పుట్టిపెరిగిన ఇల్లు. ఇప్పుడది తనది కాదు. ఆ యింటికి ఎన్నో మార్పులు. అది మేడయింది. చాలా ఎత్తుగా వుంది. ఆ ఇంట్లో తనదంటూ ఏమీ లేదు. ఏ ఆసరా లేదు. ఇసక కాంట్రాక్టుల్నించి రిపేరింగ్ కాంట్రాక్టులకీ, ఖాయిదా పాటల్నించి కమీషన్ వ్యాపారానికీ ఎదుగుతున్న సోమరాజు ఆ యింట్లో ఉన్నాడు. అలా ఎదుగుతున్న మనుషులకి ఎదిగేసిన మనుషులతో ఎన్నో అవసరాలుంటాయి. అన్నగారే అయినా, దిగిపోయిన మనుషులతో ఏ అవసరాలూ వుండవు.

అలసటతో దుఃఖంతో దెబ్బతిన్న మనసుతో ఇల్లుచేరాడు గుర్రాజా. ఎదురుచూస్తున్నాడు కొడుకు. ఏదో ఆధారంకోసం అతని మనసు ఆరాటపడింది. కొడుకుని దగ్గరగా తీసుకున్నాడు.

"ఏటన్నాడు సిన్నాన్న?"

జవాబివ్వలేదు గుర్రాజా. అతన్ని కప్పివున్న ముసుగు కొంచెం సడలినట్లయింది. ఈ చుట్టూ వున్న మనుషుల్లో-లేనివాళ్ళూ, ఉన్నవాళ్ళూ- రెండే

రకాలున్నట్టు అర్థమయినట్లయింది. మూడో రకం ఉన్నా-వాళ్లు ఉన్నోళ్ళయినా అవుతున్నారు, లేనోళ్ళయినా అవుతున్నారు. తమ్ముడు తనూ..... ఉన్నారు. ఒకడు ఉన్నోడు. ఇంకోడు.... అవును! లేనోడు. ఉన్నోడు తోటివాళ్లను సమర్థించాడు లేనోడు? లేకపోయినందుక్కూడా గుర్రాజు ఎప్పుడూ అంత బాధ పడలేదు. ఉన్నోడు తన తోటివాళ్ళతో ఎంత వేగం కలిసిపోయాడు! తను కలియలేకపోయాడు! లేనోళ్ళతో కలియలేకపోయాడు. వాళ్ళలా పారపట్ట లేకపోయాడు. నిజానికి తనకులంలో లేనివాళ్ళు ఎంతమందిలేరు? వాళ్లని తను - కలిగినప్పుడు సరే- లేనప్పుడయినా గౌరవించాడా? తనూ గొప్పవాడిలాగే తిరిగాడు. ఈ కులాలు ఎవరికి? ఉన్నోళ్ళకి! తమ కింద స్థితిలో ఉన్నవాళ్ళని మరింత విడదీసి తము మరింత మీదకు పోయేందుకు సాధనాలవి.

కొడుకు నిద్రపోతున్నాడు. రాత్రంతా అతని మేధాశక్తి మేరకు అతని అనుభవాల మీంచి రకరకాల ఆలోచనలు వచ్చిపోతున్నాయి గుర్రాజుకి. తూర్పుదిక్కున, వెలుగురేఖలు విచ్చుకుంటున్నాయి. చితకగొట్టేసినట్టు పడుకున్న ఆ యింట్లో మనుషులు ఒకరూ ఒకరూ మేలుకొంటున్నారు.

గుర్రాజు చూపులు అకస్మాత్తుగా గోడమీద ఉన్న గుర్రపుకళ్లెంమీదకూ జీను మీదకూ పోయాయి.

అతను పిచ్చిపట్టినట్టు లేచాడు.

ఆ వస్తువులను .విసిరేసాడు. సాలలో గుర్రప్పిల్లలను విప్పి వదిలేసాడు.

కొడుకు గబుక్కున పరుగెత్తుకు వచ్చాడు.

"ఏటి బాబా?" తన తాతతండ్రుల ఉపదేశాలు తను కొడుక్కి యివ్వలేడు. ఏ గౌరవాలను నిలబెట్టమని తను చెప్పరాదో అతనికి తెలుస్తోంది. ఏ గౌరవాలను నిలబెట్టమని చెప్పాలో అతనికి అప్పటికి అర్థం కాలేదు. మనుషుల్ని మనుషులతో కలిపే సంప్రదాయాలేమిటో అతనికి అర్థంకాలేదు. అయినా అలా కలవాలిసిన అవసరంతో అతను కదిలిపోతూ కొడుకు చేయి గట్టిగా పట్టుకున్నాడు.

ఆ తరం ఓ అడుగు వేయుగలిగితే తరువాతి తరం మరో అడుగు వేయకపోదు.

సాహసానికి చిహ్నంగా ఉండే తను విలాసానికి చిహ్నమయి వీధిలోకి విసిరివేయబడినందుకు వెర్రిగా చూస్తూ ఉండిపోయింది మురికి కాలవలో గుర్రపు కళ్ళెం!

*('స్వాతి' మాసపత్రిక - జనవరి, 1983)*

# కులరాజ్యం

"నీకు పెళ్లవలేదా?"

"లేదు."

"ఎంచేత?"

... ...

"సమాధానం చెప్పవేం?"

"చెపుతాను. అర్థమవుతుందా?"

☆ ☆ ☆

కొన్నేళ్ళక్రితం పుట్టాను. పుట్టిన కొన్నాళ్ళకు నాన్న, అమ్మా 'లలిత' అన్న అక్షరాలు బియ్యంలో రాసారు.

'లలిత' లలితంగా ఉండాలిట...

అలాగే ఉన్నాను.

'లలిత' లలితంగా ప్రవర్తించాలట...

అలాగే ప్రవర్తించాను.

'లలిత' లలితంగా మాట్లాడాలిట...

అలాగే మాట్లాడాను.

నాన్న పోలీసు!

అతనికి సంబంధం లేని ఓ యిద్దరు డబ్బున్నాళ్ళు వాళ్ళ డబ్బుపెట్టి, కొన్ని జతల చేతులనీ, కర్రలనీ, బాకులనీ కొనుక్కొని కొట్టుకున్నారుట! ఆ కొట్లాటలో వాళ్ళ పవిత్ర రక్తం తప్ప అలగా రక్తం చాలా ప్రవహించిందట. అలా - ఎవరిదయితేనేం - రక్తం ప్రవహించటం శాంతి భద్రతలకు భంగం అన్న విషయం గుర్తువచ్చి ఆ డబ్బున్నాళ్ళు యిద్దరూ కలిసి ప్రెస్‌లో పశ్చాత్తాపం ప్రకటించారు.

దెబ్బలు తగలని పెద్దలు... వాళ్ళ వాళ్ళ రాజకీయ ప్రయోజనాలలో సర్దుబాటు చేసుకున్నంత చౌరవగా దెబ్బలు తిన్న చిన్నవాళ్ళు చేసుకోలేక పోయారు.

వాళ్ళలా దొంగదెబ్బలు తీసుకుంటూండగా.... ఓమారు నాన్న జొరబడ్డాడు. నాన్న తల పగిలింది.

అమ్మ గాజులూ, నా భవిష్యత్తూ పగిలాయి. మామయ్య అవ్యాజానురాగంలో ... అమ్మ ఏడుపులో.... చేతి కందిన సొమ్ము చెదిరిపోయింది.

☆ ☆ ☆

రవి మంచివాడు! రవి నాన్న యింకా మంచివాడు! రవి నాన్న నాన్న యింకా యింకా మంచివాడు.

రవి మంచివాడు!

కనక... నువ్వు లలితంగా ఉన్నావన్నాడు!

మాట్లాడలేదు.

కనక... నువ్వు లలితంగా మాట్లాడతావన్నాడు!

బ్రో ఎత్తలేదు.

కనుక... నువ్వు లలితంగా ప్రవర్తిస్తావన్నాడు.

రవి నాన్న యింకా మంచివాడు!

కనక... లలితంగా ఉండి... మాట్లాడి... ప్రవర్తించి.... మావాడిని సొంతం జేసుకున్న లలితా! నువ్వు మంచిదానివి అన్నాడు. "ఈ పెళ్ళి నాకు యిష్టమే" అన్నాడు. "నా యిష్టం నా చేతిలో లేదు" అన్నాడు. నా యిష్టం మా నాన్న ఆస్తిలో ఉందన్నాడు. మా. నాన్న ఆస్తి అతని ఇష్టంలో ఉందన్నాడు.

రవి నాన్న నాన్న యింకా యింకా మంచివాడు.

కనక... నా కొడుక్కీ, మనవడికీ నచ్చిన అందగత్తా! నువ్వూ నాకు నచ్చావు! అన్నాడు.

కనక... నా ఆస్తి మైనస్ నా మనవడిని పెళ్ళాడూ-అన్నాడు.

లేదా... నా ఆస్తి ప్లస్ నన్ను పెళ్ళాడూ... అన్నాడు.

పరవశత్వంతో చెయ్యి చాచాను.

కరుణతో సారీ విదిలించి వదిలిపోయాడు రవి!

☆ ☆ ☆

నేను గుమ్మాలు ఎక్కాను.

గదుల్లోకి ఆహ్వానించారు.

నేను నమస్కారాలు చేసాను.
రెండు చేతులూ చాచమన్నారు.
కన్నీరు పెట్టుకున్నాను.
పన్నీరు చెయ్యమన్నారు.
నాకు పని దొరకలేదు.
వారిచ్చిన పనికి నేను దొరకలేదు.

☆ ☆ ☆

ఉన్నదంతా ఊడిచేసిన మామయ్యను అమ్మ అడిగింది:
"అది ఎన్నాళ్ళిలా పూలు పూయని మొక్కలా... కాయ గాయని చెట్టులా?"
"కొన్నాళ్ళు..."
కొన్నాళ్ళు గడిచాక-
"మరికొన్నాళ్ళు-"
మరికొన్నాళ్ళు గడిచాక -
మామయ్య నోరు విడలేదు.
అత్తయ్య నోరు విప్పింది.

☆ ☆ ☆

"వాడు మూగవాడు. అయినా నా అక్క కొడుకు..."
"అత్తయ్యలాగే బంధుప్రీతి గలవాడు-"
"ఎప్పుడూ అందరినీ కొట్టడు-"
"కొందరిలాగ!"
"అస్తమానూ అందరినీ తిట్టడు-"
"పెళ్ళాంగదా - అసలు తిట్టడు-"
"అయినా వాడు మగాడు-"
"అందగాడు కూడా...."

"అందువల్ల.... వాడి చేత మెళ్ళో తాళి కట్టించుకోండి! గుమ్మాలెక్కి, నమస్కారాలు చేసి, కన్నీళ్ళు పెట్టుకుని నీ కూతురు సంపాదించిన దేమిటి? చెడ్డ పేరు...."

"మామయ్యా - అత్తయ్య మాట-?"
"పెద్దవాళ్ళమాట చద్దన్నం మూట!"

☆ ☆ ☆

వాళ్ళిద్దరి బుర్రకథా ముగిసింది.

అమ్మ మౌనపు రాయికి తగిలి వాళ్ళ ఆసరా పగిలింది.

☆ ☆ ☆

"ఏం చేద్దాం?" అడిగింది అమ్మ...

తల ఎత్తాను.

"ఏదయినా సరే చేద్దాం!"

అమ్మ మొఖంలో దైన్యమూ, ప్రశ్నలూ కదలలేదు.

"అది లలితంగా ఉండదు!"

అమ్మ అనుమానంగా చూసింది.

"అది అభిమానాన్ని అమ్ముకోవటం కాదు!"

అమ్మ తృప్తిగా చూసింది.

"అది నాన్న చేసిన పనే!"

అమ్మ అయోమయంగా చూసింది.

"అయితే మంచి కలలను కత్తిరించటానికి ఆయనకి ఆయుధం యిచ్చారు-"

అమ్మ ఏదో అనబోయింది.

"మంచి కలలను నిజం చేయటానికి నేను -"

"ఆయుధం పుచ్చుకున్నవాళ్ళంతా అర్ధాయుష్కులేనమ్మా!"

"పుచ్చుకోనివాళ్ళంతా పూర్ణాయుష్కులా?"

అమ్మ సమాధానం చెప్పలేక పోయింది.

"ఆయుధాలు లేని... అవసరం లేని... రాజ్యం; పుట్టిన ప్రతి మనిషి పూర్ణాయుష్కునిగా బ్రతకటానికి అవకాశమిచ్చే సమాజం.... మంచి కలలు కావా అమ్మా?"

అమ్మ ఆలోచనలో పడింది.

నేను ఆచరణలో పడ్డాను.

*(ప్రజాపక్షం - డిసెంబర్ 1-15, 1992)*

# కర్త

నాకు చాలాకాలంగా నిద్రలేదు.

ముఖ్యకారణం నా రెండోకూతురు - సూరీడు - సూర్యప్రభ. దానికి నేనంటే ఎంత అసహ్యం!

నా ప్రతిమాటనీ అది తోసి పారేస్తుంది. ఇన్ని కష్టాలు పడ్డాను. ఏదో ఈనాటికి ఇంతపైకొచ్చాను. పదిమందిచేత ఔననిపించుకున్నాను. ఈరోజున ఎవడికైనా నా ఎదుటబడి మాట్లాడాలంటే కాళ్ళూ, చేతులూ వణుకుతాయి. మాట తడబడుతుంది.

అలాంటిది ఆ భడవకి ఎంతధైర్యం-

ముగ్గురు పిల్లలనీ సమానంగానే కన్నాను. పెద్దాళ్ళిద్దరూ - రాజ్యమూ, రాంబాబూ - నాముందు ఎన్నడూ నోరు విప్పలేదు. న్యాయానికి - ఆలశ్యంగా పుట్టిన పిల్లకనక పెద్దదానినే ఎక్కువ ముద్దు చేసాను. మగపిల్లాడు కనక వాడిని నేలమీద కాలుపెట్టకుండా పెంచాను. వాళ్ళిద్దరికన్నా, దీన్ని ప్రత్యేకంగా పెంచలేదు. ఇది పుట్టాకపట్టినదల్లా బంగారమయింది. అయినా నేనేం దాన్ని ఎక్కువ చెయ్యలేదు.

పెద్దాళ్ళిద్దరూ చక్కగా చదువుకున్నారు. పెళ్లిళ్ళు చేసుకున్నారు. వాళ్ళకేం తక్కువయింది? రాంబాబు ఫ్యాక్టరీ బ్రహ్మాండంగా నడుస్తోంది. వాడు రెండో యూనిట్‌కి స్థలం వెదుకుతున్నాడు. వాడి అత్తారికే తలబిరుసు. అయినా వాళ్ళదగ్గర ఉంటూనే, వాళ్ళని వంచుతున్నాడు. రాజ్యం మొగుడు గవర్నమెంటులో పెద్ద ఆఫీసరు. ఏడాది తిరిగేసరికి ఒక ఫ్లాట్ కొంటున్నాడు. దాని అత్తారు కొంచె చెడిబతికినాళ్ళు. మనుషులు ఎలా ఉండాలో - ఎంత హోషుగా ఉండాలో - తెలియని అడవిమనుషులు. ఆడాళ్ళకేం గావాలి - బంగారం. చేరిపించు కుంటారు. చేయించుకుంటారు. ఆమాత్రం ముచ్చట కూడా తీర్చలేరా? రాచి రంపాన పెడుతున్నారు. నీ బాబు దగ్గరికి వెళ్ళి చేయించుకోమంటారు.

ఏమాటకామాటే చెప్పుకోవాలి. మొగుడు బంగారం. దాని కొంగు పట్టుకు వదలడు. అలా మొగడు కాసుకోబట్టే, అది అక్కడ ఉంది.

ఏవో సంసారాలన్నాక, చిన్నాచితకా ఉంటాయి. నేను చెప్పినట్టల్లా విన్నారు. సుఖంగా ఉన్నారు. ఇది మొదటినుంచీ యింతే - నేనేం నాజూకుగా వదిలెయ్యలేదు. ఆడపిల్ల, వంచేలా వంచాలి. లేకపోతే ఎందుకూ పనికిరాకుండా పోతుంది. తెలుసు - అలాగే పెంచాను. కాని మానవులం కదా గుడ్డి ప్రేమ! ధృతరాష్ట్రుడంతటివాడిని వంచేసింది పిల్లల మీద ప్రేమ. నేనెంత!

అందుకే అలా తయారయింది.

తండ్రినని కూడా చూడకుండా - "నువ్వు మమ్మల్ని ప్రేమిస్తున్నాననుకుంటున్నావేమో! అంతా అబద్ధం. నిన్ను నువ్వు ప్రేమించుకుంటున్నావు. నీ ఆర్జనను ప్రేమించుకుంటున్నావు. నీ డబ్బుని చూసి, ప్రతివాళ్ళూ తలతిరిగి కాళ్ళమీద పడాలనుకుంటున్నావు. అందులో నువ్వు కన్నపిల్లలకి కూడా మినహాయింపు లేదు. అక్కయ్యనీ, అన్నయ్యనీ నువ్వు మనుషుల్లా పెంచలేదు. మరల్లా పెంచావు. వాళ్ళకి ప్రపంచంలో ఉన్న ఏ ఆనందమూ తెలీదు. ఏ విషాదమూ తెలీదు. నువ్వు నేర్పిన ఆనంద, విషాదాలే వాళ్ళకి తెలుసు. డబ్బుని తయారు చెయ్యటం, తయారయిన డబ్బుతో తమలోని శూన్యాన్ని నింపుకోవటమే తెలుసు, అది నీవు పెట్టిన భిక్ష. నీవు వారసత్వం - -" అనేసింది.

నేను తెల్లబోయాను. వాళ్ళమ్మ అడ్డుకుంది. తిట్టింది. దాన్నికూడా ఎన్నిమాటలంది!

"అమ్మా - నువ్వు పల్లెటూరిలో పుట్టావు. మట్టిలో పెరిగావు. పేడచేసి, పిడకలు చరిచావు. పశువులకి దాణా పెట్టావు. పాలు పితికావు. లేగదూడలతో ఆడుకున్నావు. పొలంలోకి వెళ్ళావు. నడుం వంచావు. నాట్లు నాటావు. అప్పటి ఆనందం - ఆ ఉత్సాహం - ఆ స్వచ్ఛత యీనాడు నీకున్నాయా? ఈ మనిషిని కట్టుకున్నాక, ఈయన వెనకాల పరుగెత్తావు. నీ భాషనీ, నీ వేషాన్నీ మార్చేసాడు. నీ మనసుని కూడా మార్చేసాడు. నువ్వీరోజున జీవిస్తున్నదే జీవితమనీ, నీ సుఖం, నీ క్లబ్బులూ నీ మహిళాసంఘాల అధ్యక్ష పదవులూ మాత్రమేననీ, నిన్ను నమ్మేట్టు తయారుచేసినది ఈయనే! ఈ మగవాళ్ళు మన మెదడుని చిత్రీపట్టి, వాళ్ళకి కావాల్సిన షేప్‌లో దాన్ని జేబులో ఉంచుకుని అదంతా తమ హోదాలో, ప్రదర్శనశాలలో ప్రదర్శనవస్తువుగా చూపిస్తుంటారు."

సూరీడు ఏమంటున్నదీ నాకే అర్థం అవలేదు. ఇంక వాళ్ళ అమ్మకేం అర్థమవుతుంది! వాదిస్తే లోకువవుతానని తెలిసీ, వాదించేను. లాభం లేకపోయింది. పూర్తిగా అదుపు తప్పిపోయింది. ఇంకొక్కటే మందు. పెళ్ళి. దెబ్బకి - అన్ని రోగాలూ కట్టేస్తాయి. ఆ ప్రయత్నమూ చేసాను. గట్టిగా మాట్లాడితే - యింట్లోంచి పోతానంది.

అదిరిపోయాను.

'పెళ్ళి వద్దంటుందేంట్రా--' అంటూ రాంబాబుతోనూ, రాజ్యంతోనూ మాట్లాడాను. వాళ్లమ్మతో మాట్లాడాను. 'నా కూతురేంటి - యీ మాటలేంటి - దీనికి ఏదో శనిపట్టింది --' అంది వాళ్ళమ్మ. అది ఏమిటో సులువుగానే తెలిసింది.

నా తమ్ముడి కూతురు మాలతే ఆ శనిగ్రహం. అది మరీ కంగాళీ వెధవలా తయారయిందిట. ప్రతీ కొంపలోనూ దూరి, 'నువ్వు పెళ్ళాన్నికొట్టావా నీవీపు చీరేస్తాను' అంటూ సంసారాల్లో చిచ్చు పెడుతోందిట.

ఆడపీనుగులకి చదువులట. స్వేచ్ఛట. హక్కులుట - అవన్నీ మా ఆవిడా చెపుతుంది ఉపన్యాసాలలో - అది ఈనాటి ఫేషన్. అయితే - కూలినాలి చేసుకుని, అడుక్కుతినే ఆడపీనుగులకి అవన్నీ నూరిపోస్తే ఎలా? ఈరోజు మొగుళ్ళని చావగొట్టమని ఉసికొలిపితే, రేపు వీధినబడి కనిపించిన ప్రతి మొగాడినీ కొట్టబోతారు. 'ఆడదాన్ని వీధిలోకి వెళ్ళనిస్తే, పదిమంది దగ్గర ఖచ్చితంగా పడుకుంటుందని' మా నాన్న అనేవాడు. అది నిజమే. పడుకుంటే ప్రమాదం ఏముంది-? మనవాళ్ళని వెళ్ళనీయకపోతే-అదీ మనకు లాభమేగదా-' అనుకునేవాడిని. అయితే వాళ్ళు పదిమందిని పట్టుకుని చావగొడితే మాత్రం ప్రమాదమే - అక్కడెక్కడో ఎమ్మెల్యేను పట్టుకుని కొట్టారు. సరే - లోకంలో ఏం జరిగితే నాకేం? అక్కడెక్కడో నిప్పంటే నాకేం నష్టం--? అది నా కొంపమీద పడినపుడు ఆర్పడం నా కర్తవ్యం.

నేనా ప్రయత్నమే చేసాను.

చేతిలో డబ్బులేని వెధవలు కూతుళ్ళకి పెళ్ళిళ్ళు చెయ్యరు. అప్పుడు వాళ్ళు తిన్నగా ఉండరు. పెళ్ళిళ్ళయి అదృష్టమున్న వాళ్ళని చూసి, కళ్ళలో నిప్పులు పోసుకుంటారు. పెళ్ళీ వద్దు, పెటాకులూ వద్దు - అని వాగుతారు. పరాయి ఆడది ఏ చెత్త వాగినా, చుట్టూ చేరి, చప్పట్లు కొట్టే చిత్తకార్తె కుక్కలు మగ వెధవలు. ఆ చప్పట్లు విని, మరింత పేట్రేగిపోతారు ఆడపీనుగలు.

అందువల్ల అసలు రోగమంతా పెళ్ళి కాకపోవటంలో ఉంది.

ఆమాటే అన్నాను సూరీడుతో.

ఎంత నవ్వు నవ్విందది.

"అక్కకి పెళ్ళి చెయ్యి. నీ కాలికింద చెప్పులా ఉంటాను--" అంది.

ఆలోచనలో పడ్డాను. అదెంత పని! చిటికెలో చెయ్యొచ్చు. అయితే - కష్టపడి సంపాదించిన డబ్బు పై వాళ్ళకి దొబ్బబెట్టాలన్నదే అసలు బాధ!

తప్పదు - సూరీడుని ఓ దోవలో పెట్టాలంటే ఆ మాత్రం ఖర్చు పెట్టక తప్పదు. దాని జీవితానికి నేను కర్తనవుతాను. - నా పరువు నిలబడుతుంది.

"నువ్వా మాట మీద ఉంటావా--?"

"మాట తప్పటం నీ దగ్గర నేనేం నేర్చుకోలేదు --" అంది.

వెంటనే మా తమ్ముడికి కవురంపాను.

వసుదేవుడంతటి వాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాడట. నేను అంతపని చెయ్యనక్కరలేదు. కుక్కకి బిస్కట్టు చూపెడితే చాలు - వెంటబడుతుంది.-

అదే అనుకున్నాను. మూడుకవుర్లు పంపినా ఆయనగారు రాలేదు.

ఎందుకొస్తాడు?

వాడికి నేనంటే మంట.

ఎదుట పడటానికి నామోషీ. పడితే, పలకరించటానికి ఏడుపు.

ఎందుకంటే ఏం చెప్పను? కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. ఏడుపు గొట్టు వెధవలకి డబ్బయ్యొక్క కారణాలు. చివరకి మా అమ్మా, నాన్నా నన్ను ముందు కన్నారని కూడా ఏడుపే!

సమానంగా కన్నారు. సమానంగా పెంచారు. సమానంగా - ఉన్న భూమిని పంచారు. వాడు బాగుపడలేదు. నేను పడ్డాను.

నేను కష్టపడ్డాను. భగవంతుడు కలిసొచ్చాడు. ఈరోజున నాకు ఒక సినిమాహాలుంది. రెండు లారీలున్నాయి. ఒక క్లాత్‌షాపుంది. ఏదో ఓ కొంప కట్టుకున్నాను. నాకు మాత్రం లోకంలో అందరికన్నా ఎక్కువ ఆస్తి ఉందా? ఉన్న దానితో తృప్తిపడే స్వభావం ఉంది. అదే అసలు ఆస్తి. లేనిదానికోసం ఏడిచే అలవాటు లేదు. అందుకే యీరోజు ఏదో యిలా ఉన్నాను.

వాడు మొదటినుంచీ మొద్దు రాచ్చిప్పే. ఒళ్ళొంచి పనిచేసే అలవాటు లేదు. అందుకే యీరోజున ఫ్యాక్టరీలో కూలి వెధవలా పనిచేస్తున్నాడు. నన్ను చూసి ఏడుస్తాడు.

వాడికోసం నేను ఎంత కష్టపడ్డాను. - ఎన్ని ప్రయత్నాలు చేసాను. - అవన్నీ ఎందుకు గుర్తుంటాయి.

మా నాన్న పోయినా, ఆయన అన్నీ పంచేసినా, నేను వాడిని వదలలేదు. ఉమ్మడి వ్యవసాయం చేసాము. అన్నీ నాకు అప్పజెప్పి, సినిమాలూ సరదాలూ అంటూ బలాదూరు తిరిగాడు. నేనేనాడూ వాడికి అడ్డు తగిలిన పాపానపోలేదు. అయినా, ఓ వయస్సు వచ్చిన వాడికి, ఎంత అన్నగారయినా, చెప్పడం చెప్పిచ్చుకుని ఆ దవడా యీ దవడా వాయించుకోవడమే! ఏ మాటకి ఆ మాటే చెప్పుకోవాలి. నాకు చెప్పుదెబ్బలు తినేపాటి త్యాగబుద్ధి లేదు. చెయ్యాల్సిన సాయం చేసాను. పద్దులు అన్నీ కరెక్టుగా రాసాను. అయినా వాడిది అయిదెకరాలు కరిగిపోయింది. అమ్మనీ, వాడినీ కూర్చోబెట్టి మనలాంటి వాళ్ళం వ్యవసాయానికి పనికిరామన్నాను. ఉన్నదంతా అమ్మేసాను. పట్నం చేరాము. మా ఆవిడ పుట్టింటి

వాళ్ళనడిగి ఏదో తెచ్చుకుంది. మూడువాటాలు వేసుకుని హోటలు పెట్టాము. వాడిని గల్లా పెట్టి దగ్గర కూర్చోబెడితే అంతా గల్లంతే! అందుకని కిచెన్‌లో ఉండమన్నాను. అక్కడైనా వాడు సరుకులనీ, వంటవాళ్ళనీ, సర్వర్లనీ అజమాయిషీ చేయొచ్చుగదా - ఎవడేం మోసేస్తున్నాడో - ఎవడేం మేసేస్తున్నాడో - చూసుకోవచ్చుగదా - అబ్బే అలా ఎందుకు చేస్తాడూ? చెయ్యలేదు. మా అమ్మని నామీదకి ఎగసన దోసాడు. ఆవిడ చేత నానా మాటలూ అనిపించాడు. నేను నా పెళ్ళాం పేర ఆస్తులు కొంటున్నా నన్నారు. ఎన్ని కుళ్ళు మాటలు అన్నారు! పడ్డాను. పడ్డాను. ఎవరయినా, ఎన్నాళ్ళు పడతారు? మీ దోవ మీరు చూసుకోండన్నాను. లెక్కలు తేల్చాను. నా తల తిరిగిపోయింది. వాడే నాకు చాలా యివ్వదేలాడు. ఆరోజున నా భార్యది దొడ్డబుద్ధి కనక పోన్లెండని వదిలేసింది. వాడికి ఆ కృతజ్ఞత కూడా లేదు.

ఎవరి దోవ వాళ్ళు చూసుకున్నాం.

గొడ్డొచ్చిన వేళా, బిడ్డొచ్చిన వేళా అన్నారు. వాడికి మొదటి కూతురు పుట్టేసరికి ఉన్న భూములు పోయాయి. ఉన్న ఊరు విడిచి పట్నం చేరాం. మూడో కూతురు పుట్టింది. హోటలు వ్యాపారం ఎత్తి కట్టించేసింది. మోహమోహాలు చూసుకోకుండా చేసేసింది.

వాడు అంతచేసాడు. అన్ని మాటలు అన్నాడు. అయినా నేనెప్పుడూ మనసులో పెట్టుకోలేదు. అమ్మని నా గడప కూడా తొక్కకుండా చేసాడు. ఆవిడపోయినప్పుడు అయినా సరే - నేనే నిలబడ్డాను. నాకు పిల్లలు పుట్టడం ఆలశ్యమయింది. యింట్లో ప్రతీకార్యానికీ పిలిచాను. పీటవేసి కూర్చోబెట్టాను.

ఈనాడు నేను మూడు కబుర్లు పంపినా రాలేదు. ఎప్పుడొచ్చాడు గనక! మండిపోయింది.

చిన్న పిల్లతో పంతానికి పోయాను. ఏదో సాయమవుదామనుకున్నాను - ఆ నెపాన అయినా-!

ఆఖరికి ఓ రోజున చలిలో, రాత్రివేళ, రోడ్డుమీద పడిగాపులు పడి ఉన్నాను.

రాత్రి పదవుతోంది. ఇంకా యింటికి ఆఘోరించలేదుట. ఫస్ట్ షిఫ్టట. డ్రైవరు వచ్చి చెప్పాడు. ఉండి లేదనిపించుకున్నాడా -?

కార్లో కూర్చుని చూస్తున్నాను. ప్రతి అలగా వెధవనూ చూసి వాడే అనుకోవడం - తీరా కాకపోవడమూనూ -!

చివరకి దొరికాడు.

డ్రైవర్ వెళ్ళి పిలుచుకొచ్చాడు. లోపలికి రమ్మన్నాను. నా తప్పులేదు. వాడే రాలేదు. వదిలించుకుందామని చూసాడు. యోగక్షేమాలతో సరిపెడదామని చూసాడు. బయట నిలబడి, కారులో వాళ్ళతో మాట్లాడి, నలుగురికీ కనపడదామని గాబోలు - వాడి ఊహ. చికాకేసింది. కాని జాలి కూడా వేసింది.

"మాలతి పెళ్ళి ఏంచేసావ్?" సూటిగానే అడిగాను.

ఎప్పుడయినా చూపులు కలపడం వచ్చా-వాడు ఆశ్చర్యపోయాడేమో - ఎలా తెలుస్తుంది! మాసిన గడ్డంతో మండ మీద గోక్కున్నాడు. ఖాకీ చొక్కా మీద ఆయిలు మరకలు. కళ్ళకింద మసో - నల్లదనమో-!

వాడి వాలకానికి చాలా కోపం వచ్చింది.

దరిద్రం మండిపోతోందా - ఓ సబ్బు ముక్క కొనుక్కుని, హాయిగా కడుక్కుని ఫ్యాక్టరీ నుంచి వచ్చేటప్పుడు చక్కని బట్టలు వేసుకోవచ్చుగదా -

మరోసారి రెట్టించాను అదే ప్రశ్నను

"దేనికి మనం కర్తలం -?"

"మెట్ట వేదాంతాలొదిలెయ్! కన్నపుడుండాలి ఆ బుద్ధి. ఏదో చెయ్యాలి. తల తాకట్టుయినా పెట్టాలి."

"ఎవడు పడతాడు?"

మోహం మీద చరిచినట్టుందా ప్రశ్న. ఎప్పుడూ నా ముందు నోరు విప్పలేదు. వాడి తరపున అమ్మే పోట్లాడేది. ఎప్పుడయినా నోరు విప్పాడా - నేను భుజాలు తడుముకుంటున్నానా - అయినా నేనేం చేసానని!!

"నువ్వు యింటికిరా - నీకు బాధ్యత లేకపోయినా నాకుంది."

"పదయిపోతోంది - మళ్ళీ పొద్దుటే లేవాలి."

"కబుర్లు చెప్పక! షిఫ్ట్ డ్యూటీ కదా - పొద్దుటే లేవటమెందుకూ?"

"పేపర్లమ్ముతున్నాను"

"ఏం చేస్తున్నావా సంపాదనంతా - దానికి పెళ్ళి చెయ్యకుండా-"

"-----"

"నువ్వు రావల్సిందే----"

"రేపు షాప్‌కి వస్తాను"

"ఇంతకు ముందూ అలాగే కవురంపావు."

"-----"

"అయితే నువ్వు రానంటావు - యింటికి."

"-----"

"నేను పూర్వకాలం వాడిని. నన్ను ఎడపెడుతున్నావు. కాని, నాకు చెమో బెమో ఉన్నాయి. గంతకు తగ్గ బొంత. ఎవరినో ఒకరిని చూడు. మిగిలిందంతా నేనే చూసుకుంటా---!"

వాడు నా మొహంలోకి చూసాడు. అలా చాలామంది చూసారు. వాడు అలా ఎన్నడూ చూడలేదు. కంగారుపడ్డాను. అణచుకున్నాను. వాడిచేతిని నొక్కాను.

"మాలతికి పెళ్ళవ్వాలి అదబ్బాయ్! నాకు కావాలి"

"నువ్వీ మాట అంటావని ముందే అంది."

ఆ విషయం సూరీడు చెప్పింటుందా! మండిపోయింది. ఈ ముష్టి వెధవకి కూతురు నేర్పిందన్నమాట! పిదపకాలం. తండ్రులకి పిల్లలు నేర్పుతున్నారు.

అదనూ పదనూ ఎరిగినవాడిని కనక అణచుకున్నాను.

"తెలివయిన పిల్ల. దానికి నా సంగతి తెలవదా నా మంచితనం పోల్చుకుంది. వెంటనే సంబంధం చూడు."

"అలాగే" --- కదలబోయాడు.

"ఆగాగు - ఎప్పుడు చూస్తావ్?"

"సూరీడుకి పెళ్ళయ్యాక"

"అది చిన్నదిరా - నీకు మతిగాని బోయిందిరా-"

"రాజ్యమూ చిన్నదే రాముడూ చిన్నాడే---"

అమ్మ! వీడికీ ధ్వనించటం వచ్చన్నమాట. దానిని గమనించనట్టు అన్నాను.

"నీ అంతట నువ్వు కదులుతావేమోనని చూసాను. ఇదిగోరా అన్నయ్యా - ఈ సంబంధం చూసా - నువ్వు మొయ్యక తప్పదు - అంటావేమో అనుకున్నాను. కావాలంటే వదినని అడుగు - నువ్వు రాలేదని ఎంత బాధపడ్డానో చెపుతుంది. రాముడు అమెరికా నుంచి వచ్చాడు. ఫ్యాక్టరీ పెట్టాలనుంది. వాడికి పిల్లనిస్తామన్న వాళ్ళు పెడతామన్నారు. ఒప్పేసుకున్నాను. ఒప్పుకున్నాక ముహూర్తాలన్నారు. తప్ప లేదు. రాజ్యం అంటావా - ఆ మూడు లక్షలు యిచ్చి, మరో రెండు చూసుకొనేసరికి ఎన్ని పాట్లు పడ్డానో ఆ మూడో కంటికి వాడికి తెలుసు. ఇప్పుడు చెయ్యి వెనలుబాటయింది. అందుకే నువ్వు ముందుకి రాకపోయినా - నాకు తప్పలేదు."

"సరే మాలతిని అడుగుతాను. ఒప్పుకుంటుందని నమ్మకం లేదు."

"ఏం చేస్తుంది - పెళ్ళాడక?" మిగిలిన వాక్యాలు తొక్కేసాను.

"దాని దృష్టిలో చాలా ఉన్నాయిట"

"ఏమిటో - ఆ - చాలా?"

"సమాజంలో చాలా సమస్యలున్నాయిట."

అవును తండ్రీ - చాలా ఉన్నాయి. నా పీకకి ఉచ్చువెయ్యడం కూడా ఒకటి.

"అవునబ్బాయ్ - సమాజానికి అందరూ సేవచేయాలి. నేను చెయ్యటం లేదా.? మీ వదిన చెయ్యటం లేదా? - దానిగురించి పేపర్లలో చదివే ఉంటావు. సూరీడు పద్యాలు గట్రా రాసి పుస్తకం వేసింది - అవార్డు కూడా యిచ్చారు. - అందుకోసం పెళ్ళి మానేస్తుందా - ఈ రోజు సంబంధం చూస్తే రేపు పీటల మీద కూర్చుంటుంది."

"మాలతీ మానతాననటం లేదు."

"ఇంకేం చేసెయ్యి."

"దాని పెళ్ళికి నేను కర్తని కాదుట."

దొరికాడు. గొంతులో బాధ ఉంది. కూతురు ఎన్ని పాఠాలు చెప్పినా రక్తంలో జీర్ణించుకున్నవి ఎలా పోతాయి.? ఏ తండ్రికయినా పిల్లలు నువ్వు కర్తవి కాదంటే ఒప్పేసుకోడానికి యిదేమయినా ప్రాశ్చాత్యదేశమా? ఇనుమువేడి ఎక్కినప్పుడే సాగగొట్టాలి.

"బాధ పడకురా - పెళ్ళిఅవదన్న బెంగ. చిన్నతనం. అలాంటపుడే అన్ని రకాల పిచ్చులూ వస్తాయి. లేకపోతే - మన రక్తం పంచుకుపుట్టిన పిల్ల ఏంటి - అలాగా ఆడాళ్ళను వెంటేసుకుని సారా కొట్లమీద పడటమేంటి-? పేపర్లకేం పనుంది -? ప్రతిదీ అబ్బరమే - న్యూసే! ఫోటోలు తీస్తారు. వేస్తారు. దానితో అవుతుందా? కుటుంబానికి ఎంత అప్రదిష్ట. నేనే కట్నం గిట్నం యిచ్చి పెళ్ళి చేస్తానంటే - నువ్వది నమ్మేలా చెపితే ఎగిరిగంతేస్తుంది - వెళ్ళి, చెప్పు."

అంతా విన్నాడు. మాట్లాడలేదు.

"ఏమంటావ్."

"నేనేమీ చెప్పను. నీకన్నా, నాకన్నా మన పిల్లలు తెలివయినవాళ్ళు. వాళ్ళ మంచి చెడ్డలు వాళ్ళకే బాగా తెలుసు."

పేలిపోయాను.

"అవునవును బాగా తెలుసు. ఎందుకు తెలియదు. నిన్నటి దాకా మగాళ్ళ పెత్తనం పనికిరాదని గెంతారు. ఈ రోజు సారావద్దు, గాడిద గుడ్డువద్దూ అంటూ పూనకం పట్టినట్టు ఆడుతున్నారు. రేపు ఈ ప్రభుత్వమే వద్దూ - ఈ సైన్యాలొద్దూ - ఈ సరిహద్దులొద్దూ - అంటారు. ఏ కొండల్లోనో దిక్కులేని చావు చస్తారు. అప్పుడు బాగా తెలుస్తుంది."

నా మాటలింకా పూర్తవలేదు.

"ఎవరి కర్మకి వాళ్ళే కర్తలు" అనేసి వెళ్ళిపోయాడు.

"పద! యింటికిపోనీ" అంటూ డ్రైవర్ని కసిరాను.

కారు వెనక్కి తిరిగింది.

ఎవరి కర్మకి వాళ్ళు కర్తలుట.

ఏమిటి వాడి ముదలకింపు? నేను చేసుకున్నదానివల్ల నా కూతురు యిలా తయారయిందనా?

తన కూతురు తన చెయ్యి జారిపోయిందని ఏడుపా? మెట్టవేదాంతమా!

సూరీడుతో జరిగినది చెప్పలేదు.

నేను చెప్పకపోతేనేం? వాళ్ళేలాగా చెపుతారు. అందుకే ఆ లోకువ నవ్వులు. దాన్ని అలా తయారుచేసి, నావాళ్ళే నామీద కసి తీర్చుకున్నారు. తెలుసు. నేనేం జెయ్యాలని ఆలోచిస్తూనే ఉన్నాను.

సూరీడు ఇచ్ఛారాజ్యంగా తిరుగుతోంది. సారా వ్యతిరేకోద్యమం గురించి పేపర్లు తెగరాస్తున్నాయి. ఇదంతా నిజమనుకునేపాటి తెలివితక్కువ వాళ్ళు లేరు. స్వతంత్రోద్యమమూ, ఆ ఊపు, ఆ గోలంతా వేరు. ఆ తరువాత అన్నీ పేపర్లమాయే. పదిమంది జనాన్ని కూర్చోబెట్టి, లక్షమందిగా ఫోటో తీయగలరు. పాతికమంది కూడితే, పాతికలక్షల మంది అని నమ్మించగలరు. సారాట. వ్యతిరేకంట. ఉద్యమంట. ఏమయితేనేం ఆ శనిగ్రహంతో చేరి నా బంగారం లాంటి కూతురు ఎక్కడెక్కడికో వెళ్తోంది. వివరంగా తెల్సుకోవాలంటే - తండ్రిని గదా - భయంతో గుండె పిడచకట్టుకుపోతోంది. మా సర్కిల్స్‌లో కూడా నర్మగర్భంగా ఏవో అంటూనే ఉన్నారు. నిజమే ఇలా పదిమందిని పోగేసి తిరుగు తూండేవాళ్ళకు రెండుప్రమాదాలు. పోలీసులతో ఫరవాలేదు. ఏలాగోలా నప్పించవచ్చు. ఫలానీవాడి కూతురని గుర్తుంచుకుంటారు. పాపం - అంతేసి డబ్బుపోసి, పాటలు పాడి, సారా వ్యాపారం చేసేవాళ్ళకు లక్షాతొంభై తలనొప్పులు. అవన్నీ ఓ పక్క అలా ఉంటే, మొదటికే మోసం తెస్తామని యీ ఆడపీనుగులు తైతక్కలాడితే వాళ్ళకు ఎంత బాధ! ఎవరయినా ఏం చేస్తారు. తప్పనప్పుడు తప్పించేస్తారు. నేనయినా అంతే. నువ్వయినా అంతే. ప్రాణ రక్షణకోసం ఏ జంతువయినా అదే జేస్తుంది. వాళ్ళు ఆ పని చేస్తారేమో - నా బిడ్డ నాకు కాకుండా పోతుందేమోనని భయం. భయం.

అన్నింటికీ నువ్వే కర్తవి. నువ్వే భర్తవి. నేను సామాన్యుడిని. నాకు అంత త్యాగబుద్ధి లేదు. ఈ ఉద్యమానికి బలి తప్పకపోతే - నా తమ్ముడి కూతుర్ని తీసుకో. వందలూ, వేలూ చీమల్లాంటి ఆడవాళ్ళున్నారు. వాళ్ళందర్నీ బలితీసుకో. నా కూతుర్ని మాత్రం రక్షించు' - అంటూ భగవంతుడిని ప్రార్థించాను. డాక్టర్ చెప్పిన లిమిట్స్ దాటి తాగాను.

నిజంగానే నమ్మిన వాళ్ళను భగవంతుడు దగా చెయ్యడు. పరిశుద్ధ హృదయంతో ప్రార్థిస్తే తప్పక మన్నిస్తాడు. సారా కాంట్రాక్టర్ల మనసులలో దూరాడు. సూరీడుమీద ఈగ వాలనివ్వలేదు. మాలతికి కూడా ఏమీ అవలేదు. - అంతటితో అయిందా - ఈ ఆడాళ్ళగోల ప్రభుత్వాన్ని కదిపేసింది. సారా నిషేధించారు. మా అమ్మాయి గురించి అందరూ గొప్పగా చెప్పుకుంటున్నారు. అఫ్‌కోర్సు - మాలతిలాంటి వాళ్ళకి కూడా అంతోయింతో గుర్తింపు వచ్చింది.

భగవంతుడు ఎంత దయామయుడు!

ఇంతకాలం అందరూ మా సూరీడు గురించి నా వెనుక సణుక్కునేవారు. పిల్లల్ని అదుపులో పెట్టుకోలేనివాడు 'వీడేం పెద్దమనిషి?' అన్నట్లుండేవారు. అలాంటి వాళ్ళను భగవంతుడు ఎంత మార్చాడు. అందరూ నన్ను అభినందిస్తున్నారు.

అయినా నాకు సంతోషమేం లేదు. పిల్లకి ఆపద రాలేదన్నదొకటే సంతోషం. అంతకుమించి అది నన్ను తోసిపారేసిందని, తన జీవితాన్ని తగలేసుకుంటోందని, అందరిలాగా ఉండటంలేదని, లోలోపల ఉన్న బాధ ఎలా పోతుంది! నిద్ర ఎలా పడుతుంది.

దానికి కూడా ఆ సర్వశక్తిమంతుడు మార్గం చూపించాడు.

ఆ రోజు నా మిత్రులు నాకు ఒక సంతోషకరమైన వార్త చెప్పారు. మా సూరీడు సైగ చేస్తే చాలు నిప్పుల్లోకి ఉరికేస్తారట జనం. అటువంటి జనాకర్షణ ఉన్న ఫైర్‌బ్రాండ్‌లను ఏ రాజకీయపార్టీ వదులుతుంది. పదిమందిని తన్ని, వెయ్యి మందిని భయపెట్టగలిగే నేరస్తులనే ఎవరూ వదులుకోరు. ఏదోలా ప్రజలలో పేరు తెచ్చుకున్నవాళ్ళని ఎవరు వదులుకుంటారు. అందువల్ల మా అమ్మాయితోపాటు ప్లాట్‌ఫారం పంచుకోవాలని ప్రతీవాళ్ళూ ఫీలర్లు పంపుతున్నారట! ఇప్పుడు జాగ్రత్తగా ప్లాన్‌చేసుకుంటే మా అమ్మాయికి తిరుగులేదుట.

మా అమ్మాయి చెప్పకపోయినా వాళ్ళంటున్నది నిజమే అయుండాలి. అంటే మా అమ్మాయి దోవలో పడుతున్నదన్నమాట. ఎవరు మాత్రం ఆ టెంప్టేషన్ని తట్టుకోగలరు. ఆ తర్వాత దాని రోగాలన్నీ వాటంతట అవే కట్టేస్తాయి. పెళ్ళికేముంది ఎవరినోఒకరిని కట్టుకుంటుంది. ఏదో ఒకటవుతుంది. అలా ఉండిపోదుగదా! పెళ్ళి విషయంలో దాని బ్రతుకుకి నేను కర్తనని ఒప్పుకోక పోవచ్చు. ఇలాంటి ఆఫరేవస్తే దానంతట అది పరిష్కరించుకోగలదా?

ఆ మాత్రం, యీ మాత్రం నోరున్న వాళ్ళు రాజకీయాలలో ఎక్కడవేసిన గొంగళ్ళలా అక్కడ ఉండిపోరుకదా! మంత్రి ప్రమోషనూ రావొచ్చు. ముఖ్యమంత్రీ అవొచ్చు. ఉద్యోగంలో ప్రవేశించాలిగానీ, కెరీర్ నిర్మించుకోవటానికి ఎంత ప్రొఫెషనలిజమ్ కావాలి. అదంతా, వ్యాపారుల దగ్గరనుంచి నేర్చుకోకపోతే ఎక్కడనించి నేర్చుకుంటారు.

ఇన్నాళ్ళూ ఆ మాలతి దీన్ని నడిపింది. ఇప్పుడది నడపగలదా? అసలు యిద్దరూ కలిసినడవగలరా? భుజం భుజం కలిపి పెద్ద గొప్పగా పోరాటాలు చేసిన వాళ్ళే ఫలితాలు పంచుకోవటంలో పావలా డబ్బులు కోసం, కాస్తంత కీర్తికోసం విడిపోలేదా? వీళ్ళెంత! తప్పకుండా విడిపోతారు.

అలా విడిపోయిన రోజున, దానికి వాళ్ళ నాన్నే గతి. నా కూతురికి నేనేగతి! కల్యాణ వేదికమీద నన్ను కర్తగా తిరస్కరించినా, ప్రజావేదిక మీద నేను కర్త కాకుండా ఎలా ఉంటాను. మెట్లు ఎక్కటంలో నా చెయ్యి పట్టుకోకపోతే, ఎవరి చెయ్యి పట్టుకుంటుంది. ఏదోరోజున. అది నిండు సభలో 'మా తండ్రిగారు నన్ను కన్నారు. పెంచారు. ఏ రోజునా అభివృద్ధికి అడ్డురాలేదు. నన్ను నడిపించారు. నిలబెట్టారు.' అనకుండా ఉంటుందా? ఆ మాట నేను విన్నా, మానినా లోకం వినకుండా ఉంటుందా?

అలా ఆ భగవంతుడు కారు చీకటిలో ఓ కాంతిరేఖని చూపి, నాకు నిద్రపట్టేలా చేసాడు.

*('ఆహ్వానం' మాసపత్రిక - జూన్, 1994)*

# నీహారీ

వరద గోదావరిలా పరుగెడుతోంది గోదావరి.

పట్టీపట్టని నిద్రలోంచి ట్రైంచూసాడు అప్పారావు. నాలుగు! కిందకి చూసాడు. వసీమ్‌కూడా నిద్రలేచినట్టున్నాడు. ఆవులిస్తున్నాడు.

"గుడ్ మార్నింగ్!"

"గుడ్ మార్నింగ్! నిద్రపట్టలేదా?"

"ఏం నిద్రండీ! ఒకటే కుదుపు. సౌండు! ఆ గురూని చూడండి! హాయిగా కుంభకర్ణుడిలా గుర్రు కొడుతున్నాడు... రైల్లో పడుకోటం ఓ పెద్ద ఆర్టను కుంటాను...."

వసీమ్ లేచి కూర్చున్నాడు. మధ్య బెర్తుని గొలుసుల్నించి తప్పించేసారు. బాగ్‌లోంచి కొత్త బ్రష్షూ పేస్టూ తీసుకున్నాడు అప్పారావు. వాటి కొత్తదనంచూసి తనకు అలవాటు లేదని కనిపెట్టేస్తాడని తువ్వాల్లో దాచేసి గబగబ నడిచాడు.

అప్పారావు బాత్రూం పూర్తి చేసుకు వచ్చేసరికి వసీమ్ ఓ రుమాలుని పరీక్షగా చూస్తున్నాడు. "-ఇది మీదేలా వుంది...." అంటూనేవున్నాడు. అప్పారావు లాక్కుంటున్నట్టుగా తీసుకున్నాడు. పారేసుకున్న అమూల్యవస్తువు దొరికించుకున్న ఫీలింగు. చిరుసిగ్గు.

"ఏంటి సార్! అంత షరమైపోతున్నారు! ఏమైనా లవ్ స్టోరీయా..!"

బండెక్కే వరకూ ముక్కూమొహం తెలీని మనిషి ఒక్కమారుగా అలా అడిగేసరికి సిగ్గుసిగ్గయిపోయాడు అప్పారావు.

"ఒహోయిన స్టేషన్‌కి రావాలన్నాను గదా! వాళ్ళమ్మాయి లీల....! ఒక్కత్తే అమ్మాయి....! చిన్నప్పట్నించీ తెలుసు....! ప్రెజంట్ చేదామని మా చెల్లిచేత కుట్టించాను"

హుషారుగా నవ్వాడు వసీమ్.

"నిఖా అయిపోయిందా?"

"అంటే...!!?"

"అదే .... పెళ్ళి సెటిలయిందా?"

అప్పారావుమొహంలో మార్పుస్పష్టంగా కనిపిస్తోంది.

"ఇంకా లేదండిగురుగారూ...! ఇప్పుడు తేలిపోతుంది...."

అమాయకంగా వుంది ఆ మొహం. ఇరవయ్యేళ్ళ లేతదనాన్ని రెండేళ్ళ నిరుద్యోగ రాక్షసి ఫలహారిస్తున్న గుర్తులు.

వసీమ్‌ది కాస్త సునిశితబుద్ధి. ఇద్దరిదీ ఒక్కటే యీడు. ఒకటే బాచ్. పోతే అతనిది విశాఖ పోలిటెక్నిక్. అప్పారావుది శ్రీకాకుళం. వసీమ్ విద్యుత్ బోర్డ్‌లో యన్నెమ్మార్. అప్పారావు పల్లెటూళ్ళో తండ్రితోబాటు వుంటున్నాడు. ఈ వివరాలన్నీ ముందే చెప్పుకోవటంవల్ల అప్పారావు కాంప్లెక్స్ కొంత గ్రహించాడు.

"-మా బాబా చెప్తాడు! బేటా! అల్లాని నమ్మిన వాళ్ళకి అన్నీ ఆయనే చూసుకుంటాడు."

అప్పారావుకి నమ్మిక కుదిరినట్టు లేదు. గట్టిగా నిట్టూర్చాడు. బట్టలు మార్చుకున్నాడు. రుమాలుని భద్రంచేసాడు. వసీం తన కాలకృత్యాలు పూర్తిచేసుకు వచ్చేదాక ఆలోచన్లమీద ఆలోచన్లు...

'-లీల ఎలా వుంటుంది...?' అన్న ఆలోచనకన్న 'లీలతండ్రి ఎలా వుంటాడు' అన్న ఆలోచనే ఎక్కువగా వుంది. ఓ చిన్ని రుమాలు తనవేపు ఆ పిల్లను ఆకర్షించగలదా? ఆ రుమాల్లో .... తన హృదయాన్ని చూడగలదా? నిజంగా చూడగలిగితే - అందులో తన ప్రేమ కనిపిస్తుందా - తన అవసరం కనిపిస్తుందా-

అప్పారావుకంతా గాభరాగా దుఃఖంగా మోసంగా వ్యర్ధంగా....

"ఏంటి భాయ్! అంత గాఢంగా ఆలోచిస్తున్నారు....?"

బలవంతపు నవ్వు నవ్వాడు అప్పారావు.

వసీమ్ తన బెడ్డింగ్‌లోంచి తీసి, వేసుకుంటున్న దుస్తులవయిపు చూస్తూ వుండిపోయాడు. వాటిని షేర్వాణీ చుడీదార్ పైజామా అంటారని అతనికి తెలీదు. ఆ దుస్తులు వసీమ్ స్వంతంలా అనిపించలేదు అప్పారావుకి.

"-ఎలా ఉన్నానూ....?"

"ఆ మధ్యనే చూసిన పాత ఉర్దూ సిన్మాలా ఉన్నారు..."

"అయితే ఫర్లేదు" మా బాబా చెప్పాడు బేటా' బషీర్‌సాబ్‌కి సంప్రదాయం ఇష్టం. ఆయన నిన్ను మెచ్చుకున్నాడా - నీరొట్టి విరిగి నేతిలో పడ్డట్టే-"

"మనమిద్దరం ఇలా కలవటం, మాట్లాడుకోటం.... ఇదంతా చూస్తుంటే మన ఇద్దరికీ యింటర్వ్యూలో సెలక్షన్ వస్తుందని... నా సిక్స్‌సెన్స్ చెబుతోంది. వసీం!"

వసీం టోపి సర్దుకుని అతని పక్కనే చతికిలబడ్డాడు

"అప్పారావుగారూ! మీది చాలా మంచిమనసు..."

"అయ్యబాబోయ్! ఈ కాస్సేపట్లోనే కనిపెట్టేశారే...!"

"మా బాబా చెప్తాడు... బేటా! మంచిమనసున్న దోస్తుకి మించిన అదృష్టం లేదూ...."

"మీ బాబా బాగా చదువుకున్నారా?"

"ఉహూ! షిప్‌యార్డ్‌లో ఫైర్‌మాన్! ఆయన అంటారు - బేటా! ఉద్యోగం కోసం చదివే చదువ్వల్ల ఏమీ తెలీదు! అల్లాని నమ్మి అందరికీ ఉపకారంగా వుండే చదువు చదువుకో! అన్నీ అవే తెలుస్తాయీ..."

"ఎప్పుడయినా విశాఖపట్నం వచ్చి మీ నాన్నగార్ని కలుసుకోవాలి...."

"తప్పకుండా..."

ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

తోటి ప్రయాణీకులు ఒకరూ ఒకరూ లేస్తున్నారు. పక్కలు సర్దుకుంటున్నారు. రాత్రంతా గుర్రుకొట్టిన భారీమనిషి లేవక తప్పదన్నట్టు లేచివచ్చి కూర్చున్నాడు.

"-అబ్బాయ్! స్టేషన్ వస్తుంది! కాఫీవాడినీ పేపర్ వాడినీ పిలువ్!" అనేసి జవాబుకోసం చూడకుండా వెనక్కిజారబడి కళ్ళు మూసుకున్నాడు.

అసలెందుకు లేచాడో - లేచి మళ్ళీ ఏం చేస్తున్నాడో - చూస్తుంటే మిత్రులకి నవ్వు వచ్చింది. లావుశరీరంమీద ఓ జోకు చెప్పాడు వసీం. అప్పారావుకి నవ్వాగలేదు. వసీం జడిసినట్టు భారీమనిషికి నిద్రాభంగం అవలేదు.

గోదావరి సికిందరాబాద్‌లో ఆగింది.

దిగేవాళ్ళు దిగుతున్నారు. ఎదురొచ్చే వాళ్ళు పల్చగావున్నారు. కూలీలు సామాన్లతో వెయిటింగ్‌రూంలవైపు నడుస్తున్నారు.

కబుర్లలో వున్న మిత్రులమధ్య కాఫీ వెండర్ బాంబ్ పేల్చాడు.

"-తెలవదా సాబ్! రాత్‌సే కర్ఫ్యూ సాబ్!. పేపరు జర లేటొస్తది...."

భారీప్రాణి కాఫీతాగుతూ పేపరులేదన్న చిరాకుతో విసుగ్గాచూసాడు - "ఎప్పటిదాకా కర్ఫ్యూ...?"

"తెలువదూ సాబ్! నౌబజేకో లిఫ్ట్ చెయ్యొచ్చుసాబ్!"

అతను డబ్బులు తీసుకుని వెళ్ళేదాకా ఇద్దరూమాట్లాడలేదు బితుకుబితుకుమంటూ భారీమనిషివైపు చూసాడు వసీమ్.

"కర్ఫ్యూ అంటే ఏంటి సార్?"

అతను పళ్ళన్నీ బయటపడేలానవ్వుతూ-

"బయటకెల్లు! తెలుస్తుంది! కాల్చిపారేస్తారు..."

"ఎందుకూ....?" వణుకుతున్న గొంతుతో అన్నాడు అప్పారావు.

"కాల్చిముందు.... ఏదీ .... కాల్చేసే ముందు అడుగు! చెపుతార్లే!"

భారీమనిషి మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు. చేతిలో పవర్‌లేదుగాని, వుంటే ఫైర్ అంటూ అరవటానికి సిద్ధంగావున్న రాజకీయ నాయకుడిలా వున్నాడు.

కుర్రాళ్ళిద్దరూ బిక్కచచ్చిపోయారు.

"నన్ను చూసి కోపం వచ్చిందంటారా" తన దుస్తులకేసి చూపిస్తూ చెవిలో చెప్పినట్టు అన్నాడు వసీం.

"ఏమో!" అన్నట్టు పెదవి విరిచాడు అప్పారావు.

నాంపల్లిలో ఆగింది గోదావరి.

భారీమనిషి తాపీగా తన సామాన్లు సర్దుకుంటున్నాడు. అతన్ని తప్పించుకోవాలన్నట్టు యిద్దరూ గబగబా ప్లాట్‌ఫారం మీదకు దిగారు. బిక్కముహాలతో నిలబడ్డారు. వాళ్ళకోసం ఎవరూ రాలేదు.

ఎనిమిదయిందాకా ప్లాట్ ఫారం మీదే వున్నారు. తరువాత నెమ్మదిగాకదిలి స్టేషన్ ముందుకివచ్చారు. ఎక్కడ చూసినా జనం. కర్ఫ్యూ పాసులు తెచ్చుకోగలిగిన కొన్ని కార్లువచ్చి తమవాళ్ళని వేసుకుని వెళ్ళిపోతున్నాయి. ఎదురుగా కనిపిస్తున్న హైదరాబాద్‌వీధి నిర్మానుష్యంగా వుంది. కొందరు జవాన్లు చేతిలోతుపాకీలతో అక్కడక్కడ కనిపిస్తున్నారు.

ప్రయాణీకుల్లో కొందరు కాంటీన్లో వున్నారు. స్థానికుల తెలుగు యాస కొందరికి అర్థంకావటంలేదు. ఎక్కడ చూసినా కర్ఫ్యూ కబుర్లే! అంతమందిలో పలకరించటానికి, కర్తవ్యంగూర్చి సలహా తీసుకోటానికీ నమ్మదగ్గ మొహమే కనిపించటం లేదు వసీమ్‌అప్పారావులకి. ఒకరితోఒకరు మాట్లాడుకోటానికి కూడా అర్థంలేని భయం అడ్డుపడుతున్నట్టుంది.

"సాయంకాలం దాకా యిక్కడేవుండి - మళ్ళీ గోదావరి ఎక్కేస్తే బెటర్లాగుంది-" అన్నాడు అప్పారావు.

"యింతదూరం వచ్చాం! ఇంటర్వ్యూకి అటెండవకుండానా...?" వసీమ్ సందేహంగా.

ఇంతట్లో ఓ వాన్ కొందరు జర్నలిస్టులతో వచ్చి స్టేషన్‌ముందు ఆగింది! ఫోటో గ్రాఫర్ల ఫ్లాష్‌లక్లిక్ మంటున్నాయి! హఠాత్తుగా ఎదురయిన కర్ఫ్యూ అనుభవంమీదా, మతసామరస్యానికి పరిష్కార మార్గాలమీదా, మతకలహాలకు కారణాల మీద, విలేఖర్లు ప్రశ్నలువేస్తూ జవాబులు రికార్డ్ చేసుకుంటున్నారు.

ఓ విలేఖరి ఉర్దూలో ఏదో అన్నాడు. వసీమ్ జవాబీయలేకపోయాడు. వెంటనే తెలుగులోకి దిగిపోయాడు.

"హిందూ ముస్లిమ్ గొడవలు జరుగుతున్న ఈ టైంలో ఈ డ్రస్‌లో మీ ఫీలింగ్స్ ఏమిటి?"

అతని చేతిలోని మౌత్‌పీస్‌ని కంగారుగా చూస్తూ- "అంటే....!"

అతను సన్నగానవ్వి - "మీ ఐడెంటిటీ తెల్సిపోతూంది గదా! సెక్యూరుడ్‌గా ఫీలవుతున్నారా...?"

"ఏమోసార్! అంతాగాభరాగా వుంది. ఈ కర్ఫ్యూ ఎంతవరకూ ఉంటుందండీ?"

జవాబు రాబట్టేలా ప్రశ్న వేయటం నేర్చుకోవాల్సిన విలేఖరి జవాబీయలేనివాణ్ణి కలుసుకున్నట్టు మొహం పెట్టాడు.

"ఎవరూ చెప్పలేదా? తొమ్మిది నుంచి పదకొండుదాకా లిఫ్ట్ చేస్తారు...." మరే జవాబూ యివ్వరాదన్నట్టు గబగబా కదిలిపోయాడు.

మిత్రులు కొంచెం రిలీఫ్ ఫీలయారు.

టైం 8-15

"ఆ సమయంలో మనవాళ్ళు వస్తారంటారా వసీం!"

"చూద్దాం! ముందు కాస్త టిఫిన్ తిందాం పదండి.

టిఫిన్ పళ్ళాలతో ఓ బల్లముందు సెటిలయారు.

"- వీళ్ళు రాకపోతే-" అన్నాడు అప్పారావు మధ్యలో.

వసీం టిఫిన్ పూర్తయాదాకా మాట్లాడలేదు.

"కంగారుపడకండి అప్పారావుగారూ! ఒకరికి యిద్దరం ఉన్నాం! ఏదయినాకలిసే చేద్దాం! ఆలోచిద్దాం! ఇంతదూరం వచ్చాం! ఇంటర్వ్యూ మిస్సవడం తెలివైన పనికాదు."

తన భయం బహిరంగమయిపోయిందన్న కించ అప్పారావుకి కలగలేదు. తన కంగారు ఓ సరయిన వ్యక్తికి తెలిస్తే అతనే అన్నీ సరిచేస్తాడన్న ఫీలింగ్ కలిగింది.

"పేపరు వచ్చినట్టుంది - ఓ కాపి తెస్తాను..." వెళ్ళి తెచ్చాడు అప్పారావు.

కర్ఫ్యూవిశేషాలు ప్రముఖంగా ప్రచురించింది దినపత్రిక. నగరమంతటా కర్ఫ్యూ లేదు. సికిందరాబాద్‌లోకూడా చాలా ప్రాంతాలు కర్ఫ్యూలోవున్నా ఆల్వాల్‌లో లేదు. కర్ఫ్యూలేని కొన్ని ప్రాంతాల్లోకూడా కత్తిపోటు సంఘటనలు జరగటంతో నగరమంతటా కర్ఫ్యూ విస్తరించే అవకాశంవుంది. ఉదయం 9-11 గంటల మధ్య కర్ఫ్యూ సడలించారు.

పేపరు మడిచాడు అప్పారావు.

"ఆల్వాల్‌లో కర్ఫ్యూ లేదట...." అన్నాడు వసీం ఆలోచనగా.

"........."

"మనమంటే ఈవేళేవచ్చేసాం! చాలా మంది రేపుగాని రారు! ఈ కర్ఫ్యూ గొడవ పేపర్లో చూస్తే ఒక్కడు బయల్దేరడు-మనం ఇంటర్వ్యూకి అటెండయితే - చాలా ఛాన్సు వుంటుంది...." అన్నాడు వసీం మళ్ళీ.

అప్పారావుకి ఆ తర్కం నచ్చలేదు. పల్లెటూళ్ళో ఉంటూండటంవల్ల మరింత గాభరా అయిపోయాడు. బతికుంటే బలుసాకు ఏరుకు తినొచ్చుననిపిస్తోంది అతనికి.

"వీళ్ళు రాకపోతే - ఈ రోజంతా ఎక్కడ గడుపుదాం?"

"లాడ్జిలో....?!"

"లాడ్జిలోనే...."

"ఏముందీ.... ఒక్కరాత్రి. మళ్ళీరేపు యిదే టయింకి కర్ఫ్యూ సడలిస్తారనుకుంటాను! ఏదోలా ఇంటర్వ్యూకి వెళ్దాం. మన అదృష్టం బాగుందా - ఇంటర్వ్యూలో మనమే ఉంటాం - అక్కడ నుంచే డైరెక్టుగా స్టేషన్‌కి వచ్చేద్దాం! రేపు సాయంకాలం గోదావరిలో మనవూళ్ళకి బయల్దేరిపోతాం!...." వసీం మాటలూ ఆలోచనలూ ఆశావహంగా వున్నా అసంబద్ధంగా అవుపిస్తున్నాయి అప్పారావుకి.

"కర్ఫ్యూ ఎత్తకపోతే? కర్ఫ్యూ పేరు చెప్పి ఇంటర్వ్యూ చెయ్యకపోతే?"

వసీంకి జవాబు తోచలేదు.

"అప్పారావుగారూ! మా బాబా చెప్తాడు- అన్నింటికీ అల్లా వున్నాడూ...."

ఏమయినా అప్పారావుకి నచ్చలేదు. రకరకాల ప్రశ్నలు వేసాడు. వసీం నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. ఆఫీస్ వుంటుందా? ఇంటర్వ్యూ చేస్తారా? ఇంతకు ముందే ఆ ఖాళీలు భర్తీఅయిపోయివుండవా? ఇవి కళ్ళతుడుపు ఇంటర్వ్యూలుకావా....?

చిట్టచివరికి అసలు సందేహం బయటపెట్టాడు అప్పారావు.

వసీం స్నేహంగా నవ్వాడు.

"అప్పారావుగారూ! నా దగ్గరకూడా లాడ్జీకీ ఆటోలకీ ఖర్చు పెట్టేంత డబ్బుల్లేవుగాని... సర్దుకుంటే ఆ మాత్రం సరిపోకపోవు! అంతగా మీరు మొహమాటపడితే మీకు వీలయినపుడు పంపుదురుగాని...."

అప్పారావు కళ్ళు తడిదేరాయి.

నిన్నటిదాకా అతనెవరోతెలీదు. ఈరోజు అతన్నించి అంత స్నేహపూరితమయిన మాట....! అతని ఊహకే అందదది.

పదయిందాకా వాళ్ళు బంధువుల కోసం చూసారు.

జనం ఆటోలలోనూ టాక్సీలలోనూ కదిలిపోయారు. సిటీబస్సులులేవు. ఇద్దరూ రోడ్డుమీదకివచ్చి ఓ లాడ్జిలో రూం తీసుకున్నారు.

ఇద్దరూ కలిసి డబ్బులు లెక్కవేసారు. భోజనానికి సరిపోయేట్టు కనిపించలేదు. రాత్రికి తిందామనుకున్నారు. రొట్టెలుతెచ్చుకున్నారు.

పదకొండవుతోంది.

జవాన్లు జనాన్ని అదుపుచేయటం మొదలెట్టారు.

కిటికీ ఊచల్లోంచి కనిపిస్తున్న నాంపల్లి - బిడ్డల్ని కొట్టులోపెట్టి మానభంగం చేయబడుతున్న తల్లిలా-వుంది.

జనసంచారంలేని నగరం విధవరాలిలా వుంది.

ఖాళీరోడ్లమీద తిరుగుతున్న జవాన్లు ఆమె కారుస్తున్న కన్నీటిధారల్లా వున్నారు.

మిత్రులిద్దరూ రొట్టెతిని మంచినీళ్ళు తాగి పడుకున్నారు.

రాత్రంతా లేని నిద్ర కళ్ళమీదకు కాపురానికి వచ్చింది.

ప్రపంచం యింకా ట్రైన్లో ఊగుతున్నట్లేవుంది. ఆకస్మాత్తుగా అప్పారావుకి మెలకువ వచ్చింది.

లీలను పెళ్ళాడతానన్నాట్ట! తుపాకీ పుచ్చుకుని వెంటబడిన కలలోని లీల తండ్రి ఎదురుగా కనిపించలేదు. తుపాకీ చప్పుడు వినిపించలేదు. ఇంకా గుండెదడ తగ్గలేదు. అప్పారావు ఆ పట్టపగలు ఏకాంతంలో కాల్తూన్నకడుపులో కాసిన్ని మంచి నీళ్ళు చేర్చాడు. తిరిగివచ్చి, వసీమ్ పక్కనే పడుకున్నాడు. నిద్దట్లో అతనికి దగ్గరగా జరిగి చేయివేస్తాడు.

ముక్క కంపు కొడుతున్న ఆ గది మునగదీసుకుంది.

## 2

ఆ రోజు తొమ్మిదినుండి మూడువరకూ కర్ఫ్యూ సడలించారు.

మిత్రులిద్దరూ లాడ్జి ఖాళీ చేసారు. ఆటోలో ఆల్వాల్ వయిపు కదిలారు. అంతగా జనసమ్మర్దంలేని వీధులూ, అడపాదడపా కనిపించే గస్తీవాహనాలూ, విశాలమయిన ఉస్మాన్‌సాగర్ చెరువుగట్టూ, అందుమీంచి కనిపిస్తున్న నీటిని తాగుతున్న నగరం.

ఆటో వాళ్ళని విడిచి ముందుకుసాగింది.

సెక్యూరిటీ ఆఫీసర్‌వాళ్ళ ఇంటర్వ్యూ కాగితాలు తనిఖీచేసాడు. వాళ్ళ సామాను పెట్టుకోడానికి స్థలంచూపాడు, ఓ మనిషిని యిచ్చి లోపలకు పంపాడు.

విశాలమయిన హాలు, సోఫాలు. అప్పటికే మరో ఆరుగురు వున్నారు. యింత సాహసంచేసి తాముతప్ప మరెవరూ హాజరవరనుకున్న వసీం మోహం చిన్నబోయింది. వాళ్ళలో నలుగురు ఓచోట చేరి ఏవోకబుర్లు చెప్పుకుంటున్నారు. చూస్తుంటే వాళ్ళు ఒకే పాలిటెక్నిక్ వాళ్ళు అనిపిస్తోంది. అంటే ఈమధ్యనే

పాసయినవాళ్ళు. సబ్జక్ట్‌తో యింకా బాగా పరి యంపున వాళ్ళు. వసీం ఆలోచనలు రకరకాలుగా సాగుతున్నాయి.

రాత్రంతా అప్పారావు పుస్తకాలముందే వున్నాడు. వసీమ్‌ని లేపుతూ వుండేవాడు. అతను ఇంటర్వ్యూలకూ చదువులకూ సంబంధంలేదని వాదించే మనిషి. పైగా అప్పారావుకి అదే మొదటి ఇంటర్వ్యూ.

అప్పారావు పుస్తకంతెరిచి బట్టీ మొదలు పెట్టాడు.

వసీం విషయసేకరణలోకి దిగాడు.

పావుగంటలోనే తిరిగివచ్చాడు -

"గురూ! మన యిద్దరకీ సెలక్షన్‌ష్యూర్" అన్నాడు ఉషారుగా.

"ఎలా తెలిసింది వసీం...."

"మనమిద్దరమే డిప్లమా. ఉన్న పోస్టులు మూడు..."

"నిజంగానా...!!!" అప్పారావు కళ్ళు పెద్దవయాయి.

"ప్రామిన్! రహీం - అని - పర్సనల్ సెక్షన్‌లో ఉన్నారు. ఆయన స్వయంగా చెప్పాడు. పోతే - ఆఫీసర్ చాలా స్ట్రిక్టు. పార్సీ. రికమండేషన్ అంటే మండిపడతాడు. ప్యూర్లీ మెరిట్...."

అప్పారావు దిగాలుగా చూసాడు.

"నేనేమయినా చెప్పగలనా....? చాలా గాభరాగా వుంది...."

వసీం అతని చేయి నొక్కాడు.

"డోంట్ వర్రీ! అంతా మనమనుకున్నట్టే అవుతుంది! మీరు బాగా ఆన్సర్ చేస్తారు. నాకా నమ్మకం వుంది. చదువుతూండండి! మరో రౌండ్ వేసొస్తాను."

ఫారడేన్ లా, కిర్చీఫ్స్ లా బట్టీయం మొదలుపెట్టాడు అప్పారావు. అంతలోనే అతన్ని ఆలోచనలు దొలుస్తున్నాయి.

"నిజంగా మూడు పోస్టులా...."

ఒక్కటే పోస్ట్....అయితే....? వసీం గద్దలా తన్నుకుపోతాడు. రహీం - అంటున్నాడు. వాళ్ళకి వాళ్ళు చేసేసుకొంటారేమో! హిందువులకే ఒకరంటే ఒకరికి పడదు! ఒకడు ఒకడికి సాయంచేయడు!- చచ్చు! అలా జరగదు. ఆఫీసర్ పార్సీ. అంటే ఇంగ్లీషువాడా...? ఏమో! తురకతను మాత్రం అయుండడు! తనకు ఇంగ్లీషులో మాటలాడటం రాదు. ఎలా జవాబు చెప్తాడు....? ఆఫీసర్ తెలివయినవాడయితే కాండేటు ఇంగ్లీషు గూర్చి ఆలోచించడు. ఎలా పనిచేస్తాడో పసిగట్టాలి. అయినా ఏది ఎలా రాసిపెట్టి వుంటే అది అలాగే జరుగుతుంది. ఎంత ప్రాప్తమో అంతే!

అప్పారావుకి తండ్రి గుర్తువస్తున్నాడు.

చదువుకుంటాడు. ఆదుకుంటాడు - అనేగదా అష్టకష్టాలుపడి ఘంత

వరకూ తీసుకువచ్చాడు. చదువంటే - తన ప్రయత్నంలో వుందిగాని వుద్యోగం...?

అతను చదువుతున్నాడేగాని వసీం కదలికలు గమనిస్తూనే వున్నాడు

విద్యుత్ బోర్డులో పనికావడంవల్ల పబ్లిక్‌తో డీల్ చేయటం తెలిసి పోయినట్టుంది. వసీంకి - చకచకా మాటలు కలిపేస్తున్నాడు. ఎవరినో-వెంటబెట్టుకుని బయటకు వెళ్ళాడు.

అతను చదవకపోటం, ధీమా, చురుకుతనం - చూస్తుంటే అప్పారావుకి మరింత దిగులు పెరుగుతోంది.

ఇంటర్వ్యూలు మొదలయాయి.

అప్పారావు నాలుగో అభ్యర్థి.

ఈలోగా వసీమ్ వచ్చాడు. వేరేగా ఓ సోఫాలోకూర్చున్నాడు. అప్పారావు రమ్మన్నట్టు సైగచేసాడు. వసీమ్‌నించి రెస్పాన్స్ లేదు. తన చదువులో ఆలోచనల్లో ఉన్న అప్పారావుకి అతని వర్తన కొంతవింతగా అనిపించినా అంతగా పట్టలేదు.

అప్పారావు ఇంటర్వ్యూ మొదలయింది. దాదాపు ముప్పయి నిముషాలు జరిగింది. అతను అనుకున్నట్టే సబ్జక్టుమీదే నడిచింది. ముందు గాభరాపడినా ఆఫీసర్ ప్రోత్సహించాడు. అతను తనను ఫేవర్ చేస్తున్నాడని పించేసరికి అప్పారావు కాస్త నిబ్బరంగా ఆన్సర్ చేసాడు.

-మీ సెలక్షన్ విషయం వారం పదిరోజుల్లో తెలియబరుస్తాం" అన్నాడు ఆఫీసర్ అఖర్న.

అప్పారావే గొప్ప హోప్‌తో బయటకు వచ్చాడు.

వసీం అతన్ని సమీపించలేదు. అప్పారావు గబగబా అతనిదగ్గరచేరాడు.

"చాలా బాగా చేసాను వసీం!" అన్నాడు.

"ఊఁ...!"

"మీరూ బాగాచేయాలి. చేస్తారు...." ఉత్సాహంగా అన్నాడు.

లోపలికి వెళ్ళిన అభ్యర్థి వెంటనే వచ్చేసాడు. వసీంకి ముందు యిద్దరున్నారు. అప్పారావు తన ఇంటర్వ్యూ వివరాలు చెప్పబోయాడు.

"బండికి టయిమవుతుందేమో! తొందరగా బయల్దేరండి..." అన్నాడు వసీం చిరాగ్గానూ హఠాత్తుగానూ.

"బలేవారే! ఇద్దరం కలిసి వచ్చాం! కలిసేపోదాం!"

"లేదు లేదు!... నేను.... కొంచెం పనుంది! మా బషీర్‌సాబ్‌ని కలవాలి...." తడబడుతూ అన్నాడు.

అప్పారావు ఆశ్చర్యపోయాడు.

"అదేంటి? ఇద్దరం కలిసిపోదామనుకున్నాం....!!"

వసీమ్ అక్కడనించి లేచిపోయాడు.

అతనిలోమార్పు అప్పటికి అర్థమైంది. కారణం అందలేదు. అతన్ని వదిలేసి పోబుద్ధికాలేదు. ఇంటర్వ్యూకిముందు అతని దృష్టిని పాడుచెయ్యరాదని నిశ్చయించుకున్నాడు అప్పారావు.

అప్పారావు హాలుబయటకు వచ్చాడు. ఓ ఫ్యూన్ అతన్ని పలకరించాడు. పేరు నర్సింహ్లు. ఆ తెలుగు అర్థమవటంలేదు అప్పారావుకి.

"ఒక్కటే ఖాళీయా...."

"గట్లపోతన్నడు... ఆ సాబ్‌కి పకడో సాబ్!"

అప్పారావు గుండె దడదడలాడింది. తనని ఎవరూ చూడటంలేదు. ఫ్యూన్ చూపించిన వ్యక్తి వెనకపడ్డాడు.

"నమస్కారం సార్!"

నల్లగా వెంకటేశ్వర విగ్రహంలావున్నాడామనిషి. నుదుటిమీద చాదు చుక్క. కిళ్ళీతో గారపట్టిన పళ్ళు. అతను అప్పారావుని నఖశిఖపర్యంతం ఓమారుచూసాడు కాంటీన్‌లోవున్న ఓ టేబిల్ ముందు కూర్చున్నాడు. జనం టిఫిన్‌ప్లేట్లు తెచ్చుకుంటున్నారు.

"ఇంటర్వ్యూకి వచ్చావా...?"

"అవున్సార్!"

"పేరేవిటి?"

"అప్పారావండి!"

"అప్పారా...వ్! అప్పారావ్! ఓ నీ పేరు అప్పారావుకదూ!... సరే! వెళ్ళి- దోసె ఓ పూరీ ఓ వడ తీసుకురా!"

అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు అప్పారావు.

అతని చేతిలో పళ్ళాలు అందుకున్నాడు గుమస్తా.

"టీ తర్వాత తేవచ్చు! మంచినీళ్ళు...." వడప్లేటు పూర్తయాక అన్నాడు.

"ఏం చదివావు నువ్వూ....?"

"డిప్లమా.... సార్!"

"ఓ....నువ్వేనేంటి అప్పారావు... ఫర్లేదు! కూర్చో!"

పలకరించిన ఓ డాంగ్రీ కార్మికుడికి సమాధానం చెప్పి, మళ్ళీ అప్పారావువయిపు తిరిగాడు నోరు పెద్దగాచేసి పచ్చడివేళ్ళని నాకేసి-

"లాభంలేదయ్యా! ఏవీ....లాభంలేదు"

"ఏంటి సార్..."

కాస్తముందుకువంగి - "అయిదొందలు ఏం?" కన్ను అదోలాకదుపుతూ అన్నాడు.

"వెంటనే అంటే.... యివ్వటం కష్టం సార్...మీరు ఆ! ఆ! రేపు సాయంకాలంలోగా.... అయితే...." గుసగుసలాడుతున్నట్టు అన్నాడు. ఉద్యోగ నియామక పత్రాన్ని అందుకోబోతున్నట్టేవుంది అతనికి. ఆ కుర్రాడి కళ్ళలో తన జేబులోని ప్రేమరుమాలూ.....లీల.....ఆమె నాన్నగారూ కదిలారు.

"ఇంటర్వ్యూకి వస్తున్నప్పుడు... డబ్బులుతెచ్చుకోవాలనికూడా తెలీదా నీకు" కోపంగా అన్నట్టు అన్నాడు.

భయంగా చూసాడు అప్పారావు.

"ఏం చదివావు నువ్వు....?"

"డిప్లమా సార్!"

"ఏవిటి నీ పేరు...?"

"అప్పారావు సార్!"

"ఇదేనయ్యా! మనలో మనం చేసుకుందామన్నా... మనకి బతికే తెలివిలేదు! వెళ్ళి టీ పట్రా!"

టీ సిప్‌చేసి అన్నాడు

"ఒక్కటే పోస్ట్! తెలుసా...."

"తెలీదు సార్!"

"యిప్పుడు చెపుతున్నానుగదా...తెలుసుకో! మ్యానేజ్ చేయిద్దామంటే నీదగ్గరేం లేదంటున్నావ్...సర్లే! ఇద్దరే క్వాలిఫైడ్ వాళ్ళున్నారు.... ఎవడో ఒకడిని తీసుకుంటాడులే!"

టీ గ్లాస్ వదిలి లేచాడు. ఇద్దరూ నడుస్తున్నారు.

"సార్! డబ్బులు తెచ్చుకుంటే నిజంగా పనవుతుందంటారా?"

అతను ఒక్కమారుగా ఆగి పెద్దగా అన్నాడు.

"వాడ్డూయూమీన్! ఎవడితో మాట్లాడుతున్నావో తెల్సా....?"

తెలియదనటానికి ధైర్యంచాల్లేదు అప్పారావుకి. జీవితంలో ఈ ఒక్కసాహసమో, తప్పో చేసేస్తేచాలు! బ్రతుకు సెటిలయిపోయినట్టే. యింక వెనక్కి చూడనక్కరలేదు. గొప్ప పట్టుదలగా వుంది.

"సార్! ఈ ఒక్కరోజూ ఆగండి! రేపు...ఏదోలా ప్రయత్నిస్తాను"

అతను 'సర్లే' అన్నట్టు చూసి-

"రేపు చార్మినార్ క్రాస్‌రోడ్స్ దగ్గర రహామియా కాంటీన్‌లో ఆరుగంటలకి కలవు! అక్కడ కర్ఫ్యూ లేదులే!"

"అలాగేసార్ థాంక్యూసార్! థ్యాంక్యూ"

ఆఫీస్ గేట్ దగ్గర వదిలిన బాగ్ అందుకున్నాడు అప్పారావు. వసీం కూడా అక్కడే వున్నాడు.

కలిసివచ్చిన వాళ్ళిద్దరూ విడివిడిగా బయటకు నడిచారు.

మూపుల మీద బరువులు.

మనసుల మీద ఆలోచనలు కరువులు.

కడుపుల్లో ఆకలి అరుపులు.

మధ్యాహ్నం ఒంటిగంట ఎండ ఇద్దర్నీ సమానంగా కాలుస్తోంది.

జీవితావసరం యి    సమానంగా చీలుస్తోంది.

## 3

మెయిన్‌రోడ్ రెండుకిలోమీటర్లదూరంలో వుంది.

పది నిమిషాలసేపు చూసారు. ఆటోలేదు. రిక్షాలేదు. నిర్మానుష్యంగా పాడవుగా కన్పిస్తోంది సిమెంట్‌రోడ్. రోడ్‌కి అటూ ఇటూ చెట్లు లేవు. కొంచెం దూరంలో ఓ టీ దుకాణం వుంది.

వసీమ్ ముందు కదిలాడు.

అప్పారావు అనుసరించాడు.

ఇద్దరూ చెరోబల్లా ఆక్రమించారు. టీ! దుకాణంలో ముగ్గురే వున్నారు. అప్పారావుకి రొట్టె సహించలేదు.

బాగ్‌లోంచి పేపరుతీసాడు.

అందులో హత్యలు జరుగుతున్న వైనంవుంది. బేరాలకోసం నించున్న ఓ రిక్షా వాడిని పొడిచేసారు. అగరొత్తుల కోసం వచ్చిన ఓ పన్నెండేళ్ళ కుర్రాడిని పొడిచేసారు. పాలు అమ్ముకోడానికి వెళుతున్న ఓ ముసిలమ్మను పొడిచేశారు. స్కూటర్‌మీద ఇద్దరు వస్తున్నారు. ఒకడు డ్రైవ్‌చేస్తున్నాడు. ,మరొకడు కత్తిపట్టుకుంటున్నాడు. సెకన్లలో పనిపూర్తిచేసుకుని మాయమవుతున్నారు.

అకస్మాత్తుగా అప్పారావు బుర్రలోకి ఓ ఆలోచన జొరబడింది.

నిజంగా దేముడే వుంటే - ఆయనకి తనమీద దయే వుంటే - లీల నాన్నగారే తనకి డబ్బివ్వాలా....! ఈ వసీంని ఎవరయినా పొడిచెయ్యరాదూ!- తను ఒక్కడే క్వాలిఫైడ్ కాండేట్!

అదో మెరుపు! వెంటనే దాన్ని మెదడులోంచి నెట్టెయ్యటానికి ప్రయత్నించాడు అప్పారావు. అది అతనికి సాధ్యపడటంలేదు

లేపోతే తనలాంటి వాడికి ఉద్యోగం ఎలా వస్తుంది? ఈ దేశంలో తనలాంటి వాళ్ళు ఉద్యోగాలకోసం యిన్ని బాధలు పడటాన్కి కారణం ఏమిటి? వసీంలాంటి పైవాళ్ళు కాదా?-

జబ్బుపట్టిన ఆలోచనల మబ్బులు ఆ కుర్రవాడిని చుట్టుముడుతున్నాయి. సరయిన ఆలోచనలిచ్చే పెద్దరికమే కరువయినపుడు ఆవేశంలోని కుర్రకారు

ఎటుపోతుంది!

వసీంకూడా అలాంటి ఆలోచనలలోనే ఉన్నాడు.

ఉన్నదొకటే పోస్టు అని తెలిసాక అతనికీ అప్పారావు మీద శత్రుభావన మొదలయింది. ఇంటికిపోతాను మొర్రో-అంటున్న వాడిని ఎందుకు అపానా అన్న చికాకు, పశ్చాత్తాపం, అతనిలో.

నిర్మానుష్యమయిన రోడ్లు... పేపర్లలో వార్తలు... అతని మెదడులోకూడా అప్పారావుకి ఏదయినా జరిగితే బాగుండునన్న ఊహను కల్గిస్తున్నాయి. తన సెలక్షన్‌కి ఢోకా వుండదుగదా అనిపిస్తోంది.

ఆ పంథొమ్మిదివరవయ్యేళ్ళ లేత మనసులమీద ఆ ఆలోచనలు ముసురు కుంటున్నాయేకాని అవి గాఢంగాలేవు.

అలాంటి ఆలోచనలు వస్తున్నందుకు - ముక్కూ మొహం తెలీని మనుషులపట్ల అకారణవైరభావనకూ - ఏదో మూరుమూల దుఃఖం.

తొందరగా ఏ ఆటోయో దొరికితే బాగుండును! స్టేషన్‌కి చేరుకొంటే ఈ పరిస్థితి నుంచి.... ఈ ఆలోచన్ల నుంచి.... దూరంగా.

దుకాణంలోంచి బయటకువచ్చారు.

వేగంగా నడుస్తున్నారు. అలుపువస్తోంది. ఎండ కసిగా కాస్తోంది.

దూరంగా చుక్కలా కనిపిస్తూంది. శబ్దం వినిపిస్తోంది. దూరంనుంచి. స్కూటరో మోటార్ సైకిలో తెలీటంలేదు. ఎదరగా వస్తోంది.

ఇద్దరి గుండెలూ వేగంగా కొట్టుకొంటున్నాయి.

స్కూటరే! అది... మృత్యు వాహనం కాదుగదా...!!!

శరీరాలమీద వెంట్రుకలు నిక్కబొడుచుకుంటున్నాయి. అదిహింధువుల స్కూటరా? ముస్లిములదా?

ఇద్దరు ఉన్నారు.

చాలా వేగంగా.... వేగంగా...సమీపంగా.....

దూసుకుని వస్తోంది.

చెవులు బద్దలు చేస్తున్నట్టుంది శబ్దం.

కట్టేసినట్టయిపోయాయి కాళ్ళు. పరిగెత్తాలన్న ఆలోచనకూడా పరుగెత్తుకురాట లేదు.

మరింత దగ్గరగా....

హారన్ బయ్యిమంటూ దూసుకుపోయింది.

భయంతో మూతబడ్డ కళ్ళు విడాయి. ఇద్దరూ రోడ్డుకి ఓ వేపు వున్నారు. చాలా దగ్గరగా వున్నారు.

అది మృత్యువాహనం కాదు. మామ్మూలు స్కూటర్!

భయం తొలగిపోయింది.

ఇద్దరూ ఒకరివెనక ఒకరు నడుస్తున్నారు. తమ మలినభావాలు ఎదుటివాళ్ళకు తెలిసిపోయాయా అన్న కించ. ఎలా పలకరించుకోటం?

వెనకనుంచి వాళ్ళ ఆలోచనలు చీల్చుకుంటూ మోటార్ సైకిల్ శబ్దం. అప్పారావు హఠాత్తుగా వెనక్కితిరిగాడు.

ఒక్క అంగ దూరంలో తలవంచుకుని ఏ ఆలోచనలోనో మునిగివున్న వసీం.

అతనికి నాలుగు గజాల దూరంలో జావాబండి!

ఎండకాంతిలో వెనకసీటు చేతిలో తళతళ మెరుస్తున్న కత్తి....

నాలుగు గజాల దూరం లిప్తపాటులో మాయం!

"వసీమ్!" బిగ్గరగా అరుస్తూ అప్పారావు అతన్ని చుట్టేసి పక్కకి లాగెయ్యబోయాడు.

వీపుకి గురిచూసిన ఆయుధం మోచేతిని గీసుకుంటూపోయింది. మోటర్ సైకిల్ దూసుకుంటూపోయింది.

పచ్చటి లేత చెయ్యిమీద ఎర్రటి గీత! ఒక్కమారుగా రక్తం! రక్తం! అప్పారావు చేతిమీదుగా....

అప్పారావు గుండెల్లోని మలిన భావాలను కడిగేస్తూ.... కళ్ళల్లో కన్నీటిని బయటకి రప్పిస్తూ....

బాధ భరించటానికి వసీం చేస్తున్న ప్రయత్నానికి గుర్తుగా అడుగుపెదవి పళ్ళకింద గిలగిల తన్నుకొంటోంది.

సూర్యుడి కిరణాలకు ఎరుపు పులుముతున్న మానవరక్తం!

మంచి మార్పుకోసం పోరాడాల్సిన రక్తం.....

అప్పారావు తన ప్రేమ నిండిన జేబు రుమాలుతో బలంగా కట్టుకట్టాడు.

మనిషి మనిషి కోసం కార్చే కన్నీరు ఇద్దరి కళ్ళల్లో.

వసీం బాధతో గిలిగిలలాడుతున్నాడు.

"కొంచెం ఓర్చుకో వసీం....! మనం రోడ్డుకు చేరుకుంటే ఏదో ఒకటి దొరుకుతుంది. హాస్పిటల్‌కి పోదాం....!"

యిద్దరూ నడుస్తున్నారు. బరువంతా అప్పారావు మీద వేసాడు వసీం.

హఠాత్తుగా అన్నాడు అప్పారావు.

"వాళ్ళెవరంటావ్....?"

వసీం బలవంతంగా నవ్వబోయాడు.

చంపబోయినదెవరు? హిందువా? ముస్లిమా....?

చంపబోయిందెవరిని? హిందువునా? ముస్లిమ్‌నా?

హిందువూ కాదు? ముస్లిమూ కాదు! చంపబోయినది ఓ మనిషి! చంపబోయినది ఓ మనిషిని.

అతనికి కావల్సినది ఓ మనిషి చావు! ఆ హతుడు ఓ హిందూ అయితే లక్షమంది హిందువుల హృదయాలు భగ్గుమనటం! అదే ఓ ముస్లిం అయితే లక్షమంది ముస్లింల మనసులు విషపూరితమవటం! రెండులక్షల చేతులు కత్తులు దూయటం! ఒకరినొకరు నరుక్కోవటం! తమ సామూహిక అవసరాలను మరిచిపోవటం! ఆ అవసరాలు తీరుస్తామన్న వాగ్దానాల ముసుగులో తమ వ్యాపారాలు కొందరు సజావుగా సాగించుకోగలగటం!

వసీం బలవంతపు నవ్వులో ఈ ఎరుక అంతా లేదు.

వాళ్ళిద్దరిలోనూ ఆ ఎరుకకి అవసరమయిన స్నేహపు నెలవంక పొడిచింది. దాంతో వాళ్ళ చేతుల్లో కత్తులు చేరే అవకాశం సన్నగిల్లింది.

"భాయీ! నన్ను మన్నించు..."

"వసీం నన్ను క్షమించు...."

ఎందుకన్న ప్రశ్న వాళ్ళు వేసుకోలేదు. నగరం వాళ్ళకి దగ్గరవుతోంది.

(ఇందులోని సంఘటనల్లో వ్యక్తుల్లో పరిసరాల్లో ఎవరికయినా ఏ పోలికలయినా కన్పించితే అది కేవలం యాదృచ్ఛికంగానూ.... మరెవరికయినా ఏ పోలికలూ కనిపించకపోతే ఇదంతా కేవలం కల్పనగానూ.... గమనించ ప్రార్థన....)

*('స్వాతి' మాసపత్రిక - ఫిబ్రవరి, 1984)*

# అద్దరూపాయ

"అలాటిలాటాడదాన్ని కాను మేస్త్రీరీ
నే నద్దురూపాయ డబ్బులకీ రాను మేస్త్రీరీ"
సందులో ఎవరో పాడుకుంటూ పోతున్నారు.

అదివిని

ఇంటి ముంజూరులో పొయ్యి ముందు కూర్చుని - కఱ్ఱ తెడ్డుతో - ఉడుకుతున్న నూకల పదును చూస్తున్న - బూరమ్మ చివ్వున తల ఎత్తింది!

పొద్దువాలు ఎండకు కళ్ళు చిట్లించింది.

పరశురాముడు వాకిట్లో వేప చెట్టుకింద నులకమంచం మీద తల కనిపించేలా పడుకుని వున్నాడు. అతనికి మూడు రోజులుగా జొరం. ఓ అరగంట పేల్చేస్తోంది. ఓ గంట చెమటలు. వీర్రాఘవులు మాత్రలు యిచ్చాడు. కషాయం అనుపానంగా వేసుకోమన్నాడు. అభిమానంగా వస్తున్నాడు. చూస్తున్నాడు. 'తగ్గిపోద్దే బూరీ' అంటూ ధైర్యం చెపుతున్నాడు. 'అదే ఆ బామ్మర్ల సుబ్బారావు బాబయితేనా - ఇంటికి రాడు. డబ్బులియ్యాపోతే మందు పనిచెయ్యదే - అంటాడు - అనుకుంది.

పరశురాముడు కదుల్తాండటం చూసి, వాకిట్లోకి వచ్చింది. ఆమె అలికిడికి - గుంజకు కట్టిన గొఱ్ఱె - అటూ యిటూ కదిలింది. దాని ముందు నాలుగు పరకలు వేసింది.

"లెగిసావేటి?" అంది మొగుడు గుడ్ల మిటకరించి చూస్తుంటే.

"పుగాక్కట్టా - " అంటూ సణిగాడు.

"ఏటీ-"' అంటూ దీర్ఘం తీసింది.

"పొద్దుట్నించి - నాలిక పీక్కుపోతందే - బూరీ"

"సిమ్మాచెలం నాకు రంకు మగడు - రాయే బుల్లీ అంటూ సేతిలో యెడతాడు - పుగాక్కట్ట-"

"ఏటా - సవ్వాదానం?" విసురుగాలేచి కూర్చున్నాడు.

"ఏటీ - నానేటన్నానేటంట?"

"ఛత్-నంజికానా-ఒక్కరోజు పాటుకెల్లాపోతే - ఎయ్యో పత్రాకులు బడాల గాని - ఎండగట్టేత్తే ఎలాగా-?

"ఓసోసి పవురుసం - నానో పని జెప్తాను - సెయ్యి"

అనుమానంగా ఆమె వేపు చూసాడు.

"ఎల్లి - ఆ ముసలయ్యను అద్దరూపాయ యిమ్మని అడిగి తెచ్చుకో-" అంది గొంతు తగ్గించి.

"నీయవ్వ - యింకా యిసయం మరిసిపోవటే!"

"అణనా- బేడానా? అద్దరూపాయ తక్కువేటి?"

"పోనీలేయే - ఆ యెదవ లేం మేడలూ, మిద్దెలూ కడతారా మన అద్దరూపాయతో"

"అడేటి కడితే మనకేటి? కట్టకపోతే మనకేటి? ఇయ్యాల ఆ అద్దరూపాయ లేకపోతే పొయి మీదకు ముంత ఎక్కదు - నీకు పుగాక్కట్ట అమరదు -" అంది.

గుర్రుగా చూసి చూసి అన్నాడు పరశురాముడు.

"అయితే పుగాక్కట్టకీ - దానికీ పూటా యెడతావా?"

"ఆ - అంతే -" అంటూ ముంజూరులోకి వెళ్ళబోయింది.

"సిత్తకార్తినంజికానా ఎంత గీరువాణవే" అంటూ తిట్లులంకించుకున్నాడు. బూరమ్మ కూడా మాటకి మాట కలిపింది.

"ఏట్రా - అలా మొగుసుకు పోతున్నారూ?" అంటూ వచ్చింది మంగమ్మ. ఆమెది పొరుగిల్లు.

"రా పిన్నీ - రా - సూడీ నంజ పొగాక్కట్టక్కూడా లేదంటంది - నాలిక పీక్కుపోయి సత్తన్నానూ -" అన్నాడు.

"అదేటే బూరీ -" అంది మంగమ్మ.

"ఈ యిరక తరకల సచ్చినాడు ఓదానికొకటి సెపతాడు. నాన్సెపతాను - యిను" అంది బూరి.

"ఇయ్యాల్టికి నాలుగోరోజు - ఆ 'ఉల్లోళ్ళ' అన్నదమ్ములులేరా - ఆళ్ళకి అరక గట్టడానికో మనిషి, తక్కవయాడు - ఈడిని పిలిసారు. సంకలెగరేసుకుంటూ మరీ ఎల్లాడు, ఎంతిస్తారేటని నిసుపు సేసుకోవాలగందా - ఊళ్ళో కూలెంతుంటే అంతిస్తాడను కున్నాడు."

"లేదు - నేనడిగాను - ఆళ్ళు అలాగే యిత్తానన్నారు."

"అట్టాగా - ఊరు ఊరంతా మూడు రూపాయల కూలి వట్టుకొత్తే - ఈయనగోరు రెండున్నర సేతిలో యెడితే- అదే సాలనుకొని సక్కా వొచ్చాడు-"

"నాకు తెలలేదు పిన్నమ్మా-"

"పోనీ - యెల్లి ఆడగలేకపోయావూ?" అంది మంగమ్మ.

"అదీ అలాగడుగు-" అంది బూరమ్మ.

"మూడు రోజులయిపోయిందప్పా! ఆళ్ళు రెండున్నర యిత్తామన్నారు. నాను అలాగొప్పుకున్నాను-" అన్నాడు పరశురాముడు సణుగుతూ-

"ఓరి సాతకాని నాయలా నిముసాని కో మాట సెపతావు తూ సిగ్గులేన్నాయలా"

మరో మనిసి ముందు అలా తీసిపారేసేసరికి పరశురాముడికి సర్రుమంది. అమాంతంగా లేచి, తన కర్రను తీసుకుని గబగబా నాలుగడుగులు వేసాడు.

"యేమారం యెవ్వారం సేసుకురాక - అడిగీదేదో తిన్నగా అడుగు - ఒల్లంతా వుండగా నోటి మీద కొట్టరు-" అంది బూరమ్మ.

ఆ మాటలతో మరో నాలుగడుగులు గబగబా వేసాడు. స్వతహాగా పరశురాముడు మెతక. దానికి తోడు మూడు రోజుల నుంచి లంఖణాలేమో - వీధిలోకి వెళ్ళేసరికే - చల్లబడి పోయాడు. కాళ్ళు దిగలాగేస్తున్నాయి. మనిషి తూలుతున్నాడు.

మానేద్దామా - అనుకున్నాడు

'ఛత్ - అద్దరూపాయ పట్టుకెల్లకుండా యింటికెల్లను - ఆడనంజకి లోకువయిపోతాను' - అనుకునేసర్కి మరో నాలుగు అడుగులు పడ్డాయి.

అతను కప్పుకున్న పచ్చటం ఎన్నో ఏళ్ళ సేవతో మురికి బట్టి బరువెక్కి పోయింది. దాని బరువు మరింత పెరిగినట్లుగా అనిపిస్తోంది. నెమ్మదిగా నడుచుకుంటూ ఉల్లి ముసలయ్య యింటికి చేరుకున్నాడు. అప్పటికి దీపాలు పెట్టేసారు.

ముసలయ్య వాకిట్లో మంచం మీద కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు. అతని చివరి తమ్ముడు నూకరాజు రాట దగ్గర కూర్చుని పలుపు పేనుతున్నాడు. చిట్టు కలుపుతూ ఎడ్లకి కుడితి పెడుతోంది దాలమ్మ. ఇద్దరు పిల్లలు నట్టి వాకిట్లో మంచం మీద కూర్చుని సత్తుగిన్నెలో అన్నం తింటున్నారు. 'మజ్జిగ వాడకం' కుర్రాడొకడు వచ్చి - అల్యూమినియం కారేజీతో - దాలమ్మ చేయి తీరిక అవటం కోనం - ఎదురు చూస్తున్నాడు. వసారాలో ఇద్దరు మగాళ్ళు చేరి ఊసులాడుకుంటున్నారు. ఆ యింటి రెండో కోడలు పిడకలు వలిచి ఒబ్బిడి చేస్తోంది.

నలుగురుండటంవల్ల, గొడ్డూ గోదా ఉండటం వల్ల, యిల్లూ వాకిలీ శుభ్రంగా ఉన్నాయి. కళ్ళాపి జల్లి వాకిట్లో ముగ్గుపెట్టారు. పచ్చి మన్ను యిటికలతో విశాలంగా కట్టిన యింటి అరుగులు నున్నగా అలికారు. ఎర్రమన్ను మెత్తి, దానిమీద సున్నపు

బొట్లు పెట్టి అలంకరించారు. ఆ యింటి ఆడవాళ్ళు పొలాలకు వెళ్ళకుండా యింటి మీదే తమ శ్రమనంతటినీ పెడుతూండటం కనిపిస్తోంది. మధ్యగదిలో నేల మీద వున్న రోట్లో ధాన్యం దంచుకుంటూ, ఆ గదిలోనే గోడ వెంబడే కట్టిన చెక్క అటక మీద నున్నగా తోమిన యిత్తడి సామాను వచ్చేవాళ్ళ కళ్ళబడేటట్టు పెట్టుకున్నారు. ఆ యిత్తడి సామానులో, దాలమ్మ చేస్తున్న అణావడ్డీ వ్యాపారంలో పట్టిన సామాను కూడా ఉంది.

వచ్చి - వాకిట్లో నిలబడ్డ పరశురాముడి వేపు చూసి -

"ఎవరదీ -" అన్నాడు ముసలయ్య.

"అంత కాపట్టం లేదా ముసలయ్యా- నానూ - పరశురాముడిని"

"నువ్వంట్రా - రా - రా" అన్నాడు ముసిలయ్య -

"ఈ మర్రేదలకేంగాని - నువ్వు అద్దరూపాయ కురదలా పెట్టావు - అదియ్యి."

"ఎవర్నునుకుని ఎవర్నడుగుతున్నావు-నాను నీకు బాకీ యెట్టడమేటీ-"

"అవున్లే - నా సొమ్ముడేసుకునేవోళ్ళు పురుగులడిపోతారు"

"ఏట్రా - ఏటలా మాటాడతన్నావు-?"

"అయ్యేల - నా సేత పనిజేయించుకుని నాకిచ్చిందెంత"

"రెండున్నరా - రెండు యిడి రూపాయాలూ, రెండు పావలాలూ యిచ్చాను గందా-"

"అయ్యేల - వూళ్ళో కూలెంత?"

"అదేమో - నాకేటి తెల్సూ-"

పలుపు పేనుతున్న నూకరాజు అక్కడి నుంచే అంతా వింటూ తలెత్తి చూస్తున్నాడు- "ఏటది పరుశురాముడూ" అని అరిచాడు.

"నువ్వే - నువ్వే గందా - నాయింటికొచ్చి నన్ను-అరక గట్టమన్నావూ - సెప్పు-అయ్యేల నువ్వేటన్నావూ?"

"ఏటన్నానూ?"

"నీ కెందుకు గురుతుంటాదీ - నువ్వేటన్నావో మీ అన్నకి సెప్పు"

"ఏటన్నావు - నూకరాజూ -" అన్నాడు ముసిలయ్య.

ఏటన్నావు - ఊళ్ళో కూలెంతుంటే అంతన్నాను - సరేనన్నాడీ అయ్యగారు -" అన్నాడు నూకరాజు.

"మరిగయితే - అద్దరూపాయ తక్కువేల యిచ్చారు-?

"రెండున్నర యిచ్చాం గదరా-"

"ఊళ్ళో అందరూ మూడు - మూడు రూపాయలు - ఇస్తున్నారు -- ఆ లెక్కన - అద్దరూపాయ - వస్తాది-"

"నువ్వీమాట ఆయేల ఎందుకు సెప్పలేదో-" అన్నాడు నూకరాజు.

"నా కాయేల తెలలేదూ-"

"అట్టాగా - అయితే యిచ్చిందట్టుకెల్లావు - అంతే - ఎల్లెల్లు" అన్నాడు యింకో తమ్ముడు అక్కడికి వస్తూనే -

"ఎందుకెల్లాల? పాటడ్డావోడిని - అప్పన్నంగా యిమ్మనడం లేదు - మీ సొమ్మడేసుకోవాలని నాకేం లేదు -"

"మాకుందంటావు-"

"అవును - అంటాను - మీరు నలుగురున్నారు - నాలుగెకరాలున్నాయి - అది పాలక సత్తన్నారు - పాలమ్ముతారు - పెరుగమ్ముతారు - అణాకి అణా వడ్డీలు లాగుతారు - అందుకే - అందుకే-"

"ఏటేటీ - ఏటా మాటలూ-? ఇంటి మీద బడి నానా మాటలూ అంటే - అద్దరూపాయ సేతల యెట్టి సాగనంపు తారనుకున్నావేటీ-? ఓసోసి యిక్కడెవులూ గాజులు తొడిగించుక్కూచోలేదు - యెల్లెల్లు" అంటూ తన గాజుల చేతులు ఊపుకుంటూ మీద మీదకి వచ్చింది దాలమ్మ.

ఆ కుటుంబంలో ప్రతీవాళ్ళు ఏదో ఒకటి అంటున్నారు.

పరశురాముడు ఏదో అంటున్నాడు.

"ఏల్తావా - నాలుగు తగల్నియ మంటావా?" అన్నాడు నూకరాజు

అంతే - ఆ పళంగా కర్ర ఎత్తాడు.

"నంజికొడకల్లారా! ఒక్కడిని సేసిమీదడిపోతారా - నా అద్దరూపాయ యివ్వకపోతే - పుచ్చెలు లేచిపోతాయి" - అన్నాడు.

అందరూ ఒక్కసారి అతని మీద పడ్డారు.

అసలే జ్వరం మీద వున్నాడేమో - ఎలా తగిలిందో - తల మీద దెబ్బ తగిలింది. రక్తం చూసేసరికి ఎక్కడి వాళ్ళు అక్కడే ఆగిపోయారు.

పరశురాముడు కుప్ప కూలినట్టు పడిపోయాడు.

## 2

కాకినాడ సినిమా హాళ్ళ వీధి.

రెండవ ఆట విడిచి పెట్టారు. జనాలను యిళ్ళకి దిగబెట్టి వచ్చిన రిక్షా వాళ్ళూ-బేరాలు వెదుక్కుంటూ నిద్రతో నోరు పెద్దచేసి ఆవలిస్తున్న స్త్రీలూ - అనేక రకాల రాత్రి మనుషులతో సందడిగా వుంది 'యెంకటేశ్వర్లూ యేవన్ హోటేలు'

పెద్ద సైజు యిడ్లీ ప్లేటుని గోనెగుడ్డతో దించి ఇడ్లీలు తీస్తున్నాడు ఒకడు. ఎవరో వేసిన బూతు ప్రశ్నకు అంతకంటె బూతుగా సమాధానాలు చెపుతున్న ఒకావిడ - మధ్య మధ్యలో రోడ్డుమీద ఎవరయినా వెళ్తూంటే బయటకు వచ్చి పమిట తీసివేసుకుంటోంది.

"యీ లంజలు నా కొట్లోనే దుకాణం యెట్టేసాలాగున్నారు" - నల్లగా మురికిదేరిన కర్ర టేబిలుమీద మోచేతులు ఆన్చుకుని కూర్చున్న అప్పారావు విసుగ్గా అంటున్నాడు.

అక్కడున్న కొందరు నవ్వారు.

"నీ బేరం కన్నా నవకే మామా - నాబేరం!" అందామె.

"నవకగాకేమే - పెట్టుబడి లేని బిజినెస్సు నీది-"

ఇంతట్లో - ఆ హోటల్లోకి వచ్చిన మనిషిని చూసి - అందరూ అటు తిరిగారు.

"సుబ్బారావు బవన మంట - ఎక్కడుంది బాబయ్యా?" అంటూ అందరి వేపూ చూసాడు ముసలయ్య.

ఆందోళనతో - భయంతో - అతను దెబ్బతిన్న పక్షిలా ఉన్నాడు. చెంగులు దోపి కట్టిన పంచె, గుడ్డ బనీనులతో అతను అక్కడివాళ్ళ కళ్ళకి పరాయిగా ఉన్నాడు. ఆ సమయంలో అలాంటి చోట కాస్తంత చిత్రంగా ఉన్నాడు.

"ఏవూరి నీది కాపూ?" ఒకతను అడిగాడు.

"సింగారం - బాబయ్య"

"యింత మాపు - బయలెల్లావు - ఏటికత?" ఆ ప్రశ్నకి ముసిలయ్య జవాబు చెప్పలేదు. అదేదో అడగరాని ప్రశ్న అయినట్టు అతను తృళ్ళిపడటం కొందరు గమనించారు.

"మామది - గట్టి ఒళ్ళే" అంది ఒకామె.

"ఏయ్ నంజల్లారా - నా పేసింజర్ల మీదకొస్తే కాళ్లిరగదంతా! యేం కాపూ- యేడేడి యిడ్లీ ఉన్నాయి - రెండు ప్లేట్లు లాగిస్తావేటి?" అన్నాడు ఓనరు అప్పారావు.

పొద్దుట ఎప్పుడనగా తిన్న తిండి - ముసిలయ్యకు గుర్తుకొచ్చింది ఆకలి. ఓ బల్ల మీద చతికిలబడ్డాడు. 'ఎవురి మొహం చూసానో-కూళ్ళు తినేయేలకి గొడవయింది' అనుకున్నాడు.

'యేడేడియ్యి - రెండే పేట్లు!' అరిచాడు అప్పారావు.

"సుబ్బారావు బవనం యేడుంది బాబూ!" మంచినీళ్ళు తాగాక అడిగాడు.

"ఏ సుబ్బారావు కాపూ?"

"సినితిరుపతి సిన్నారావు బాబుగోరు అందల ఉంటారంట - అందల అందరూ పెద్ద పెద్దోళ్ళుంటారంట-"

"నాతోరామామా - సూపిస్తా" అంది ఒకామె.

"నోరుముయ్యోహే - నీ యవ్వ" అని ఆమెని కసిరాడు. ఆమె ఏదో గొణుక్కుంటూ బయటకు వెళ్ళింది.

"సిన్నారావు బాబా - ఆరెవరు?"

"సినతిరపతి అంటన్నాడుగదా - సిన్నారావు బాబు తెల్దా?" ఒకతను అన్నాడు.

అప్పారావు అయోమయంగా చూసాడు.

"మా సింగారం ఓట్లన్నీ ఆరియ్యే -అరేం సెపితే దానికే యేత్తాం! - ఓసుట్టు సుత్తీ కొడవలన్నారు - యేసాం! ఓసుట్టు కాడెద్దులు అన్నారు - ఓ సుట్టు తెల్లజెండా అన్నారు - మల్లీ యీ మద్దిన ఆవూ దూడా అంటన్నారు - అరు తెలవదా?" కాస్తంత ఆశ్చర్యంగా అడిగాడు ముసిలయ్య.

"ఆరితో నీకేటి పని?" ఒకతను ఆరా తీసాడు.

ముసలయ్య జవాబు చెప్పక పోయేసరికి అతను ముసలయ్య నడుం చుట్టూ చూసాడు. ఎత్తుగా ఏమీ కనపడలేదు. అతను టీ తాగేసి వెళ్ళిపోయాడు.

కొంతసేపు తర్జన భర్జనలు జరిగాక - ఒక కుర్రాడు అన్నాడు - "తిన్నగా యీ రోడ్డు కొసా కెల్లిపో - ఎడం వేపు సందంటే ఎల్తే ఓ పెద్ద వీధి వస్తాది - ఆడే ననుకుంటా నువ్వడిగే బంగ్లా ఉంటాది-"

ముసలయ్య చిక్కంలోంచి డబ్బులు తీసి ఒకటికి రెండుసార్లు లెక్కబెట్టి యిచ్చాడు. సిల్లరడబ్బులు బనీనుజేబులో యేసుకున్నాడు.

☆ ☆ ☆

గలీజు గలీజుగా వున్నాయి రోడ్లు.

లారీలు రోడ్ల మీదే ఆపేసి - రిపేర్లు చేసుకుంటున్నారు. కొందరు ఆరుబయట మంచాలు వేసుకున్నారు.

పొలాలమ్మటా పుట్టలమ్మటా అర్ధరాత్రీ - అపరాత్రీ అనకుండా తిరగటం ముసలయ్యకు అలవాటేగాని... ఇలా పట్నంలో ఏ గోతిలో కాలు పడుతుందో - ఏ కుక్క మీదకొస్తుందో - ఏ లారీ మీదకి దూసుకు పోతుందోనని బెదిరిపోతూ నడవటం కొత్తగా ఉంది.

ఆ కొత్తనీ, భయాన్నీ వెనక్కి నెడుతూ అతని మనసు జరిగిపోయిన సంఘటనల మీదా -- వర్తమానం మీదా - భవిష్యత్తు మీదా - కదులుతోంది.

సింగారం గ్రామంలో అందరూ చెప్పుకునే హత్యని అతని తండ్రే చేసాడు. ఆగ్రామంలో గడచిన మూడు నాలుగు తరాలలో జరిగిన ఒకే ఒక హత్య అది.

కన్నతండ్రిని.....మెడలో తువ్వాలు వేసి లాక్కుంటూ వచ్చి...'వదల్రా వదల్రా

బాబూ,.... అంటూ ఇంటి ముందు వాకిట్లో కాళ్ళు పట్టుకుంటున్నా వినకుండా పోటు మీద పోటు పొడిచి చంపేసేడు అతని తండ్రి.

అప్పటికి ముసలయ్యి వయసు ఆరేళ్లు....

తాత మొహమూ... తండ్రి మొహమూ.... అతనికి సరిగ్గా గుర్తులేవు. తాత తను ఉంచుకున్నామెకు ఉన్న మూడెకరాలలో ఓ ఎకరం రాస్తున్నాడని విని తండ్రి ఆ పనిచేసాట్ట. అప్పుడు ఊరి మునసబూ కరణమూ....కేసు మాఫీ చేయించే ప్రయత్నం చేద్దామని .... తల్లి వెంట పడ్డారుట.

ఆమె గొల్లుమని ఏడవటం తప్ప ---- భర్తని రక్షించే ప్రయత్నం చెయ్యలేదు. "ఎందుకు చేస్తుందీ - మొగుడు పోతే మొగుళ్లు వంద. బూమి పోతే ఎక్కడ నించి వస్తుందీ-"

అంది సింగారం గ్రామం.

ముసలయ్యి తల్లి ఎవరినీ ఖాతరు చెయ్యలేదు -" భూమీ వుండదు - ఆడూ ఉండడు - మద్దినోళ్ళు - నన్నూ నా పిల్లల్నీ మింగేత్తారు - దేవుడెలా దలిస్తే అలాగవుద్ది -" అంది.

మూడెకరాల మెరక భూమితో నలుగురు మగ, యిద్దరు ఆడపిల్లలతో... ఏ పాట్లు పడిందో.... ఎలా పెంచుకొచ్చిందో -- ఎలా పెళ్ళిళ్లు చేసి పురుళ్ళు పోసిందో -- ఏమైతేనేం - ముసలయ్యికు ముప్పయి తొమ్మిదోయేట నాలుగెకరాల భూమినీ తమ్ముళ్ళనీ, వాళ్ళ సంసారాలనీ అప్పగించి కన్నుమూసింది ఉల్లి అప్పాయమ్మ.

ముసలయ్యికి మాటల చాకచక్యం లేదు. పైసా బెసగనియ్యక పోయినా - పైసా రాబట్టడం కూడా అతనికి చేతకాదు. తల్లి వెనకాల తిరిగి - చెప్పినట్టల్లా చెయ్యటం తప్ప మరేమీ చేసినవాడు కాదు. ఒకే ఒక్కమారు ఒక పెద్దాయనతో రాజమండ్రి బెల్లం మార్కెట్ చూడటాన్కి వెళ్ళాడు. అది తప్పించి అతను పక్కనున్న కాకినాడ కూడా చూడలేదు.

పెళ్ళామూ, మరదళ్లూ కూడా కలిసొచ్చే వాళ్లు గనక ఆ కుటుంబం ఒక కట్టు మీదా, ఒక మాట మీదా నెగ్గుకొస్తోంది.

ఈ నాటికి -- మా కుటుంబం వీధిన పడిపోయింది. అక్కడికీ బండిలో వేసి పరశురాముడిని పట్నం తీసుకువచ్చారు. మనిషి స్పృహలోలేడు. కాకినాడ పెద్దాసుపత్రిలో చేర్చారు. ఆ ఆస్పత్రి, ఆ మేడలూ చూసేసరికి అయోమయం! దెబ్బ ఎలా తగిలిందంటాడు డాక్టరు? ఏం చెపితే - ఏంటో తెలియదు - ఎవరో కొట్టి పడేసారని చెప్పమన్నారెవరో - అలాగే చెప్పాడు.

తమ్ముళ్ళిద్దర్ని ఆస్పత్రిలో ఉంచాడు. దోవలో ఎవరో చెప్పారు... చినబాబుగారు కాకినాడ్లో ఉన్నారుట. ఆయన్ని కలుసుకోమని సలహా యిచ్చారు.

చినబాబుగారు తన ముండ యింట్లో దొరకుతాట్ట - దాన్ని సుబ్బారావు బవనమంటారుట.

ముసలయ్యకు పరశురాముడు చనిపోతాడన్న ఊహ కలిగేసరికి కాళ్ళూ చేతులూ చల్లబడుతున్నాయి.

'నా కుటుంబానికే రావాలా యీ ఆపద!' అనుకుంటూ ముసలయ్య చిట్టచివరకి ఆ భవనానికి చేరుకొన్నాడు.

గేటు దగ్గర నిలబడి గొంతెత్తి అరిచాడు.

"బాబయ్యా - సుబ్బారావు భవనం యిదేనా!"

"ఏటా అరుపులు - ఏం గావాల?" అంటూ అరుగుమీద పడుకొని వున్న ఒకతను వచ్చి విసుగ్గా అరిచాడు.

"సిన్తిరపతి - సిన్నారావు బాబుగోరు కావాల బాబయ్యా"

"ఏటా అరిజెంటు?"

"కూంత లేపు బుల్లోడా?" బ్రతిమాలాడు ముసలయ్య.

## 3

ఆ యింటి ఎత్తరుగుల నాపరాళ్ళు చల్లగా ఉంటాయి. దాని మీద పీట వేసుకుని ఓ పక్కగా కూర్చుని ఉన్నాడు కరణం రామచంద్రమూర్తి. అతని తమ్ముడు మరిడిరాజు తాపీగా చుట్ట కాల్చుకుంటూ కళ్ళు మూసుకుని గోడకి జారబడి కూర్చున్నాడు.

రామచంద్రమూర్తి చేతిలో అద్దంలో తనని తాను చూసుకుంటూండగా మంగలి గెడ్డం గీస్తున్నాడు.

"దండాలు బాబయ్యా-"

గడ్డం కదలకుండా -కళ్ళు కదిపి, వచ్చిన మనిషి ఎవరా అని పరకాయించి గుర్తుపట్టి పైకొచ్చి కూర్చోమని సైగ చేసాడు.

ఆ "మాటకి కళ్లు తెరిచిన మరిడిరాజు వచ్చిన మనిషిని ఎగాదిగా చూసి -" ఏటోయ్ చిల్లుకప్పుల రాజా - యిలా దిగడ్డావు?" అన్నాడు బిగ్గరగా నవ్వుతూ.

చిలకా అప్పలరాజు ఉడుకుమోత్తనాన్ని బయట పడనీయకుండా, "ఊరుకో మా రాజా! నీకెప్పుడూ యాలాకోలవే!" అన్నాడు మెట్లు ఎక్కి పైకి వస్తూ!

"నీతోటా - యేళాకోళాం-! కొరివితో తల గోక్కోటం గదటోయ్! ఊరు ఊరంతట్నీ నువ్వొక్కడివే అరగంటలో తగలెట్టేసి - చుట్ట కాల్చుకునీ శకునివిగదా -- మా అన్నతో మాటాడ్డానికొచ్చేవంటే - అష్టగ్రహకూటమి వొచ్చినట్టే గదా అని భయం-"

"వాడితోటేంటి అప్పలరాజా - యిలారా-ఏమైనా పనా?" అన్నాడు రామచంద్రం.

"నాకేం పనుంటాది బాబయ్యా - యీదిలో కాపడితే దరిసెనం సేసుకు పోదారని వొచ్చానయ్యా-"

"నిజమే మరి - మొన్నమొన్నేగదా కాళ్ళు యిరగదన్నారు - ఎలాగున్నాయి కాళ్ళు?"

"నువ్వు మాకానోడివి మరిడిరాజా!"

"ఒరేయ్ తమ్ముడూ - నువ్వు లోపలి కెళ్ళు" అన్నాడు రామచంద్రం.

మరిడిరాజు అన్న మాటను ఔదల దాల్చాడు.

"ఇయ్యాల - పెద్దాపురం పయ్యానం లేదా బాబయ్యా-"

"జనం తెలివిమీరిపోతున్నారు - ఎవరిపని వాళ్లే చూసుకుంటున్నారు - మధ్యలో నీబోటిగాళ్ళు తయారవుతున్నారు - యింక కర్ణాలెవరికి గావాలి?"

"అంతే బాబయ్యా అంతే - నాయానికి రోజులు గావండి - అందుకే గదండయ్యా - ఊరి గొడవలు పయూరి అసామీలు సక్కబెడతన్నారూ-"

మంగలిని ఆగమని చెప్పి ఓమారు అప్పలరాజుని పరిశీలనగా చూసాడు రామచంద్రం.

"-మీ సింగారం కర్ణం ఏంటంటున్నాడూ?" అన్నాడు అదోలా.

ఆ బ్రాహ్మణ వీధిలో ఎనిమిది కొంపలున్నాయి. అందులో నలుగురు కర్ణాలున్నారు. అందరూ జ్ఞాతులే! చలపతి ఆ సింగారానికి కరణమయితే - రామచంద్రం అక్కడికి నాలుగు మైళ్లదూరంలోని రాచభూపాలపురం కర్ణం.

"అరేటంటారండి - ఆరూ, తమరూ క్రియకొస్తే వొకటే"

"ఆమాట అతగాడు అంటాడా?"

"మాటలకేందయ్యా - మనూరి యవ్వారాలు యిలా పయూరోళ్ళు --- మయాన ఆ సిన్నారావు బాబు లాగించేస్తున్నాడు -"

"ఆయనంతట ఆయనొచ్చాడేంటి? ముసలయ్య యెళ్ళి ఆయన ముడ్డిలో దూరాడు - యింకీవూళ్ళో మగాడేలేనట్టు"

"సిత్తం - సిత్తం - తమరన్నమాట సరయిన మాట -" అని ఆగాడు -

"మనం యిలా వూరుకుంటే - పరశురాముడి పెళ్ళాం ముండ అన్నాయమై పోద్ది" అన్నాడు.

మంగలి గోళ్ళు తీస్తున్నాడు. అద్దంలో మీసం చూసుకుంటూ ఏమీ జవాబు చెప్పలేదు రామచంద్రం.

"ఆ సెలపతిగారు -- దాని దగ్గరేటుంది పామ్మన్నారు"

"ఊఁ!"

"ఎవురికాడా ఏటీ ఉండదు - సూసీలా సూడాలన్నాను".

"అక్కడ తడిమాకే యిలా వొచ్చావన్నమాట-"

"ఆయన మీ అంత సొరాతనయిన మడిసి కాదుగాని -- ఊరి కరణంగందా ముందస్తుగా అడగాలగదా బాబయ్యా-"

"నువ్వు మాత్రం తక్కువదిన్నావేటి? నువ్వు తగ్గేస్తున్నావేం?" - నాలిక పళ్ల మధ్య ఆడిస్తూ అడిగాడు.

"మరిడిరాజు గీయించుకుంటాడేమో - అడుగు-" అని మంగలితో మాటలాడుతూ చిలకా అప్పలరాజుకి వ్యవధానం యిచ్చాడు రామచంద్రం.

"సెప్పకపోడమేం?! సిన్న సిక్కుంది బాబయ్యా" - లేచి నిలబడి తిమ్మిర్లెక్కిన కాళ్ళు జాడిస్తూ అన్నాడు.

"ముసలయ్యి నీకు దూరపు చుట్టమంటావు"- అన్నాడు.

"అదేం గాదన్నయ్యా - ఈడసలే పిడతగాడు. ఆ పరశురాముడి పెళ్ళాం యీడి కెప్పుడో మృదంగం వాయించి ఉంటుంది" లోపల్నుంచి వచ్చిన మరిడిరాజు అన్నాడు.

"ఎంత మాటబడితే అంత మాటంటావు నువ్వు -" అన్నాడు. అప్పలరాజు.

రామచంద్రం చిన్నగా నవ్వాడు.

"నేనూ విన్నాను అప్పలరాజూ-"

"ఏందో బాబయ్యా - పున్నెం పాపం ఆ పరమాత్ముడికే దెలుసు - మాట మాత్రం పడిపోయాను - కూడదీసుకుందామన్నా వల్లగాదాయిరి! సీకుష్ఠులంతోరికే - తప్పలేదు - నానెంత!"

"రామాయణంలో పిడకల వేట ఎందుకులే - విషయం చెప్పు-"

"లోపలికి పదండి బాబయ్యా - మాటాడుకుందారి"

మండువా లోపలికి నడిచారు యిద్దరూ. నీళ్ల పెట్టమని అక్కడి నుంచే అరిచి - తూర్పు వైపు దొడ్డిలో కొబ్బరి చెట్టు కింద వాల్చిన కుర్చీలో కూర్చున్నాడు రామచంద్రం.

"ఎందాక వచ్చింది కథ?" సూటిగా అడిగాడు.

"చిత్తం - ఈ వూరి మనసబు గూడా ఆ ఉల్లోళ్లతో షరీకయి పోయాడండి."

"సిన్నారావు బాబు - ముందే రెయ్యి రెయ్యి మంటన్నాడు"

"ఆయనగారికి ఇందులో ఏముందబ్బా"-

"ఏమో - బాబయ్యా -లోగుట్టు పెరుమాళ్ల కెరుక - ఆ ముసలయ్యగాడి పొలాన్ని ఆనుకునే మా తోడల్లుడి భూముంది. ఈ మద్దినే ఈడు ఆ సిన్నారావు బాబు ఎంట తిరుగుతున్నాడు. దొంగనాయాల!"

"ఎవరు - ఆ సంద్రపోళ్ళ కుర్రాడు - ! మీ అత్తపోయినపుడు - దాని నగలు కనపడకపోతే నీ మీద కలబడ్డాడూ - ఆడేనా!"

"సిత్తం - తమరెరగనిదేముందండి - ఆడే ఆ దొంగనా కొడుకే - మస్తుగా వుంది లెండి. ముసిలయ్య భూమ్మీద కన్నేసినట్టున్నాడు"

"ఈ వూరి గొడవలు నాకేం తెలియటం లేదు అప్పలరాజూ"

"సిత్తం - సిత్తం మనూరి గొడవలు అన్న బాదేగాని ఎవ్వరెలా బోతే మనకేటయ్యా -"

"మీ చలపతి ఏమన్నాడేటి?"

"పిరికోడు బాబయ్యా - ఏటంటారూ- పెద్దోడు అయ్యేవుకాసినపుడు మనకెందుకూ అంటాడు-"

"అదీ నిజమే మరి!"

"మాటొరసకన్నాను గాని - అందల ఓ పితలాటకం ఉంది బాబయ్యా-"

"అదేంటదేంటి?"

"ఒయ్ - ఒయ్ - మీకు తెల్దేటి?"

"నాకేం తెలీదు - అప్పలరాజూ-"

"తాలూకాఫీసు లోపలికెళ్ళి వోరు తమరు - సెట్ల కింద ఏడిసోవోళ్ళం మేమూ-"

"ఏది - మీ మునసబు దొంగ రశీదులు గొడవేనా-?"

"సిత్తం -"

"ఇందులో --- కరణం చలపతీ ----" అంటూ ఆగి, "దొరకగూడదే -" అన్నాడు.

"ఎయ్యి పిట్టలు కొట్టిన రాబందుకి ఒకటే గాలి వానంట-"

రామచంద్రం తల అటూ యిటూ ఊపి - గొంతు తగ్గించి అడిగాడు - "చిన్నారావుగారు -- మన చలపతికి కవురెట్టాడా?"

"అలా ఎదరబడి పోతారా బాబయ్యా-"

"మరి...?

"మద్దిన మునసబున్నాడు గందా-"

"వాడొక వాజమ్మ గాకపోతే - తిన్న డబ్బుకి రసీదులు యిచ్చుకుంటాడా ఎవడయినా?" అన్నాడు రామచంద్రం.

"అందుకేగద బాబయ్యా - ఈ వూరెళ్ళి - పొరుగూరి వాడి కాళ్ళు పడతాంది-"

"సర్లే! ఆ విషయం మీ మునసబు కర్ణాలకి తెలియాలి - మధ్యలో మనమేం చెయ్యగలం?" నిట్టూర్చాడు రామచంద్రం.

"అలాగనీకు బాబయ్యా - పరశురాముడి పెళ్ళానికి ఏదోలా సెప్పి మీకాడికి పంపిస్తాను"

"ఎదర -- లోతు తెలియకుండా దిగ్గాడదు అప్పుల్రాజా"

"సిత్తం - సిత్తం - మమ్మల్ని ఆ పరశురాముడేకొట్టాడు - మాకూ దెబ్బలు తగిలాయి - అని సరిటిపికెట్టు యిప్పించారంట సిన్నారావుగారు - ఆ డాక్టరు సర్టిపికెట్టుతో పోలీసుస్టేషన్లో కేసు పెట్టించారంటండి-"

"ఊ!"

"ఆడు కొడతంటే - కాసుకున్నామని - తాగేసి తూలి పడిపోయాడనీ - పడ్డంలో రాయి మీద పడ్డాడనీ...."

"బాగుందే-"

"తమంతట తామే ఆడిని ఆస్పత్రిలో చేర్పించామన్నీ"

"ఊ!"

"బిగ్గాకట్టారండి కత-"

"ఊ!"

"ఇటు యిాల్లెంత మోపు చేసినా - పరశురాముడికే దెబ్బ మోపుగా తగిలిందండి - ఆ యినసపెట్టరు చిన్నారావు గోరి యియ్యంకుడి కమతంలో పాలేరు కొడుకంట-!"

"చాలా లాగావు - అప్పుల్రాజా -"

"సిత్తం"

"దెబ్బలు ఎంతమందికి తగిలాయని సరిటిఫికెట్ పుచ్చుకున్నార్ట--?

"అది బాబయ్యా - పాయింటు! అందుకే గందా మీకాడి కొచ్చిందీ -" అంటూ ఆలోచించి -"ముగ్గురన్నదమ్ములకే అనుకుంటానయ్యా - నాలుగోవాడు నూకరాజని --ఆడికి సర్టిఫికెట్టు పుచ్చుకోలేదనుకుంటాను - లేదు బాబయ్యా - పుచ్చుకోలేదు -" అన్నాడు అప్పుల్రాజు.

"అలాగంటావా - మరయితే-"

"ఆడినీ పిలిపించొచ్చు గానండి - వొద్దు బాబయ్యా - యింకా ఎసరు మరగలేదు"

"సర్లే ముందు ఇటునించే నరుక్కొద్దాం"

"అలాగే బాబయ్యా - ఆ పరశురాముడి పెళ్ళాం మీకాడి కొచ్చే ఏర్పాటు సేస్తాను-" అంటూ లేచాడు అప్పుల్రాజు.

"అగాగు - ఆ పరశురాముడి పెళ్ళాం దగ్గరేంటుంది - బొచ్చు-"

"అదేటి బాబయ్యా - దానికేటయినా రాలితే మనగ్గాదంటండీ-"

"ఓరి యెర్రి తొత్తుకొడకా- ఆ ముసలయ్య, పొలానికి యింకోవేపు నువ్వులేవా-" అన్నాడు రామచంద్రం నవ్వి.

"అందాకా వొస్తేగదా బాబయ్యా -" దొంగ నవ్వు నవ్వాడు అప్పల్రాజు.

"యిప్పటికి తేలావు-"

"తమరి ముందు - నానేపాటి బాబయ్యా"

"సరేగాని - ఆ నూకరాజుని కూడా ఓ కన్నేసి వుంచు -"

"తమరు సెప్పాలా బాబయ్యా-?"

"మీ తోడల్లుడు ఏమాత్రం మదుపెట్టాడంటావు-"

"మూడువేలయినా ఉండాలి బాబయ్యా"

## 4

సామర్లకోట బస్టాండు.

రామ కోవెల ఆడాళ్ళ కబుర్లతో, పిల్లల ఏడుపుల్తో, చిల్లర మల్లర వ్యాపారస్తుల అరుపులతో అడావుడడావుడిగా ఉంది. కూరేసిన బస్సుల్తో వచ్చి పది పదిహేను మందిని కక్కేసి, అంతకు రెట్టింపు జనాన్ని మింగేసి సాగిపోతున్నాయి బస్సులు.

స్టేషన్లో రైలు దిగి, పరుగులమీద అక్కడకు వచ్చాడు లోవరాజు. సింగారం బస్సువచ్చేసిందా - అని కొందరిని అడిగాడు; వెళ్ళిపోయిందా - అని కొందరినీ అడిగాడు. రాలేదని తేల్చుకున్నాక, కాస్త ఊపిరి పీల్చుకుని - ఎక్కడయినా కాస్త చోటు దొరికితే కూర్చోవచ్చని చూసాడు.

"ఓహోహోహో - లోవరాజూ" అంటూ చప్పట్లు కొడుతూ ఎదురుగానున్న హోటల్లోంచి పిలుస్తున్న బుల్లిబాబు కనిపించాడు.

ఈ సోకుబాబు యింకా ఉండాడంటే - బస్సుయింకా ఎల్లలేదన్నమాట- లోవరాజు మనసు మరింత సర్దుకుంది. హోటల్ వేపు నడిచాడు.

"ఏటి బుల్లి బాబుగారో --- ఎటు పయ్యానం?"

"యింటికే లేవో - కాఫీ పుచ్చుకుంటావేటోయ్"

"ఎందుకండీ - కాఫీ ఇయ్యాలప్పుడు"

"అనకాపల్లి నుంచొస్తన్నావు గందా - కాఫీ తాగితే ఏటవుద్దో - కానీ కరుసెట్టవు గందా!"

"మీరు - కలిగినోరు - మీలాగుంటే గుండవయిపోనా?"

"ఓషోసి - ఏం కబుర్లు నేర్చావోయ్ - ఓ పక్క బెల్లం ఖాయిదా లాగుతావ్ - అటూ ఎవసాయం - మద్ది మద్దిన బ్లాకులోపెండి - అమ్ముతావ్ నీ లెక్క నాకెలా గొస్తదోయ్?"

అంటూ హోటలు డబ్బులు యిచ్చేసి బయట కొచ్చాడు. అతని వెనకాలే లోవరాజూ వచ్చాడు-

ఇద్దరూ రాం కోవెల దగ్గర నిలబడేసరికి - కంసాలి మాధవాచారి చేతి సంచీతో ఎదురొచ్చాడు -

"నువ్వెక్కడనుంచోయ్ - ఆచారీ-"

"నాగభూషణం గారింట్లో కార్యం గదండి, రాజమండ్రి పంపారు-"

"ఎలాగుందేటి బంగారం?"

గట్టిగా అడక్కండి - ఎవడయినా యింటాడు" - సంచీ గట్టిగా పట్టుకుని అన్నాడు.

"రాత్రేం సినిమా జూసావో-?"

"నేను ..... సినిమా ..... చూడవయ్యా లోవరాజూ ... బుల్లిబాబు గారి పరాచికాలు"

"అవున్లే - నువ్వు సామలాటాకీసు కెందుకెల్తావూ - మెరకీది సామలమ్మ కంపెనీ కెళ్తావుగాని -"

ఇంతట్లో - హాఫ్ పాంటూ, చొక్కా వేసుకున్న ఒకతను దగ్గరగా వచ్చి "బాబయ్యా - మనూరి బస్సు ఉందాండి?" అని అడిగాడు.

"-ఈయనెవడోయ్ - లోవరాజూ?" సంశయంగా అడిగాడు.

"నాను జలసూత్రపోళ్ళ కుర్రాణ్ణండి - ఉప్పర్లం" - అని అతనే జవాబు యిచ్చాడు.

"ఓరి... ఓరి... పాంటూ, చొక్కా యవ్వారం జూసి ఎవడూ అనుకున్నాను- నిన్నిందంట ఎప్పుడూ జూసినట్లేదురా -" అన్నాడు బుల్లిబాబు.

"ఈడు పడమటెల్లి - యెనకేసు కున్నట్టున్నాడు-" అన్నాడు లోవరాజు.

అతను తల గోక్కుంటూ - "కాకినాడ ఎల్లాను బాబయ్యా - మా బంధువొకడు రమ్మని కవురెట్టాడు-"

"అవునూ - పరశురాముడు ఎలాగున్నాడో వైనం దెలిసిందా - లోవరాజూ"

"నిన్న ఆస్పత్రిలో సూసాను బాబయా" అన్నాడు.

"ఎలాగున్నాడు - ఉప్పరీ!"

"మాటా పలుకూ లేదు - మడుసుల్ని పోల్తి పట్టడం లేదు-"

"అద్దరూపాయ డబ్బులకోసం -కొట్టేసుకున్నారు - లంజాకొడుకులు-" బుల్లిబాబు.

"ఆ అద్దరూపాయ కోసమే - మడిసి బతికేది బుల్లిబాబుగారో! నానీ యేపారం సెయ్యడవేఁల - యింటో కూకోకూడదా-"

"సూడవోయ్ - ఆచారీ! లోవరాజు ఎలాగంటన్నాడో!"

"అలా అనీకండి బాబయ్యగారూ! రాజమంద్రం ఎల్లానా - ఆ కొట్టోడు - పదేళ్ళ నుంచీ సెలవు. వాడికి - పైసా - అంటే ప్రాణం! నా బేరం వదలలేడు - పైసా తగ్గించడు - ఆడికిమేడలున్నాయి - నేను గుడిసెలో ఉన్నాను. వాడు అర్థ రూపాయికి చూసుకోడానికీ, నేను తగ్గించమనడానికీ - సాటవుద్దాండి! ఆశంటే - వాడిది" - అన్నాడు మాధవాచారి.

"నువ్వు... అమ్మ - అమ్మ - ఏం లెక్కలుగడతావు ఆచారీ!"

"మీరు మాత్రం కట్టరేటండీ-"

"మాదంతా తినేత కంపనీ నోయ్ - కాకపోతే సినిమాల కోసం టవును కెల్తామేటోయ్-"

"సినిమాల కోసమయితే - లెక్కట్టకపోవచ్చయ్యా - నాబోటి కట్టపడే వోడి దగ్గర దమ్మిడీ బెసగరు బాబయ్యా-"

"ఓరి ఉప్పరాడా - ఏం మాటలు నేర్సావురా"

"ఈడియ్యేం తెలివితేటలు బుల్లిబాబుగోరూ - ఈడ మునలయ్య పరశురాముడిని కొట్టారన్నారు - ఆడ పెద్దలంతా గోదాలోకి దిగిపోయారు -" అన్నాడు లోవరాజు.

"అప్పలాజుగాడు - రాంసెంద్రం గోర్ని ముగ్గులోకి లాగాడు-"

"ఆడు లాగాపోతే ఈరే దిగిపోతారు-లేకపోతే ఆరి కడుపెలా నిండుతాదీ-"

"మీకిది తెలుసా?" అటూ యిటూ చూనస్తూ నెమ్మదిగా అన్నాడు మాధవచారి.

"ఏటి -?" కుతూహలంగా అడిగాడు బుల్లిబాబు.

"రాంసెంద్రంగారిని - సిన్నారావుబాబు కొట్టారంటండి-"

"స!- కొట్టుండరు - కొడతాననుంటారు" లోవరాజు-అన్నాడు

"అంటారంటారు - వూళ్ళో జనం గాజులు తగిలించుక్కూర్చుంటే - పయ్యూరోళ్ళు కొడతామనీ అంటారు-కొట్టినా కొడతారు-" అన్నాడు బుల్లిబాబు కాస్త ఉద్రేకంగా.

పదిహేను ఎకరాల ఆసామీ బుల్లిబాబు. అతనికి ఊరిని ఏలాలనుంది - అతని తండ్రి మనకెందుకొచ్చిన రాజకీయాలు - అని పడనివ్వటం లేదు.

"సిన్నారోవు బాబుగోరు - అంత తొందర పడే మడిసి గాదండి" - ఎవరూ మాట్లాడకపోయేసరికి లోవరాజే అన్నాడు.

"ఏటో!- ఏటి లోవరాజు - ఆరి మాట మాటాడతన్నావ్!"

"జనం మీద బతికాల్సిన మడిసి గదండీ బుల్లిబాబుగోరూ - జనాన్ని ఏలేవారి ఎనక నుండకపోతే అవుద్దంటండీ-"

"నిజం సెప్తే ఎందుకో అందుగ్గలిపేత్తారు - పెజ" - లోవరాజు అక్కడ నుంచి వెళ్ళిపోబోయాడు.

"ఆగవో - ఆగవో -" అంటూ చెయ్యి పట్టుకు ఆపాడు బుల్లిబాబు.

"నాకెందుగ్గానండి - బుల్లిబాబుగోరూ - సిన్నారోవుగారేం సిన్నోరుగాదు - ఇలాంటి యిసయాల్లోకి దిగిపోవడానికి - సెయ్యి జేసుకోడానికీ -" అన్నాడు లోవరాజు.

"వారికీ - వారికీ మధ్యన - ఎన్ని దొబ్బుదెగుళ్ళున్నాయో -" అన్నాడు ఓ కొత్త మనిషి. అందరూ అటు చూసారు. కాస్త నల్లగా - గుమ్మటంలా - మొహం మీద నామాలతో --

"తమరు-?" అన్నాడు లోవరాజు.

"మావూరు రాచభూపాలపురం - మా వూరికర్ణమే మీ రామచంద్రం"

"సెప్పండి - సెప్పండి - మీకే తెలియాలి అసలు సంగతులు -" అన్నాడు బుల్లిబాబు పట్టి పట్టి మాట్లాడుతూ.

"ఏం చెప్పమంటావు నాయనా - చిన్నారావు ఎలక్షన్లో నాగలివేపు - మా ప్రెసిడెంటు - ఇద్దరు గట్టానూ దాంతోనే పోతానూ అంటాడు. ఇహో - మా కర్ణం! ఆయనా - మా ప్రెసిడెంటూ ఒహటే రాసుకుపూసుకుతిరుగుతారు - దాంతో మా వూరంతా ప్రెసిడెంటు ఏం జెపితే అంత! మాలాళ్ళు తప్పిస్తే - తతిమ్మా అందరూ ఆవూ దూడకి గుద్దేసారు. ముందుగా అందరూ నాగలి-నాగలి అని చెప్పి - యిలా చేస్తే ఎలాంటి వాడికయినా మంటెత్తి పోతుంది గదా-"

"అందుకంటండీ - రామసెంద్రం గోరిమీద చెయ్యి జేసుకుంట" అన్నాడు బుల్లి బాబు.

"ఆమాత్రానికే - ఎవరు నాయనా - తన్నేది? మా కర్ణం - ముదుస్తుగా ఆ చిన్నారావు జీపు ఎక్కాడు - ఆ సమయానికి ప్రెసిడెంటు ఊళ్ళోలేడు - ఆయన వచ్చి యిదేంటయ్యా కరణం యిలా చేసావు - అని అడిగేనరికి - కచ్చుల్లోనే పారుకున్నాడు! ఉన్న వూరి దెయ్యమా - పొరుగూరు దయ్యామా - అని లెక్కలేసాడు! దానితో - చిన్నారావుకి మండిపోయింది - బ్రాహ్మడుగదా అని వదిలేసాడు -" అని మాట మధ్యలో ఆపి బస్సొచ్చిందని పరుగెట్టాడు.

"ఈయనకీ - రాంసెంద్రంగారికీ పడదనుకుంటాను -" అన్నాడు ఆచారి

"అన్నిటిలోనూ - రాజకీయమేఁ - స!" అన్నాడు లోవరాజు.

"మా పట్నం తోడల్లుడంటాడండీ - అయిదేళ్ళ కోసుట్టు ఓటేసే వోడికి రాజకీయాలక్కర్లేదు గాబట్టే - అయిదేళ్ళూ ఏలేవోడి ఆటే రాజకీయం - మాటే రాజకీయం-"

"అంత దెయిర్నం లేనోడు దిగ్గాడదు - ఊరి పరువు సెడగొట్టాడు రాం సెంద్రంగోరు-" అన్నాడు బుల్లిబాబు.

"ఆరంత సులువుగా ఒగ్గీరండి - పరశురాముడి పెళ్ళాం యింకా ఆయన సుట్టే తిరుగుతుందండి-"

## 5

భద్రాచలం తల దిమ్మెత్తినట్లు ఉండిపోయాడు.

కాస్తతేరుకుని - "పెతి పైసాకీ లెక్కసూసుకుంటాడా ముసలయ్యా - ఆడికి అప్పా? నాను నమ్మను గాక నమ్మను అన్నాడు.

"మానియ్యావో భద్రాచలం - మానియ్! బూమిలో బూమి కలుస్తాదని ఆసి పడ్డావు - తప్పులేదు - ముందూ ఎనకా సూసుకోలేదు - ఓ పత్రం పాడూ లేకుండా ఆ ముసలయ్యగాడి కేసుకు మదుపు యెట్టావు - సిన్నారావు బాబున్నాడని నీ దెయిర్యం - ఇప్పుడా ముసిలయ్య - బూమి మొత్తం తనఖాలో ఉందని తెలుసుకోలేకపోయావు - అనుభవించు" అనేసి ఆ మనిషి వెళ్ళిపోయాడు.

భద్రాచలంకి ప్రాణం ఉసూరుమంది.

ఇదంతా నిజమేనా?- వందోమారు ప్రశ్నించుకున్నాడు. ఆ రోజు రాత్రి సిన్నారావు బాబుగారి మనిషి వచ్చి పిలిస్తే తను వెళ్ళాడు. ముసిలయ్య - వాడి తమ్ముళ్ళూ - ఓపక్క సిన్నారావు ఓపక్క. ఆ బాబు గుమాస్తా తనను పక్కకి తీసుకెళ్ళాడు. నిజమే! ఆ భూమిమీద తనకు ఆశవుంది - తన దగ్గర డబ్బూ వుంది! "సమయం జూసి ఓ నొక్కు నొక్కితే - ఆ భూమిని సవగ్గా కొట్టీయొచ్చు"- అన్నాడు గుమస్తా. నిజమే గదా! మూడు వేల రూపాయలు అప్పటికప్పుడు యిచ్చాడు - అది మొదలుకుని ఆ ముసిలయ్యో - ఆయన పేరు చెప్పి మరొకళ్ళో వచ్చి - తన దగ్గిర అడపాదడపా తీసుకుంటూనే వున్నారు - మొత్తం మదుపు ఏడు వేలకి చేరుకుంది. అలాగని వూరుకున్నాడా? ఎన్నిసార్లు ఆ బాబుకోసం తిరిగాడు - ఓ సారి కనిపిస్తాడు - ఓ సారి కనిపించడు - ఓమారు ఆ గుమాస్తా కనిపిస్తాడు - అంతామాయే! ముసలయ్యచేత వేలిముద్ర వేయించి ఓ పత్రం యిప్పించమంటే అలాగే అంటాడు - నామీద నమ్మకం లేదా అంటాడు. ఈ మధ్యలో అప్పలరాజు గాడొకడు - ఆడు ఆ పరశురాముడి పెళ్ళాన్ని ఎగసనదోసి కేసు మోపు చేసాడు. ఆ నూకరాజు గాడిని అన్నదమ్ముల్నించి తప్పించి - ఆ బూమి కోసమే సస్తన్నాడా? - ఆడికాడ అంత డబ్బు ఎక్కడుంది? ఏటో - అంతా మాయ!

"ఎవడా తనఖాపట్టినోడు?"

"యింకెవ్వడూ? నీ తోడల్లుడే!"

భద్రాచలం యింటికి చేరుకున్నాడు-

"ఇదంతా మీ బావ సేయించిందే"- అని పెళ్ళాం మీదకి ఒంటికాలుమీద లేచాడు.

"సాతకానోడా - యెల్లి మా బావమీద కలబడు - నన్నంటే యిల్లు నిప్పెట్టేత్తాను" అంది పెళ్ళాం.

## 6

అది బుధవారం సంత

సంత చావిళ్ళ దగ్గర ఒకటే జనం. సంతచేసుకున్న జనం వెళ్తూ వుంటే - వచ్చే వాళ్ళు వస్తూనే వున్నారు. రోడ్డు మీద బళ్ళు పోటానికి కూడా చోటులేదు.

చిన్నారావు కొత్తగా కొన్న చిన్నకారు హారన్ తెగ మోగుతోంది. జనం తప్పుకొని చోటుపడుతున్నారు. సంత జాగా దాటి, బయటకు చేరే సరికి, కారుకి అడ్డంగా నిలబడిపోయాడు భద్రాచలం. హారన్ కొట్టినా కదలకపోయేసరికి, విసుగెత్తిన డ్రైవర్ తలుపు తీసుకొని బయటకు వచ్చాడు.

ముందు సీట్లో అప్పలరాజునీ, వెనక సీట్లో చిన్నారావుబాబుతో రామచంద్రాన్నీ చూడగానే మరింత రెచ్చిపోయాడు భద్రాచలం.

వినోదం చూస్తున్న జనంలో చిన్నారావుని చూడగానే వినయం ప్రవేశించింది. వారు భద్రాచలాన్ని పట్టుకుని లాగేసారు. "తమరెల్లండి బాబయ్యా" అంటూ కారుకి చోటు యిచ్చారు.

కారు ఆ స్థలం నుంచి దూసుకుపోగానే - భద్రాచలాన్ని వదిలేసారు. - తాగుబోతు నాయాల - అని తిట్టారు. 'చేసిందంతా నీ తోడల్లుడయితే - ఆ బాబేం చేసాడు?' అని కూడా అన్నారు.

మరుసటి రోజు వీధిలో మంచం మీద దుప్పటి కప్పుకుని పడుకున్న అప్పలరాజుని భద్రాచలం నరికేసాడు - పొరపాటేం జరిగిందంటే - తల అనుకుని కాలు నరికాడు

## 7

ఇరవై ఏళ్ళు గడిచాయి.

ఇప్పుడు -

చిన్నారావుకి వంట్లో బాగోలేదు. హైదరాబాదులో అల్లుడు చేత కట్టించిన సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రిలో ఉన్నాడు. పెద్ద కొడుకు రెండవసారి మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసాడు.

రామచంద్రానికి కరణీకం అందరిలాగే పోయింది. అయినప్పటికీ అతను భూములు సంపాదించాడు. అయిదుగురు కూతుళ్ళకి మొగుళ్ళను సంపాదించాడు. ఇద్దరు కొడుకులకి ఉద్యోగాలు సంపాదించాడు.

అతని తమ్ముడు మరిడిరాజు మాత్రం పాతకాలపు యింటిలో వాలిపోతున్న పై కప్పు కింద బ్రతుకుతూ - చావు కోసం ఎదురు చూస్తున్నాడు. భార్య ఆ యింటా ఈ యింటా పనిచేసి తెచ్చిన దానితో అతని రోజులు గడుస్తున్నాయి.

హత్యానేరం మీద ఏడేళ్ళు జైలులో ఉండి - విడుదలయి వచ్చి ఏడాది తిరగకుండా చనిపోయాడు భద్రాచలం.

ఇటు ముసలయ్య భూమిని తనఖా పట్టుకుని, అటు దాని మీద ఆశతో వున్న భద్రాచలాన్ని బాగా మదుపు పెట్టనిచ్చి - ఒక దెబ్బతో అన్నిపిట్టలనూ కొట్టేసిన అప్పలరాజు దగ్గరే ఉండిపోయింది అతని మరదలు. కుంటికాలుతో తిరుగుతూనే కొడుకుని బెంగుళూర్లో పెట్టి చదువు చెప్పించాడు అప్పలరాజు.

పరశురాముడు బతికి బయటపడ్డా - ఆ కేసులో ముసలయ్య ఆఖరు తమ్ముడికి ఓ ఏడాది శిక్ష పడింది. ఆ తర్వాత ఆ అన్నదమ్ముల మధ్య పచ్చగడి వేస్తే భగ్గు మంటూనే వుంది.

చివరగా

ఆ వూళ్ళో ముసలయ్య కుటుంబం కూడా రైతులనిపించుకోటం మానేసి - పరశురాముడితోబాటు కూలికి వెళ్ళి వస్తూనే వున్నారు.

ఎప్పుడయినా ఎదురుపడితే -

'అద్దరూపాయగాళ్ళు' అంటూ వాళ్ళందరినీ జనం వేళాకోళం పట్టిస్తూనే వున్నారు.

**8**

సింగారం గ్రామం నిర్నిమిత్తంగా జీవితం కొనసాగిస్తోంది.

*('రచన' ఫిబ్రవరి, 2000)*

# తీర్థపురాళ్ళు

"ఈ ముసిల్నాకొడుకు - మాధిగోళ్ళు - మాదిగోళ్ళు - అంటూ వాళ్ళ వెనకాల ఏడుస్తాడేంటో? అసలు - వీడికి నాలుగు తగలనిస్తే - వాళ్ళు ఉచ్చోసుకుంటారు-"

ఆ మాటలు బరిసల్లా గుచ్చుకున్నాయి.

భద్రాచలంలో కోపం భగ్గుమంది. క్షణ క్షణానికీ- అది రాజుకుంటోంది.

కొడుకు కలగజేసుకోలేదన్న విషయం, ఆ వృద్ధుని మనసుని మరింత దహించి వేస్తోంది.

"ఆ మాటలు అన్నది తనమనవడే- వాడిలో ప్రవహిస్తున్నది తన రక్తమే- కాని, ఆ మాటలు తనవి కావు. ఆ మాటలు తమ కుటుంబాలలోంచి ఎవరూ అనగలిగినవి కావు. అవి తాము తరతరాలుగా పడుతున్నవి. వింటున్నవి.

ఆ మాట- ఆ గొంతు- బాపన మాట- బాపన గొంతు. తోటి మనిషిని కిందకి తోసి-విడదీసి-'వాళ్ళు' 'వాళ్ళు' అంటూ గుర్తించే బాపన యాస.

అది వీడికి ఎలా అంటింది? ఏనాడు అంటింది?"

భద్రాచలం తన గదిలోంచి, హాల్లోకి అస్థిమితంగా తిరుగుతున్నాడు. హాల్లోకి వచ్చినపుడల్లా కొడుకు గదివయిపు చూస్తున్నాడు. చూసినపుడల్లా ఆ గది తెరిచిన తలుపూ. అందులోంచి కొడుకు మెలకువగా ఉన్నాడని గుర్తు చేసే లైటు వెలుతురూ అతని చూపులని పట్టుకుంటున్నాయి.

ఆ వృద్ధుడు ఆవేశాన్ని తట్టుకోలేకపోయాడు. దాన్ని అణుచుకోవడానికి ప్రయత్నిస్తూ తన గదిలోకి వెళ్ళాడు. బట్టలు మార్చుకున్నాడు. సగం చేతుల చొక్కా, సగం కాకీ పాంటూ, బొడిపల జోళ్ళూ...వేగంగా బయటకు వచ్చాడు.

విశాలమైన హాలు. ఇరవై ముప్ఫై సైజులో వుంది. తివాచీ, దానిమీద పొడవాటి సోఫా ఒకటి కొన్నికుర్చీలూ ఒక మూలగా వున్నాయి. అక్కడ కూర్చున్నవాళ్ళ చూపులను ఆకట్టుకునే రెండు నిలువెత్తు పోటోలు. అందులో

ఒకటి అంబేద్కర్‌ది, రెండవది తనది. అంటే భద్రాచలానిది. రిక్షాలాగే భద్రాచలానిది. ఆరున్నర అడుగుల ఎత్తు భద్రాచలానిది.

ఆ ఫోటో తన కొడుకు ప్రేమాభిమానాలకు నిదర్శనం కాదుట-వాదిస్తుంటాడు మనవడు రాహుల్.

భద్రాచలం ఆ ఫోటో నుంచి దృష్టి మరల్చుకుని, ఇంట్లోంచి బయటకు వచ్చాడు. ఇంటికీ ప్రహారీ గోడకీ మధ్య చక్కగా పెంచిన లాన్. మధ్యలో కారు వెళ్ళే బాట. దానికి అటూ యిటూ గోడల్లా పెరిగిన మొక్కలు.

రోడ్డుమీదకు వచ్చి, వెనక్కి తిరిగి యింటిని చూశాడు.

ప్రహారీగోడ నల్లటి గ్రానైట్ రాతిలో పొదిగిన ఇత్తడి అక్షరాలు. ప్రొఫెసర్ ఆరోగ్యమూర్తి...కృషి..

అది ఆ యింటి యజమాని పేరు. ఆ ఇంటి పేరు.

మెల్లగా భద్రాచలం నడవసాగాడు.

కలెక్టరాఫీస్ డౌన్‌లోకి వచ్చాడు. సముద్రం వయిపుగా నడుస్తున్నాడు. రాత్రి తొమ్మిదవుతోంది జనం రద్దీగా ఉన్నారు.

ఒకప్పుడు- జనం ఆ సమయానికి అక్కడొకరూ- ఇక్కడొకరూ ఉండేవారు. నల్లగా, ఎత్తుగా, తెల్లని ఒత్తైన మీసాలూ, గిరజాలూ.... ఆ వృద్ధుడు కొన్ని నెలల క్రితం...స్నానాల గదిలో పాలిష్ చేసిన మొజాయిక్ ఫ్లోరింగ్ మీద జారిపడ్డాడు..తుంటికి దెబ్బ తగిలింది. నడకలో తేడా తెలుస్తోంది.

ఆ క్షణంలో...అతనికేదో కొత్తగా తెలిసినట్టుంది. అది-మార్పు.

నిజమే- రోడ్డు మారింది, లైట్లు మారాయి. జనం పెరిగారు. వాహనాలు పెరిగాయి. నావల్ కోస్ట్ బాటరీ స్థలంలో రోడ్డు పడింది. సముద్రానికి ఎదురుగా అపార్ట్‌మెంట్లు వచ్చాయి. సముద్రపు ఒడ్డునే రోడ్డు... మధ్యగా సెపరేటర్... దానిమీద... దీపం స్తంభాలు... ఒకటూ...రెండూ... ఎన్నో వచ్చాయి. రోడ్డుపక్క పిట్టగోడ. కూర్చోటానికి బెంచీలు. పార్కు... రెస్టారెంటు.. ఎన్నో వెలిసాయి. అవి ఒక్క రోజులో రాలేదు. కాని... ఎవరో మాంత్రికుడు అప్పుడే సృష్టించినట్లు చూస్తున్నాడు భద్రాచలం.

భద్రాచలం మెల్లగా నడుచుకుంటూ సముద్రానికి దగ్గరగా ఇసుక మీద కూర్చున్నాడు.

అన్నీ మారిపోయాయా?

లేదు- తీర్థపురాళ్ళు మారలేదు. జనానికీ సముద్రానికీ మధ్య ఆ డవున్లో అవి అలాగే ఉన్నాయి. సముద్రపు దెబ్బలతో వేలాది సంవత్సరాలుగా దెబ్బలుతింటూ అవి అలాగే ఉన్నాయి. అందువల్లే కాబోలు మనిషి దెబ్బలకి తట్టుకోగలిగాయి.

అతని మనసంతా అదోలా అయిపోయింది. కనీసం తనతోబాటు అవి కూడా మారలేదన్న ఏదో భావన అతనికేదో స్వాంతన యిస్తున్నట్లుంది.

ఒకటా- రెండా- అరవై ఏళ్ళు అయిందేమో! ఆ రాళ్ళని తను చూస్తున్నాడు. అవీ తనని చూస్తున్నాయి.

ఎవరో సమీపంగా రావడంతో భద్రాచలం దృష్టి చెదిరింది. అటు చూశాడు. ఇద్దరు యువతీ యువకులు... తెలుస్తూనే ఉంది పేదరికం. తెలుస్తూనే ఉంది జాగాలేనితనం.

భద్రాచలం మనసుమీదకు నూకాలు పరుగెత్తుకువచ్చింది.

ఆమె వెనకే ఎందరో...విశ్వనాథంబాబు...చాత్రిబాబు...బ్రహ్మం...

ఏవేవో దృశ్యాలు దృశ్యాలుగా...

జ్ఞాపకాల కొలిమి రాజుకుంది.

☆ ☆ ☆

ఏలేటి ఒడ్డున పెద్ద పెద్ద ఆకాశమల్లీ, నిద్రగన్నేరూ....చెట్లకింద మూడు వేపుల పొలాలతో... ఒకపక్క ఏటివారగా రోడ్డుతో...చలచల్లగా ఉండేది మరులోవ. ఆ ఏటి నీళ్ల తాగి నలుపు తిరిగిన వరిపొలాల పచ్చదనం మీద పచ్చపచ్చగా ఉండేది మరులోవ.

ఊరి అంచున ఒదిగి ఒదిగి వినయంగా బ్రదుకుతూ...ఊరికి ఊడిగం చేసుకుంటూ...పెద్ద కులాల పెద్ద మనసే అన్నం పెడుతున్నదన్న భ్రమలో...శాంత శాంతంగా ఉండేది మాలవాడ.

'అక్కడ నడవనిచ్చిన జాగా తమది. నిలువనిచ్చిన గుడిసె తమది. పాలికాపులుగా, కూలీలుగా ఉండనిచ్చి, కొలిచిచ్చిన వడ్లు తమవి. కప్పుకోటానికి పారేసిన కంబళీ తమది. కట్టుకోటానికి యిచ్చిన గోచిగుడ్డా, మొలతాడూ తమవి.

అంతే- అవే- వాడలో మగవాళ్ళ సొంతం.

చేతికిచ్చిన బడిత కూడా వాళ్ళ రక్షణకే! తమకిచ్చినవన్నీ కూడా తమని బ్రతికించి ఉంచి ఊరిని మోసేందుకే! చివరికి కట్టుకున్న ఆడది కూడా తమతో బాటు ఊడిగంచేసేందుకే!

తయారుచేసిన వేదాంతాలూ...కొనసాగిస్తున్న సంప్రదాయాలూ...కూడా తమని వంచి, అమరించి ఊరికి అందించేందుకే!'

ఆనాటి ఆ మాలపల్లెకి- ఆ మారుమూల పల్లెల్లో అంచున జీవించే వాడకి- అలాంటి భావాలు ఉండేవి కావు. ఇలాంటి ఆవేశాలూ, ఆలోచనలూ ఉండేవి కావు.

ఈనాడయినా... వాడలకు ఇలాంటి అర్థాలు తోస్తున్నాయా? ఇలాంటి ఆవేశాలు వస్తున్నాయా?

ఏమో! ఈనాడు తన మనవడు రాహుల్ పెదవి విప్పితే- కలం దులిపితే- పదంచెక్కితే-అదే రాగం అదే పద్యం- అదే బొమ్మ.

ఆ రాగం వింటే- ఆ పద్యం చదివితే- ఆ బొమ్మ కనబడితే- వందలాది ఏళ్ళుగా అనాచ్ఛాదిత శరీరాలతో, భూమిని దున్ని, విత్తులు నాటి, కుప్పలు నూర్చి, బస్తాలను మౌనంగా బళ్ళకెత్తిన వాళ్ళూ...రాజులూ, రారాజులూ, చక్రవర్తులూ, మహా చక్రవర్తులూ...యుద్ధాలు చేసి రాజ్యాలు నిర్మించి జేతలుగా విజేతలుగా నిలిచిపోవడానికి తమ జీవితాలను అసంపూర్తిగా చరిత్రలలో కలిపేసిన వాళ్ళూ... తమవాళ్ళు, తమ గుంపువాళ్ళు, గుంపులు గుంపులుగా విడదీయడ్డవాళ్ళు... తమ పూర్వీకులు- కళ్ళ ముందు నిలబడేవారు.

నిన్నటి వరకూ-

తన మనవడూ వాడి స్నేహితులూ చేస్తున్నది తమవాళ్ళకి మేలుకొలుపుగా అనిపించింది.

ఈ రోజు-సందేహాలు-సందేహాలు.

ఈ రోజు వాడలన్నీ- ఈ కుర్రాళ్ళలా ముక్కలవుతున్నాయా?

ఆనాడు- మరులోవలో- ఊరికీ కరెంటు లేదు. వాడకీ కరెంటు లేదు. ఇప్పటిలా ఒకపక్క విద్యుద్దీపాలూ మరోపక్క సీమనూని దీపాలూ ఉండేవి కావు. ఉన్న తేడా కొట్టొచ్చినట్లు కనిపించేది కాదు.

పొలం నుంచి యింటికి వస్తున్నాడు. నల్లటి ఆకాశానికి చిల్లుల్లా చుక్కలు. భయం భయంగా భద్రాచలాన్ని చుట్టుముట్టిందివాడ.

"ఆ అయ్య యిమ్మన్న కాగితం ఈ అమ్మకిచ్చాడు. ఈరిచ్చినది ఆరికిచ్చాడు. ఆ కాగితాల్లో ఏముందో ఏటో- ఈడేం సదుంకున్నాడా? ఆరిద్దరూ లెగిసిపోతే ఈడేంజేత్తడూ? ఈడి పేనాలు దీస్తావని సిందులు తొక్కుతున్నారు-" అన్నాడు అన్న తమ్ముడిని పొదివిపట్టుకుని.

"అందుకేనబ్బీ-అనుబగిత్తాడు-"అంది వాడ.

పెద్దవాళ్ళు భయపడుతూ, భయపెడితే కుర్రాళ్ళు భయపడుతూ- ఎవరి గుడిసెలలో వాళ్ళుంటే ఏదో రక్షణ ఉంటుందనుకుని- అలికిడి తగిలితే పీతలు బొరియల్లోకి జారిపోయినట్టు- ఆ కుటుంబాన్ని ఒంటరిగా వదిలేసి- కకావికలయిపోయింది వాడ.

అన్నగారు భద్రాచలాన్ని ఏలేరు దాటించాడు. పదకొండేళ్ళ నూకాలు మొగుడిని వదలనంటే చావో బ్రతుకో కలిసి చేయండి: అంటూ జి.యన్.టీ. రోడ్డుకి తీసుకొచ్చాడు. ఓ లారీ ఆపి ఎక్కించాడు. 'నువ్వు బతికుంటే సాలురా తమ్ముడూ.' అంటూ భీముడు లాంటి మనిషి కళ్ళ నీళ్ళతో సాగనంపాడు.

విశాఖపట్నంలో పడ్డారు. భద్రాచలమూ, నూకాలూ

సెలక్ట్ టాకీసు సమీపంలో, రైలు పట్టాల పక్కగా, కిక్కిరిసిన గుడిసెలలో, కిక్కిరిసిన మనుషుల్లో కలిశారు. ఒకపక్క పోర్టు...ఒకపక్క రైలు స్టేషనూ... దూరంగా వాల్తేరూ...సముద్రం...రాతి భవనాలూ...టర్నర్ చౌల్ట్రీ...కురపాం మార్కెట్... కలగలసిన విశాఖపట్టణం పెరుగుదలలో అనామక భాగస్వాములు అయారు.

యుద్ధం....పరుగులు తీసే మిలటరీ లారీలు..బాంబులు పడ్డాయి.... పడతాయి వార్తలు... గాంధీ జై..నెహ్రూ జై...నినాదాలు... డౌన్ విత్ బ్రిటిష్ ఇంపీరియలిజమ్... డౌన్ విత్ ఫాసిజం... డౌన్‌విత్ నాజీజం... నినాదాలు... కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ పాటలు...ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా... కూలోళ్ళ గొంతులో కొన ఊపిరుంటేను...కార్మికుల్ కర్షకుల్ కరము కరమూ కలిపి...చెంగల్రావు పేట బీచిలో సభలు..

అదో కాలం! అదో ప్రపంచం! అదో పట్నం! దానితో- ఏ సంబంధమూ లేని...రిక్షాలాగుతూ...భద్రాచలం...ఆ పనీ యీ పనీ చేసుకుంటూ నూకాలూ...ముచ్చట్లు ముచ్చట్లుగా వాళ్ళదో కాలం! వాళ్ళదో ప్రపంచం!

ఆ రోజుల్లో- ఆ ప్రపంచం భద్రాచలానికి కుతూహలకరంగా... అందరానిదిగా... అందుకోలేనిదిగా... పొట్టకింత తిండీ..నూకాలు పొట్టలో కదలాడే జీవి విడుదల కోసం ఆశా... అవే సమస్తంగా...

లోలోపలి ప్రపంచం నిండా భయాలు..ఎవర్నిని ముడితే ఏం పాపమో...ఏ చెడుపు జరుగుతుందో... బట్టలున్న యినప పెట్టెలు ముట్టొచ్చా...రిక్షా ఎక్కేవాళ్ళు తమని అంటొచ్చా..తమ గుడిసెల్లోనే ఏవేవో కులాలు... ఎవరెవరో మనుషులు... ఎవరో ఏంటో సందేహాలు...

భద్రాచలం మనసంతా ఆ రోజులను తడుముతోంది.

ఏది తడిమినా...ఒకటే తడి!

కడుపులో బిడ్డ కడుపులో పోతే...కడుపులో పెట్టుకుని కాపాడిన మనుషులు..ఘోషా ఆస్పత్రి...ముక్కూ మొహం తెలీని మొహాలు...

రిక్షా లాగి లాగి సొమ్మసిల్లి శోష తగిలి పడిపోతే...పట్టుకుని ఆపి...మొహాన ఇన్ని నీళ్ళుజల్లి...ఉన్నదాంట్లో యింతపెట్టి...ఏ ప్రతిఫలమూ ఆశించకుండా... వెళ్ళిపోయిన వాళ్ళూ...

ఎవరెవరో గుర్తుతెలీని మనుషుల గుర్తుల తడి...!

సొతంత్రం వచ్చిందట- వచ్చేసిందట-

రిక్షా ఎక్కేవాళ్ళు చెప్పారు. అతనికి తెలియనందుకు నవ్వారు. కురపాం మార్కెట్టు కూలీలు చెప్పారు...రేపటితో తమ కూలి బతుకు ముగిసిపోతుం దన్నంత ఉత్సాహంగా చెప్పారు. .

అయితే- తను మరులోవ వెళ్ళొచ్చా? తన వాడలో తన వాళ్ళతో బ్రతకొచ్చా?

భద్రాచలం ఎవరినీ ప్రశ్నించలేదు. తనలో తను చర్చించలేదు. కాని...మరులోవ వెళ్ళే ప్రయత్నం మాత్రం చెయ్యలేదు.

అంతా అయోమయంగా...వాళ్ళ అజ్ఞానానికి చుట్టుపక్కల వయసులో పెద్దవాళ్ళ అజ్ఞానమే తోడుకాగా...ముగ్గురు బిడ్డలు పుట్టకముందే చనిపోగా...అది ఏ పాపఫలమో అర్థం కాకపోగా...అనుక్షణం పాపాలు చేస్తున్నామన్న భయాలు చుట్టుముట్టగా...బ్రతుకుతున్న నూకాలుకీ, భద్రాచలానికీ...పుట్టాడు అన్నారం.

అన్నారమే వాళ్ళ చిన్న ప్రపంచానికి పెద్ద దిక్కుగా...వాడే సమస్తంగా...ఏ రోజు బ్రతుకు ఆ రోజుకే ప్రధానంగా జీవించారు భద్రాచలం, నూకాలూ.

వాళ్ళ చిన్న ప్రపంచం అకస్మాత్తుగా కుప్పకూలిపోయింది.

లాగుతున్న రిక్షాని టవున్ బస్ గుద్దేసింది. రిక్షా నుజ్జునుజ్జు అయిపోయింది.

భద్రాచలం మనను ఆ ప్రమాదం జరిగిన క్షణాలను తడమటాన్కి-ప్రయత్నించింది.

ఎవరు వాళ్ళు...? ఏ కులం వాళ్ళది? తనని మోసుకొచ్చి ఆస్పత్రిలో చేర్చిన వాళ్ళెవరు? స్పృహ వచ్చేవరకూ ఉండి- తన ఆరాలు తీసి- రిక్షా వాళ్ళకు ఆనవాళ్ళు చెప్పిన వాళ్ళెవరు? ఆనవాళ్ళు పట్టుకుని వెదుక్కుంటూ యిల్లు చేరి నూకాలుని పట్టుకొని ఆమెని ఆస్పత్రికి చేర్చిన వాళ్ళెవరు?

నూకాలు...ఆ రోజుల్లో తనను ఎలా బ్రతికించుకుంది? ఆస్పత్రికి దగ్గరగా, రెల్లి వీధిలోకి ఎవరి సాయంతో మకాం మార్చింది! రెండు నెలలపాటు ఆస్పత్రిలో మరో రెండు నెలలపాటు ఇంటివద్ద తనను ఉంచి ఎన్ని రకాలుగా శ్రమ చేసి, చాకిరీ చేసి, సేవ చేసి- తనను నడిపించింది?

అప్పుడు మొదలయింది- తీర్థపురాళ్ళతో భద్రాచలం అనుబంధం! ఆస్పత్రి నుంచి బయట నెమ్మదిగా నడవసాగాడు. ఆ డవున్లో నడుచుకుంటూ వచ్చి ఆ రాళ్ళ దగ్గర కూర్చునేవాడు. దూరంగా యారాడ కొండ- లైట్‌హవున్ కాంతి-సముద్రానికి ఎవరో దండలు తగిలించినట్లు కనపడని ఓడల దీపాలతోరణాలు.

ఒక్కోమారు అనిపించేది-సముద్రంలో దుమికి చనిపోతే- నూకాలుకి కొద్దిగానైనా బరువు తగ్గుతుంది గదా! కాని, చనిపోలేదు. ఆరాళ్ళని చూస్తూ-నూకాలూ, అన్నారమూ ఇసుకలో ఆడుకుంటూంటే- ఎలా బ్రతికేడో! ఎవరో ఓదార్పు మాటలు ఆడుతున్నట్లుండేది - ధైర్యం చెపుతున్నట్లుండేది ఆ వాతావరణం.

రిక్షా తొక్కవద్దన్నారు ఆస్పత్రి డాక్టర్లు.

ఎలా బ్రతకటం?

ముంత కింద పప్పు అమ్ముకునే వాళ్ళని చూస్తూంటే- భద్రాచలానికి ఆ పనిమీద ఆలోచన కలిగింది.

వద్దంటే వద్దంది నూకాలు.

"మనం మాలాళ్ళం మామా!-పాపం" అంది.

"అయితే అయ్యిందిలే- కూడుదొరుకుద్ది" అన్నాడు.

నిజంగానే బేరాలు బాగుండేవి. నాలుగురాళ్ళు మిగిలేవి. అంతా బాగుందనుకుంటుండగా-

ఏడాది దాటి- అడుగులు వేస్తున్న అన్నారానికి జబ్బు చేసింది. ఆడుకుంటూ ఆడుకుంటూ విరుచుకు పడిపోయాడు బిడ్డడు. పళ్ళు గిట్ట గరిచేసాడు. ఒళ్ళు చల్లబడింది.

ఇంటికి వచ్చిన భద్రాచలాన్ని పట్టుకుని బావురుమంది నూకాలు. గుబగుబలాడుతున్న గుండెలతో ఆస్పత్రికి పరుగెత్తాడు. వైద్యులు పరీక్షలు చేస్తున్నారు. ఇద్దరినీ బయట కూర్చోమన్నారు.

తనమీదా, తన బిడ్డమీదా ఒట్టేయించుకుంది నూకాలు. ఇదంతా ముంతకింద పప్పు అమ్మటం వల్లనే అంది. ఇంక ఆ వ్యాపారం చేయనని ఒట్టువేసాడు. చెంపలు వేసుకున్నాడు.

బిక్కుబిక్కుమంటూ ఆస్పత్రి అరుగుల మీద బిడ్డడి ఆరోగ్యం కోసం దేవుళ్ళను వేడుకుంటూ గడిపారు.

తెల్లవారుతూండగా- నర్సువచ్చి- బిడ్డని చూసుకోమంది.

'సూసావా- పెమానం సూపించింది' అంటూ అన్నారాన్ని గుండెలకు హత్తుకుంది నూకాలు.

ఇంటికి వస్తూ- "చుట్టలమ్ము- బీడీలమ్ము- తినుబండారాలు అమ్మొద్దు మామా-" అంది నూకాలు.

సిగరెట్లు, బీడీలు ఓ అట్టపెట్టెలో పెట్టుకుని కూర్చున్నాడు. ఓడల నుంచి ఒకతను ఫారిన్ సిగరెట్టు పెట్టెలు తెచ్చి అమ్మమన్నాడు. జీవితం ఏదోలా గడిచిపోయింది.

అలా గడిస్తే ఏమయ్యేదో- అనుకున్నాడు భద్రాచలం.

భద్రాచలం కళ్ళ ముందు విశ్వనాథం నిలిచాడు.

☆ ☆ ☆

కాస్తపొట్టి, పచ్చని శరీరఛాయ, విశాలమైన పెద్దనుదురు. స్ఫుటమైన మొహం. ఆ నుదురు మీద చాదు బొట్టు. విశ్వనాథం నవ్వు. మెత్తటి మాట. ఖద్దరు బట్టలు. ఆ బాబే లేకపోతే...? అనుకున్నాడు భద్రాచలం.

ముంతకింద పప్పు అమ్మే రోజుల్లో ఆయన పరిచయమయాడు. అప్పుడప్పుడు సముద్రపు ఒడ్డుకు వచ్చేవాడు. ఏవో బొమ్మలు వేసుకునేవాడు.

సిగరెట్లు అమ్ముతూండటం చూసి- 'ముంతకింద పప్పు మానేసావేం?' అన్నాడు. భద్రాచలం జవాబు విని పకపకా నవ్వాడు. పదమంటూ యింటికి వచ్చాడు. యింట్లో నులక మంచం మీద కూర్చున్నాడు. నూకాలుని పలకరించి 'మంచినీళ్లు యివ్వవే' అన్నాడు. 'ఇలా వచ్చి కూర్చోరా భద్రాచలం' అని బలవంతంగాపక్కన కూర్చోబెట్టుకున్నాడు. అన్నారాన్ని ఎత్తుకున్నాడు. నూకాలు వణుకుతూ తెచ్చిన గ్లాసుని అందుకుని గటగటా తాగేసాడు.

అప్పటి నుంచి భద్రాచలాన్ని తన వెనక తిప్పుకున్నాడు.

ఓ కొత్త ప్రపంచాన్ని చూపించాడు. ఖద్దరు- గాంధీగారు- హరిజనోద్ధరణ- స్వతంత్ర పోరాటం- జైళ్ళు- ఎన్నెన్నో మాట్లాడాడు. అక్షరాలు దిద్దించాడు. వాక్యాలు చదివించాడు. మెట్రిక్ కట్టించాడు.

'గాంధీగారి పుణ్యమా అని మీ హరిజనులకి బోల్డన్ని ఉద్యోగాలు వస్తాయి. నువ్వు మెట్రిక్ అయితే చాలురా భద్రాచలం- నీకు తిరుగుండదు. నువ్వొక్కడివి బాగుపడితే నీ పేట బాగుపడుతుంది. నీ పేట బాగుపడితే ప్రతి పేటా బాగుపడుతుంది. అప్పుడు మాలలుండరు. మాదిగలు ఉండరు. ఆ పేర్లుండవు. రాజ్యాంగంలో రిజర్వేషన్ల కోసం పెట్టిన పదేళ్ల గడువు కూడా పట్టదు. నెహ్రూ గారు చల్లగా ఉంటే-" అనేవాడు.

విశ్వనాథం అనుకున్నట్టవలేదు.

భద్రాచలం మెట్రిక్ డింకీలు కొడుతోంది. కాంగ్రెస్ పోతుందని గోల మొదలయింది.

'పోయినా పోతుంది- నెహ్రూగారు ఎంత మొత్తుకుంటే ఏం లాభం! గాది కింది పందికొక్కులు చేరాయి. నిన్నటి వరకూ బ్రిటిష్ తొత్తులయిన వాళ్ళు ఈ రోజు కాంగ్రెస్ పెద్దలవుతున్నారు. ఆ పెద్దాయన కళ్ళుగప్పి దేశాన్ని తినేస్తున్నారు. ఈనగాచి నక్కల పాలు చేస్తారేమో! తెల్లోళ్ళని తరిమేసి ఈ దేశాన్ని కమ్యూనిస్టులకు అప్పజెపుతారేమో! ఆ పెద్ద ప్రాణం గుటుక్కుమంటే ఈ దేశం హరీ అంటుంది.-' అనేవాడు విశ్వనాథం.

భద్రాచలం ఏదయినా ప్రశ్నించితే-

"కమ్యూనిస్టులా? ఈ దేశం ఉప్పు, నీళ్ళతో బ్రతికి- రష్యాను పొగిడేవాళ్ళు ఇంగ్లాండ్‌వాళ్ళు పోయి రష్యావాళ్ళు రావాలనేవాళ్ళు- రష్యా డబ్బుతో కాంగ్రెస్ మీదకి కాలుదువ్వే దేశద్రోహులు-" అంటూ పళ్ళు కొరికేవాడు.

ఆయన మాటలు భద్రాచలానికి అర్థమయీ అవనట్టుండేవి. నిష్టలవారి వీథిలో ఆయన యింటి వాటాలోకి బంధువులెవరూ వచ్చేవారు కాదు. బ్రహ్మచారిగా...ఒంటరిగా...తన బొమ్మలతో...తన చదువుతో తనతో తనే?... ఉండేవాడు.

భద్రాచలానికి ఆ మాటలు అతను తాకరాని, తాకలేని ఏదో ప్రపంచంలోకి స్వాగతం పలుకుతున్నట్లుండేవి. అంత పెద్దాయన వంగి తనకు చేయి అందించి పైకి లేపుతున్నట్లుండేవి. అదో విధమైన ఆనందం- కృతజ్ఞత- విశ్వాసం... భద్రాచలంలో నిండేవి.

విశ్వనాథం మంచాన పడ్డాడు. నూకాలూ,, భద్రాచలమూ ఆహర్నిశలూ సేవలు చేసారు. ఫలితం లేకపోయింది.

"భద్రాచలం- నాకు చావంటే భయంలేదు. జీవితమెంత తప్పనిసరో చావూ అంతే! జీవితం ఓ అవకాశం. ఈశ్వరుడిని అర్థం చేసుకొనే అవకాశం. ఈశ్వరుడిని అర్థం చేసుకోటమంటే ఆయన సృష్టిని అర్థం చేసుకోవడం... అంటే... మనిషిని అర్థం చేసుకోవడం...అందరినీ ప్రేమించు- అన్నింటినీ ప్రేమించు- నాకు కోరికలు లేవు.

కానీ- ఒకే ఒక్క కోరిక ఉంది. నా దగ్గర వేలాది పుస్తకాలున్నాయి. అవి నా దాయాదులకు అవసరం లేదు. వాళ్ళకి కావాల్సింది ఈ యిల్లు- ఈ జాగా- ఈ ఆస్తి. నాతండ్రి రాసిన వీలు ప్రకారం దీనిని అన్యకులస్థులకీ, మతస్తులకీ యిచ్చే హక్కు నాకు లేదు. నేనుండగా ఈ వైపు చూడనైనా చూడని వాళ్ళు- పసుపు నీళ్ళని జల్లుకుని- నేను చావగానే ఈ వాటాని ఆక్రమించుకుంటారు. వాళ్ళకి అవసరం లేని నా సంచితమైన ఈ పుస్తకాలు నాతో బాటే చావరాదురా!

భద్రాచలం- ఈ రోజు నాకళ్ళ ఎదురుగానే ఈ పుస్తకాలు నువ్వు తీసుకుపోరా! వీటిని కావల్సిన వాళ్ళకి వీటిని చేర్చు! ఊరికినే యిస్తే అక్కర్లేని వాడు కూడా తీసుకుపోయి తమ బీరువాలో పెట్టి తాళం వేసుకుంటాడు. కనుకనే వీటిని అమ్ము. ఇవి నీకు దగా చేయవు. నీకు తప్పకుండా తిండి పెడతాయి" అన్నాడు.

విశ్వనాథం తన స్వార్జితాన్ని భద్రాచలానికి యిచ్చి ఆఖరు మాటగా- 'చదువుకోరా- భద్రాచలం' అని చెప్పి నిష్క్రమించాడు.

అలా మొదలయింది భద్రాచలం సెకండ్ హేండ్ పుస్తకాల వ్యాపారం.

అలా మొదలయింది విశాఖపట్టణం మేధోసమాజంతో పరిచయం.

ఆ రెండేళ్ళలో-

రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు, అంగర సూర్యారావు, అంగర వెంకట కృష్ణారావు, మసూనా, భమిడిపాటి రామగోపాలం, గణపతిరాజు సోదరులు, బలివాడ కాంతారావు, రామకోటి... ఎందరెందరో... రకరకాల రచయితలు...

ఒకరితో ఒకరు... ఒక వివరణాతీతమైన గొలుసులో ముక్కలు... చూపుల్నిండా ఆకలి... మాటల నిండా ఆకలి...పుస్తకాల పట్ల ఆకలి...ప్రపంచం పట్ల ఆకలి...ఒకరికోసం ఒకరు ఎదురుచూస్తూ... కబుర్లు...కబుర్లు..

ఆ కబుర్లు ఏవో ఇంద్రజాలకుడి మాటల్లా...వింటున్నకొద్దీ వినాలని... చూపిస్తున్న ప్రపంచాన్ని చూడాలని...

భద్రాచలం మనసంతా రావిశాస్త్రి మీద నిలిచింది.

కొన్నాళ్ళు షరాయా కళ్ళీ లాల్చీతో...యవ్వన ప్రకాశంతో వెలిగే మొహంతో... ఎదుటివారి జీవుడిని పట్టే చూపులతో...

చాన్నాళ్ళు...పాంటూ, ఇన్‌షర్టూ, బెల్టూ... మామూలు మనుషుల్ని కావలించుకుని, మహా-మనీ-షి-లను బెంబేలు పెట్టే చూపుల్తో... నడుస్తున్న విశాఖపట్టణంలా... ఎగసిపడుతున్న సముద్రంలా....తానే ఓ దారి దీపంలా...

భద్రాచలం మనసంతా- నిరాకార స్పందనకి- ఆకారమియ్యాలన్న ఆరాటంతో...నిండిపోయింది.

"హిందూ రీడింగ్ రూంలో విశాఖ రచయితల సంఘం మీటింగు ఉంది వాయ్ భద్రాచలం"అన్నాడొకరోజు.

"యిన్నాను బాబయ్యా"

"ఏంటివాయ్- యింకా నువ్వు తూగోయాస వొగ్గేనీదు- మీటింగ్‌కి రావోయ్"

"అదేంది బాబయ్యా- తవరంతా మాటాడుకునీయి నాకేటి బోదవుతాయి?"

"అలాగనీకో- నీకు అర్థంగానియ్యి మేం మాట్లాడినావనుకో- అయ్యి మాటలుగావు- రాసినావనుకో- అయ్యి కతలూగావు- నువ్వినాల- మేం సదవాల"

శాస్త్రిబాబు తనయాసలో మాట్లాడటానికి ప్రయత్నిస్తే- భద్రాచలానికి విశాఖపట్టణంలో మరులోవలా ఉండేది. మరులోవలో మాలవాడలా ఉండేది.

అలా మొదలయింది భద్రాచలం రచయితల సమావేశాలకు వెళ్ళటం. అందరి మాటలూ భక్తిగా వినేవాడు... ఎవరు ఎంత చెప్పినా వెనక బెంచీలలోనే కూర్చొనేవాడు. వేదిక మీద మాటలు... వెనక బెంచీల వ్యాఖ్యానాలు... ఏమీ అర్థమయ్యేవి కావు.

రావిశాస్త్రి ఉపన్యాసంలో కథలూ... ఆయన తర్కం- భద్రాచలానికి అందేవి.- పెళ్ళాన్ని పట్టుకుపోతే రాముడు రావణున్ని ఏం చేసాడు? వేసేసాడు. ఆ 'వేసెయ్యటం శభాష్ అన్న వాల్మీకి ఏం చేసాడు? కథ రాసాడు. మేమూ అదే కథలు చేసాం!- అంటే భద్రాచలానికి అర్థమయింది.

'ఏం వాయ్ కందుల భద్రాచలం! ఏంటంటున్నాడు మీ ఆరోగ్యమూర్తి? అంటూ పలకరించే శాస్త్రిని తలుచుకుని-

ఆ బాబు ఏమయిపోయాడు?

తనకన్న వెనకవచ్చి ముందు వెళ్ళిపోయాడు.

తనముందు పిట్టలా ఉండేవాడు ఆకారంలో...కాని...

భద్రాచలం మనసు రావిశాస్త్రితో తనను పోల్చిచూస్తోంది. ఆలోచనలు పెగలటంలేదు. అతని స్పందనలను మొయ్యటంలేదు.

ప్రపంచంలో రెండే కులాలు. రెండే మతాలు. ధనికుడు- పేదవాడు. మనుష్యులలో రెండే రకాలు. మంచివాడు- చెడ్డవాడు. మంచివాడు కష్టం చేసుకు బ్రతుకుతాడు. చెడ్డవాడు ఎదుటివాడి కష్టం దోచుకు బ్రతుకుతాడు.

ఇంత సులువుగా రావిశాస్త్రి విడదీసి చెపుతూంటే, చూపిస్తుంటే- భద్రాచలానికి అంతా స్పష్టంగా కనిపించేది.

"ఏం వాయ్ కందుల భద్రాచలం - ఎలా ఉన్నాడు మీ ఆరోగ్యమూర్తి?" అంటూ పలకరించే శాస్త్రి- కులంతో, యింటి పేర్లతో, పిల్లల పేర్లతో సహా అన్నీ గుర్తుంచుకునే ఆయన పద్ధతితో- భద్రాచలానికి మరింత సన్నిహితుడయాడు.

ఆ పెద్దలను తరుముకుంటూ వచ్చిన రెండవ తరం భద్రాచలానికి మరింత దగ్గరయింది.

వాళ్ళంతా యువకులు- విద్యార్థులు- ఉత్సాహానికి లేని సరిహద్దులు- పెద్దల్ని- మీరెటు- అని గద్దించిన వాళ్లు... ప్రకాశరావు, రాజేశ్వరరావు, అనంతం, రామానుజం, చినసుబ్బారావు, నారాయణరావు... యింకా ఎందరో... ఎందరెందరో పేర్లు తెలీని..తేడా తెలీని ముఖాలు...

అయినా..తెలిసిపోయాది.. వాళ్ళ రాక. ప్రపంచ పరీమళం. వాళ్ళకి కావల్సినవన్నీ ఓ దగ్గరుంచేవాడు. రాగానే ఆకలి... ఆకలి... ఆబగా... పుస్తకాల మీద వాలిపోయేవాళ్ళు.

"మీకెలా తెలుస్తుందండి... మాకేంకావాలో" ఎవరో ఒకరు అడిగేవారు.

"గేదెలు కాసేవాడికి... గేదెల్లో తేడా తెలుసుద్దయ్యా" అనేవాడు.

ఆ కుర్రాళ్ళతో తనెప్పుడూ బేరసారాలు ఆడేవాడు కాదు. ఆ పుస్తకాలదీ ఆ కుర్రాళ్ళదీ ఏనాటి బంధమో... చేయాల్సినది వ్యాపారం కాదు. సంధానం- అనిపించేది భద్రాచలానికి.

అయినా-

వాళ్ళలో కొంటి కోణంగులు పరాచికాలు ఆడేవారు.

పిడిగాడు- అని పేరు పెట్టారు. కొన్నాళ్ళకి తెలిసింది దాని అర్థం. పనిదొంగ- పెట్టుబడిదారుడు. చిన్న వ్యాపారం చేసుకునే భద్రాచలం ప్రజామిత్రుడా, దోపిడీదారుడా-లాంటి వాదనలు కూడా వాళ్ళ మధ్య నడిచేవి.

రష్యాలో పెరట్లో వేసిన కరివేపాకు లాంటివి అమ్మకున్నా చట్ట ప్రకారం. నేరంట- వాళ్ళే చెప్పేవారు. బూతు పుస్తకాలతో సహా ప్రతిదీ అమ్మేవాడు. పది రూపాయలు వచ్చేవి. చైనా పుస్తకాలు అమ్మినందుకూ పట్టుకున్నారు. మధు

పుస్తకాలు అమ్మినందుకూ పట్టుకున్నారు- అవీయివీ కలిపి కొనుక్కుపోయే వాళ్ళూ ఉండేవారు.

త్వరలోనే- అతని దగ్గరికి వచ్చే కుర్రాళ్ళలో గుంపులు మొదలయ్యాయి. అందరికీ కావల్సిందీ అవే పుస్తకాలు- అదే విప్లవం. కాని, గుంపులు... అమరులయిన వాళ్ళకి లాల్ సలాం చెప్పడంలో కూడా గుంపులు... ఎలా మొదలయింది? ఎక్కడ మొదలయింది?

ఆ కుర్రాళ్ళలో కలిసి ఆడి, పాడిన తన కొడుకు బ్రహ్మం...భద్రాచలం మనసంతా బరువెక్కింది.

వాడూ మనిషంటే-

వాడూ బిడ్డంటే-

భద్రాచలం తన తండ్రి పేరు పెట్టుకున్నాడు. ఆరోగ్యం తరువాత ఇద్దరు ఆడపిల్లల తర్వాత పుట్టిన బిడ్డకి- బ్రహ్మం అని. అతనితో పాటే వచ్చి కొట్టు మీద కూర్చోటంతో మొదలయింది బ్రహ్మం చిన్నతనం.

వాడి నరనరమూ పాటే- తరతరాల పూర్వీకుల ఆర్తనాదం లాంటి పాటట- ఒకబ్బాయి బ్రహ్మం మీద కవిత్వం రాశాడు.

వాడు పాడుతూంటే- జనం ఆగిపోయి వినేవారు. ఉద్రేకంతో ఊగిపోయే వారు - కృష్ణక్కకి వాడంటే ఎంత వాత్సల్యం - ఆమె ఒక అజ్ఞాత మాతృమూర్తి విప్లవానికీ - విప్లవ భావాలకీ - విశాఖ విప్లవ హృదయానికీ...

పూసే పూసే చెట్టు పూత మీదే మాయమయినట్టు - బ్రహ్మం కొంత కాలం కనబడలేదు. అప్పుడప్పుడు వినబడేవాడు. వాళ్ళూ వీళ్ళూ చెప్పిన వార్త విని శాస్త్రిబాబు దగ్గరకు పరుగెత్తాడు భద్రాచలం. ఆయన ఓ రోజంతా అతన్ని వెంటబెట్టుకుని తిరిగాడు. సాయంకాలం చీకట్లో - ఇదే తీర్థపురాళ్ళ దగ్గర - తనను పొదవి పట్టుకుని - "భద్రాచలం" అన్నాడు.

అర్థమయింది-

పూత మీద చెట్టు నరికేయబడింది-

ఆయన ఏదేదో మాట్లాడుతున్నాడు.

ఎవరేమంటేనేం? లోకానికి వాడెంత వాడయితేనేం? తనకు బిడ్డ. తను ఉచ్చెత్తి, పియ్యెత్తి పెంచిన బిడ్డ - తను ముందు పాకి, అడుగులు వేసి, అమ్మా అత్తా అన్న బిడ్డ - ఏమయ్యాడు?

గొల్లుగొల్లుమన్న నూకాలే భద్రాచలానికి గుర్తు వచ్చింది.

యాక్సిడెంటు వేరు! రోగం వేరు! ఏ కోరికలూ తీరకపోవటం వేరు! ఇవన్నీ ఆ తల్లికి అర్థమవుతాయి. కాని - ఇదేంటిది? దొంగతనం చెయ్యలేదు! లంజతనం చెయ్యలేదు - ఎందుకు చనిపోయాడు నా బిడ్డ?

నూకాలు ప్రశ్నలకి జవాబు భద్రాచలం వద్ద లేకపోయింది. ఏ దేవుడూ, ఏ వైరాగ్యమూ, ఏ తర్కమూ ఆ తల్లికి జవాబు ఇవ్వలేకపోయాయి.

మంచానపడి - మళ్ళీ లేవలేదు నూకాలు.

"బ్రహ్మన్ని చంపేసింది నువ్వే! నువ్వే!" అంటూ విలపించిన ఆరోగ్యం కళ్ళముందు మెదిలాడు.

ఆరోగ్యం మీద అంతకు ముందున్న కోపం బలహీనంగా రాజుకుంది. బ్రహ్మమే ఉంటే తన మనవడు రాహుల్‌గాడు ఇలా మాట్లాడగలిగేవాడా? విననట్టు ఊరుకొన్న ఆరోగ్యాన్ని - క్షమించేవాడా?

భద్రాచలం వృద్ధనరాలు తిరిగి మండసాగాయి.

☆ ☆ ☆

"ఆరోగ్యమూర్తి ఆదినుంచే అదోరకం-" అనుకున్నాడు భద్రాచలం.

చిన్నతనం నుంచీ ఆరోగ్యమూర్తి అనేక రకాల బాధలు పడ్డాడు. అయితే అతని బాధలకూ - తండ్రి బాధలకూ మౌలికంగా తేడా ఉంది.

భద్రాచలం బాధలు - 'బాధలు'గా గుర్తించే శక్తిని లేకుండా చేసి పెంచింది పల్లె.

ఆరోగ్యమూర్తి ఏమిటో, అతనిది ఎంత నికృష్టమైన పుట్టుకో అనుక్షణం గుర్తుచేసి పెంచింది పట్నం.

సెయింట్ ఆంథొనీ స్కూలులో చేరిన ఆరోగ్యం సెకండ్‌ఫారం చదువుతూండగా ఒక సంఘటన జరిగింది. రామశర్మ అనే మిత్రుడు కొందరు కుర్రాళ్ళను తన ఇంటికి పిలిచాడు. అతని తల్లి అందరికీ పళ్ళాలలో టిఫిన్ పెట్టింది. అందరినీ మంచాలమీద కూర్చోనిచ్చింది. అందులో ఒక ఆంగ్లో ఇండియన్ కుర్రాడున్నాడు. ముస్లిమ్ కుర్రాడున్నాడు. ఆరోగ్యానికి మాత్రం ఆకులో పెట్టి వీధిలో కూర్చోపెట్టి పెట్టింది ఆ తల్లి.

తినడం మానేసి, స్కూలుకి పరుగెత్తాడు. ఒక బ్రాహ్మణ మాష్టారు అతన్ని ఓదార్చాడు. ఆయన లెక్కలు చెపుతాడు. ఇంటికి తీసుకెళ్ళి తన మంచం మీద కూర్చోపెట్టి పళ్ళెంలో టిఫిన్ పెట్టాడు. ఇంత చేసినా, ఆయన తన పిల్లలకు బుద్ధి చెపుతూ- 'మాలాడే' అయినా వాడికొచ్చిన లెక్కలు మీకు రావు - వాడికున్న బుద్ధి మీకు లేదు - అన్నాడు ఓ మారు. అది ఆరోగ్యానికి ఆ వయసుకే నచ్చలేదు.

'మాలాడు' అన్న పేరు తన శరీరంలో ఒక భాగంలా చేసి గుర్తించే మనుషులను తప్పించుకోటానికి అతను ఆ వయసులో ఒకదారి వెతుక్కున్నాడు. బాప్టిజం ఇచ్చి 'అన్నారం' అనే పేరుని మార్చి, 'అరోగ్యమూర్తి' అని పెట్టాడు ఓ ఫాదర్.

"ఎందుకురా మతం మార్చుకున్నావు కొడకా?" అని అడిగింది నూకాలు.

"ఇంతకన్నా బాగా బతకాలని-"అన్నాడు.

కొంతకాలం గడిచాక- "నీ దేవుడు ఇంతకన్నా గొప్పరాత రాస్తాడంట్రా -? అని తండ్రి అడిగాడు.

"తెలీదు. మననిలా చస్తూ బతకమనే దేవుడు కన్నా మనకోసం రక్తం ధారపోసిన దేవుడు గొప్పవాడు-" అని జవాబిచ్చాడు.

కొడుకు అలా మాట్లాడుతూంటే - తల్లీ, తండ్రీ భయపడ్డారు. పైనున్న దేముడికి నూకాలు భయపడితే, చూట్టూ వున్న మనుషులకి భద్రాచలం భయపడ్డాడు.

బాగా ఎదిగాక - దేవుడి మాట వచ్చినప్పుడు- "తోటి మనుషుల్ని మనుషులుగానైనా గుర్తించనివ్వని మతాన్ని భరించలేక, మతం మార్చుకున్నాను." అన్నాడు ఓ సందర్భంలో.

"తోటి మనుషుల్ని జంతువుల్లా భావించి ఆఫ్రికా నుంచి అమెరికాకి తొలిసారి ఎగుమతి చేసిన వ్యాపారి గొప్ప క్రీస్తు భక్తుడు. తన ధనాన్ని పేదలకి వెచ్చించిన వాడు తెలుసా!-" అని ఓ కమ్యూనిస్టు మిత్రుడు అడిగితే.

"తప్పదు - ఎలక్షన్లున్న దేశంలో ఎవడో ఒకడికి ఓటెయ్యాలి - దేముళ్ళున్న ప్రపంచంలో ఏదో దేముడిని ఎంచుకోవాల్సిందే-" అన్నాడు.

"ఎందుకా! 'దేముడు' ఈ దేశంలో మనుషుల 'ఎగో'లకి సింబల్. మాలాంటి వాళ్ళ పోరాటానికి, తలెత్తుకు నిలబడటానికి - ఆత్మగౌరవానికి - సింబల్స్ కావాలి" అన్నాడు ఇంకోసారి.

ఇలా జీవితంలో ఎదిగినంత కాలమూ - ఆరోగ్యమూర్తి'దేవుడు' గురించి ఆలోచిస్తూ, తన ఆలోచనలను ప్రకటిస్తూ, మారుతూ, మారుస్తూ ఎదిగాడు.

అందరు పిల్లల్లాగే-

ఆరోగ్యమూర్తి కూడా తన భావాలనూ, బాధలనూ తల్లిదండ్రులతోనే పంచుకోబోయాడు. అతని తెలివితేటలనూ, చురుకుదనాన్నీ కొందరు మాస్టర్లు ఎంతగానో మెచ్చుకునేవారు. సోషల్‌స్టడీస్‌లో అతనికి ఎప్పుడూ ఫస్ట్ మార్కే! ఆ మాస్టర్లు కూడా - 'ఏం తెలివండీ - ఆ కుర్రాడిది' అని మెచ్చుకుంటే ఓ మాస్టరు - 'క్రాస్ బ్రీడ్ మహిమ మాస్టారూ' అని పళ్ళికిలించాడు.

ఆ మాటకి - అర్థం తల్లిదండ్రులు చెప్పలేకపోయారు.

'మాలాళ్ళు - ఒక్కమారు కూడా రాజ్యం చేయలేదా?' అనడిగితే భద్రాచలమూ, నూకాలూ తెల్లమొహాలు వేశారు.

హైస్కూల్లోకి అడుగుపెట్టే సరికే - కోటాగాడు, ప్రభుత్వ దత్తపుత్రుడు లాంటి పేర్లను అందుకుని - విననట్టు నటించగలినంత కాలం నటించాడు.

'వీళ్ళు - ఇంజనీరింగ్ చదువుతారుట - కడుతూండగానే బ్రిడ్జిలు కూలిపోతాయి-'

'వీళ్ళు వైద్యాలు చేస్తారట - బతికుండగా వచ్చి వీళ్ళ చేతుల్లో చావకూడదని చేతులెత్తేస్తారు జనం'

'గొడ్డు మాంసం తినే వాళ్ళకి నాలిక మందమైపోతుంది. శుద్ధమైన మాటలెలా వస్తాయి?'

ఇలా అంటూ - తామే జోకులుగా భావించేసి విరగబడి నవ్వుకునే వాళ్ళు ఎదురైనప్పుడు వాళ్ళతో నవ్వలేకపోయాడు. తనకన్నా వయసులో పెద్దయిన వాళ్ళను తన్నాలన్న కోరిక ఆపుకోలేకపోయాడు-

అవన్నీ-

తల్లిదండ్రులతో చెప్పుకుని ఏడవగలిగినంతకాలం ఏడిచాడు. తొందరలోనే తన తల్లిదండ్రులు అతనికి అర్థమయిపోయారు - వాళ్ళకి తన మీద అంతులేనంత ప్రేమ. కాని - పెద్ద కులాలలో తల్లిదండ్రుల్లా వాళ్ళు తమ పిల్లలను వెనకేసుకు వచ్చి రక్షించుకోరు. తమ పిల్లలు - వాళ్ళ కోపాల్ని దాచుకోకపోతే - ఎవరికయినా తెలిసిపోతుందేమోనని బిగుసుకుపోతారు. ఆ భయం - వాళ్ళ మీద తరతరాలుగా జరుగుతున్న భౌతిక హింసవల్ల ఏర్పడినది. ఆ భయం - వాళ్ళకి సంతానం ఎదుర్కొనే ప్రశ్నలకు సరైన జవాబు ఇవ్వకుండా చేస్తుంది. బిడ్డల దు:ఖం పట్ల ఎంత అనుకంప ఉన్నా, ఆ భయం దానిని అణిచేస్తుంది.

దాంతో -

ఆరోగ్యం నటించటం మానేశాడు. ఏడవటం మానేశాడు. తల్లిదండ్రులతో పంచుకోటం మానేశాడు. వాళ్ళపట్ల జాలిపడటం తప్ప - అర్థం చేసుకునే ప్రయత్నం మానేశాడు.

తన ఆలోచనలను తనతోనే ఉంచుకున్నాడు. తన వాళ్ళనుకున్న వాళ్ళతో పంచుకున్నాడు. అలా కొందరిని తన వెనక సేకరించుకున్నాడు.

హైస్కూలు చదువు పూర్తవుతూండగా - ఆరోగ్యానికి ఒకటే మార్గం కనిపించింది. చదువుకోవాలి. దానితోనే తన బాధల నుంచి విముక్తి లభిస్తుంది- అని గట్టిగా నమ్మాడు.

ఆ లక్ష్యంతోనే అతను చదివాడు. పీయూసీ అయింది. ఏవీయన్ కాలేజీలో డిగ్రీలో చేరాడు. చదువుకోడంతో తన నేపథ్యం మారుతుందా? అన్న సందేహానికి లోనయ్యాడు. పెద్ద చదువు చదివితే తన బాధలకు విముక్తి అని - తనను తను నమ్మించుకోబోయాడు.

'చరిత్ర'లో పి.జీ.కోసం యూనివర్సిటీలో చేరాడు.

చేరిన కొంత కాలానికే - పెద్ద చదువుల వాళ్ళ చిన్న బుద్ధుల పట్ల అతనికి సంశయాలు మొదలయ్యాయి.

వయసులో ఎదిగిన వాళ్ళు - వ్యక్తిత్వంలో కూడా ఎదుగుతారన్న అడియాస అయింది.

మార్కులకోసం విద్యార్థులను పరుగెత్తించి, పదవులకోసం తాము పరుగెత్తుతూ గురువులు - భారతదేశపు ప్రత్యేకత అయిన కులం కల్పించే ఎగోలను, దురవగాహనలనూ తమతో పెంచిపోషించుకుంటూ - విద్యార్థులలో పెంచిపోషించటం గమనించాడు ఆరోగ్యమూర్తి.

చదువూ, పెద్ద చదువూ తనను సమాజంలో సమానుడిగా గుర్తింపు నిస్తాయన్నది ఓ భ్రమ - అనుకున్నాడు ఆరోగ్యమూర్తి.

అతను నిరాశకు గురయి, నిర్లిప్తతలోకి జారిపోయేవాడే కాని - అతనిలోని అంతర్గత శక్తులు అతన్ని వదలలేదు. కమ్యూనిజంలోకి వస్తున్న రాడికల్ ఎలిమెంట్స్ యూనివర్సిటీలను చుట్టుముట్టడంతో ఆరోగ్యమూర్తి కూడా ప్రభావితుడయ్యాడు.

దాంతో -

యూనివర్సిటీ ప్రపంచం చీలికల్లోకి కూరుకుపోయాడు.

'మనం మాటకి మాట చెప్పాలి' అన్నారు, కొందరు.

'అప్పుడు వాళ్ళు మనకి మాటల్తో జవాబులు చెప్పరు. దెబ్బ తీస్తారు. దెబ్బకి దెబ్బే సమాధానం' అన్నారు కమ్యూనిస్టులు.

'అప్పుడే - మన ఆత్మగౌరవం నిలబడుతుంది' అన్నాడు ఆరోగ్యం.

గొడవలు ముదిరాయి. తన్నులాటలు మొదలయ్యాయి.

చురుకైన వాడూ, స్వతంత్రంగా ఆలోచించగల వాడూ, తన ఆలోచనలను ఉపన్యాసాలలో ఆవేశాలుగా ప్రతిఫలించగల వాడూ అయిన ఆరోగ్యం చాలా వేగంగా పదిమంది దృష్టికీ వచ్చాడు.

దాంతో ఆరోగ్యానికి రెండు రకాల సమస్యలు ఏర్పడ్డాయి.

అతను అనుసరించే వారితో ఒక రకం సమస్య ఏర్పడితే - అతను ఎదిరించే వారితో మరో రకమైన సమస్య ఏర్పడింది.

మొదటి రకం సమస్యకి మూలం అతని ప్రశ్నించే స్వభావం. అతని స్వతంత్ర సంశయాలు, వ్యక్తిత్వ సంబంధితమైన ఆ మూలాన్ని అతని కమ్యూనిస్టు మిత్రులు అలా తీసుకోలేకపోయారు. ప్రశ్నలూ సంశయాలూ గల ఆరోగ్యమూర్తి- తమతో కడదాకా ప్రయాణిస్తాడా అని మాత్రం అనుకున్నారు. వాళ్ళ అనుమానపు చూపులు ఆరోగ్యమూర్తికి అర్థమయ్యాయి. ఆ చూపులకి కారణం 'తన కులమా!' అన్న ప్రశ్న ఆరోగ్యమూర్తిలో కలిగింది. ఇదంతా బీజప్రాయంలో ఉండగానే -

రెండవ సమస్య ప్రధానమయింది -

లెనిన్ చౌదరి ప్రొఫెసర్. కమ్మ. ఆయన తండ్రి కృష్ణా జిల్లాలో కౌలుదారు. కమ్యూనిస్టు. ఆ తండ్రికి కమ్యూనిజం పట్ల అచంచలమైన విశ్వాసం. జమీందార్లతో పోరాడాడు. జమీందార్ల తరుపున నిలబడ్డ ప్రభుత్వ బలగాలతో పోరాడాడు. చాలాకాలం రహస్య జీవితం గడిపాడు. కుటుంబాలు కుటుంబాలే కమ్యూనిస్టు పోరాటానికి అంకితమైన దినాల్లో - ఆయన మమైక్యతతో పోరాడుతూ - తన సోదరులు ఇద్దరినీ, ఒక కాలునీ పోగొట్టుకున్నాడు.

ఆ తర్వాత అతను రైతయ్యాడు. తన పేరులో 'నాయుడి'ని వదులుకున్నాడు. కొడుకుని కష్టపడి చదివించాడు. 'పోరాటాల' తండ్రినీ, పోరాటాలనీ చూసిన కొడుకు - తన ఊరిలో వస్తూన్న మార్పులని చూశాడు. 'తిరగబడటాన్ని' జీవితంగా మార్చుకున్న తండ్రి వీరత్వాన్ని ఎంతగా ఆరాధించాడో, ఆ 'తిరగబడటం' వల్ల అంతకాలమూ తమ చెప్పుచేతలలో ఉన్న వాళ్ళు "తలలు ఎత్తుకోటాన్ని" అంతగానూ అసహ్యించుకున్నాడు. తనకింద వాళ్ళు ఎంత కింద వాళ్ళో గుర్తుచేయటానికి చేతినీ, నోటినీ యధేచ్ఛగా ఉపయోగించటం నేర్చాడు. తన వాళ్ళనుకున్న వాళ్ళతో - అలా ఉపయోగించటం - ఒక 'సంస్కృతిగా' ఒక ప్రాంతపు 'జీవన సరళి'గా సిద్ధాంతం చెయ్యటం నేర్చాడు. తన పేరులో తండ్రి ఉంచని 'చౌదరి'ని తగిలించుకోవటంలో ప్రయోజనాలున్నాయనిపించి - ఇటీవలే ఆ పని చేశాడు.

ఇవన్నీ - తండ్రికి కొడుకుని దూరం చేశాయి. 'తను చేసిన పోరాటాలు - జాతి విముక్తి పోరాటంలో భాగాలు కావని - తమ ప్రయోజనాల కోసమే చేసివున్న వాదనలు అతన్ని గాయపరిచాయి. కమ్యూనిస్టుపార్టీల్లో వచ్చిన, వస్తున్న మార్పులు ఆధిపత్యం తగువులేగాని, సిద్ధాంత విభేధాలు కావని అతనికీ అనిపించసాగాక - ఆ గాయం మరింత బాధించింది. కొడుకులో వస్తున్న మార్పులు గమనించాక, ఆ తండ్రి కమ్యూనిజానికీ, కొడుకుకీ, అతని కార్యకలాపాలకీ దూరంగా తన ఊళ్ళో తన ఇంట్లో, తన గదిలో, తనలోతనే అయి ఆధ్యాత్మిక జీవితంలో మునిగిపోయాడు.

తండ్రి తనకు దూరమయినా, అతనిలో 'వీరత్వాన్ని' ఆరాధించిన లెనిన్ చౌధరి, అదే 'వీరత్వం' తన దిగువ వాళ్ళనుకున్న వాళ్ళలో కనిపిస్తే దాన్ని అణచటం నేర్చాడు. ప్రతి సిద్ధాంత కర్తకీ జనం ఎంత అవసరమో గ్రహించి జనాన్ని వెచ్చబరచటమూ, చల్లబరచటమూ నేర్చాడు. తన 'ఆచార్య' హోదా కల్పించిన అవకాశాలను వినియోగించటం నేర్చాడు.

దానాదీనా-

ఆయన ఎన్నో వ్యయ ప్రయాసలకు లోనయి, 'అణచవలసిన' వాళ్ళని అణచగలిగినా మానినా, 'నడపవలసిన' వాళ్ళను తన వెంట నడపగలిగినా మానినా,

తన కొడుకుని మాత్రం తన మానసిక వికారాలన్నీ పోసి పెంచాడు. ఆయన మాట పదును కొడుక్కి రాకపోయినా, చేతి విసురుమాత్రం పూర్తిగా వచ్చింది.

ఆయన తను నడపవలసిన వాళ్ళని నడపటానికి "మాల మాదిగ నా కొడుకులని మనం ఇళ్ళలోకి రానిచ్చాం- అందాకావస్తే ఫరవాలేదు - అంతో ఇంతో మనకీ లాభమే! ఆ తర్వాత రానిస్తే - వాళ్ళొచ్చి మన పిల్లల మెడలలో తాళి కట్టడం ఖాయం." అన్న మాటని ఒక మంత్రంగా మార్చాడు. ఆ మంత్రం వల్ల అతనికి ఏం లాభం చేకూరిందో గాని, అది ఆయన కొడుకు మీద మాత్రం అద్భుతంగా పని చేసింది.

దాంతో-

ఆరోగ్యం ఆ కొడుకుని తన్నవలసి వచ్చింది.

☆ ☆ ☆

భద్రాచలం కొట్టు మీదుండగా వచ్చాడో కుర్రాడు- 'చూడు భద్రాచలం - మీ వాడు లేనిపోని గొడవల్లో పడుతున్నాడు - చదువు పూర్తవదు-' అన్నాడు.

అది ఆత్మీయుడి సలహాగా భద్రాచలానికి వినిపించింది.

కొడుకుతో చెపితే - అతనికి శత్రువు హెచ్చరికలా వినిపించింది.

"హెచ్చరిక భయానికి పైలట్" అన్నాడు.

"ఇన్నాళ్ళూ కష్టాలు పడ్డాం - ఏదో దేవుడు సల్లగా సూశాడురా- నీ చదువు అవొస్తుంది- ప్రయోజకుడివై మాకింత గంజినీళ్ళు పోస్తావని" ఆరంభించాడు తండ్రి.

"భయపడి- వందలాది సంవత్సరాలు బతికాం- మన వాళ్ళు భూములు సంపాదించారా? మేడలు కట్టారా?"

"బతికాం గదరా-"

"అవునవును. సందులలో పందులవలె - సబ్ హ్యూమన్‌గా-"

"అంటే-"

కొడుకు వివరించలేదు.

'ఇతర కులాల్లో వృద్ధతరం - తమ యువతరానికి - 'ఆధిపత్యాన్ని' సంపాదించి పెట్టడానికి- కొనసాగించటానికి - ఉపయోగపడుతుంది? మనలో?? బానిసత్వాన్ని - కొనసాగించటానికే! వీళ్ళకి నచ్చజెప్పటం మనకి మరో తలనొప్పి - ' అన్నాడు మిత్రులతో!

భయం వెనకబట్టి, కాలం ముందుకు పోతున్నదని భద్రాచలం కుదుట పడుతూండగానే - పిడుగుపడింది.

నవ్వుతూ, తుళ్ళుతూ వెళ్ళిన కొడుకు అలాగే వస్తాడని ఏ తండ్రి ప్రాణం

ఆశించదూ! అందుకు బదులుగా- అతను చావుబతుకుల మధ్యనున్న వార్త రావటం పిడుగుకాక ఏమిటి!!

"నన్ను ఇమ్మాన్యూల్ అంటారండి. -ఆరోగ్యం బాబంటే మాకూ మా వోళ్ళకీ దేవుడు! నా కొడుకులు టయానికి అడ్డుకోబట్టి సరిపోయింది. ఆస్పత్రిలో వున్నారు- పదండి బాబూ" అంటూ రిక్షా కట్టించి భద్రాచలాన్నీ, నూకాలునీ, పిల్లలనీ ఆస్పత్రికి తీసుకెళ్ళాడు.

'నువ్వెలా బతుకుతావురో కొడకా-' అంటూ ఏడ్చింది నూకాలు.

'నీ చదువు ఎలా అవుద్దిరా నాయనా-' అంటూ బాధపడ్డాడు తండ్రి.

స్పృహలోకొచ్చాక-

"ఒక వీరుడు మరణిస్తే వేయి మంది ప్రభవిస్తారు-" అన్నాడు.

అన్న పట్ల ఆరాధన బ్రహ్మం కళ్ళలో మెరిసింది.

మరికొంత కోలుకున్నాక-

"యూనివర్సిటీ ఎవడి అబ్బ సొత్తూ కాదు. రోజులు మారాయి. ధర్మాలూ, నీతులూ చెప్పి పబ్లిక్‌గా చెయ్యలేరు. వాడు దొంగ దెబ్బతీస్తే మనం పబ్లిక్‌గా - జవాబిస్తాం."

ఆస్పత్రిలో ఉన్నన్ని రోజులూ-

ఎన్నెన్నో తెలియని మొహాలు. ప్రేమతో ప్రకాశించే నయనాలు. ఆరోగ్యమూర్తి చుట్టూ కోటలా నిలబడ్డారు. ప్రతీ ఒక్కరూ తన కొడుకు పట్ల చూపే ఆత్మీయతకు భద్రాచలం 'లంకెల బిందెలు' దొరికినంత సంబరపడి పోయాడు.

ఇమ్మాన్యూల్ ఇంట్లో మనిషైపోయాడు. మనసులో మాటైపోయాడు. అతను మాదిగ. తుని దగ్గర నక్కపల్లి. భద్రాచలం ఈడువాడు. అతని ఇంటికి భద్రాచలం వెళ్ళిన రోజున ఏనుగు ఎక్కినంత సంబరపడిపోయారు. యూనివర్సిటీలో స్వీపర్ ఉద్యోగం. అతని కొడుకులు ఎవరికీ చదువు అబ్బలేదు. ఒక కొడుకు ఐ.టి.ఐ పాసై, యూనివర్సిటీలోనే ఎలక్ట్రీషియన్‌గా పనిచేస్తున్నాడు.

ఇమ్మాన్యూల్‌కీ అతని పిల్లలకీ, 'ఆరోగ్యంబాబు' అంటే అంతులేని గురి.

కోలుకున్నాక, ఆరోగ్యం చదువు కొనసాగించాడు.

'నిన్ను కొట్టడానికి అసలు కారణం - నువ్వు నిజమైన కమ్యూనిస్టువి కావడమే' అన్నారు కమ్యూనిస్టు మిత్రులు.

'కాదేమో - నేను మాలాడిని కావటం వల్లనేమో!' అన్నాడు ఆరోగ్యం.

'కానేకాదు - నీది స్వీయ మానసిక ధోరణి. నువ్వు సరిదిద్దుకోవాలి' అన్నారు మిత్రులు.

అనుమానంగా చూశాడు ఆరోగ్యం.

కొంత కాలమయాక -

'నిజమైన కమ్యూనిస్టంటే?' అని అడిగాడు.

'ప్రశ్నించేవాడు'

'దేన్ని?'

'అధికారాన్ని, అణచివేతని-'

'వాటిని ప్రశ్నించడమెలా కుదురుతుంది? వాటిని ఎదిరించటమేగదా!'

'అఫ్‌కోర్సు - ప్రశ్నించటమంటే ఎదిరించటమే-'

'కాదు. ప్రశ్నించటమంటే ప్రశ్నించటమే-' అన్నాడు ఆరోగ్యం.

వాళ్ళు అతన్ని అనుమానంగా చూశారు.

'మనిషిని - రైతుగా, కూలీగా, కార్మికునిగా, పేదగా - వాళ్ళ సెంటిమెంట్స్‌తో సహా అర్థం చేసుకోటానికి, సిద్ధాంతీకరించటానికి చేసిన ప్రయత్నం - మనం - దళితునిగా, దళితుని సెంటిమెంటుతో అర్థంచేసుకోటానికి చెయ్యలేదు-' అన్నాడు చాలా రోజులు ఆలోచించి ఆరోగ్యం.

'దళితుడంటే - ఆర్థికంగా దళితుడే! ఆర్థిక దళితుల సెంటిమెంట్స్ ఒక్కటే! నువ్వు వేరేగా ఆలోచిస్తున్నావంటే కారణం నువ్వు రాజ్యం మాయలో పడుతూండటమే! ఆర్థిక దోపిడీని సుగమం చేసేందుకే సాంస్కృతిక అణచివేత పుట్టింది- ప్లీజ్ సరిగా ఆలోచించు - లేకపోతే నీ మీద మా నమ్మకాలు, ఆశలూ పోతాయి-' అన్నారు.

'నేను ఆలోచించటం - అడగటం తప్పా?' అనుకున్నాడు ఆరోగ్యం.

వాళ్ళ చూపులూ, అనుమానాలూ ఆరోగ్యాన్ని చాలా బాధించాయి. బీజ ప్రాయంలో ఉన్న అతని అనుమానం 'తన కులమేమో!' అన్నది బలపడి - 'తన కులమే' తనకు ప్రశ్నించే అవకాశాన్ని కలిగించలేదన్న నిశ్చయానికి వచ్చాడు. అలా ప్రశ్నించజూడటం - వాళ్ళ పట్ల కృతఘ్నతగా భావిస్తున్నట్టు - అతనికి అనిపించింది.

చదువుకున్న వాళ్ళమీద అతనికి మరిన్ని అపనమ్మకాలు కలిగాయి.

'ఈ ప్రపంచం తెలివైన వాళ్ళకోసం, తెలివైనవాళ్ళ రూల్సుతో, తెలివైన వాళ్ళు నడుపుతున్న ప్రపంచం. ఇందులో ప్రధానమైన ఆయుధం చదువు. చదువుకున్న వాళ్ళదే తెలివి. నిజానికి చదువుకున్నవాళ్ళు ఈ ప్రపంచంలో నాలుగో వంతుకూడా ఉండరు. కాని ప్రపంచ ఉత్పత్తిలో నాలుగింట మూడొంతుల భాగాన్ని ఈ అల్పసంఖ్యాకులు తమ కైవశం చేసుకుంటారు. తమ కైవశమయిన భాగాన్ని పంచుకోవటం కోసమే వీళ్ళు అన్ని సిద్ధాంతాలూ పుట్టించారు. వీళ్ళే మానవులు. వీళ్ల మానసిక రోగాలే మనస్తత్వశాస్త్రం. వీళ్ళలో - ఈ పంపకం కోసం - ఏర్పడిన కృతక ప్రవృత్తే మానవ ప్రవృత్తి! వీళ్ళ స్వార్థ

గుణాలే - మానవజాతి ప్రాతినిధ్య గుణాలు. చదువురాని - అంటే వీళ్ళ దృష్టిలో తెలివిలేని - ప్రపంచ జనాభాలో నాలుగింట మూడొంతుల మంది - జనంలోని... మౌలిక స్వభావాలూ సహజ స్పందనలూ, ఒకరితోఒకరు కూడితే తప్ప సాధించుకోలేని అనివార్యతా..వంటివేవీ మానవ ప్రవృత్తి కాకుండా పోతాయి-' అనిపించసాగింది.

అప్పటికి...అంత స్పష్టంగా కాకపోయినా, ఇంచుమించు ఇలాంటి అభిప్రాయానికి చేరుకున్నాడు ఆరోగ్యమూర్తి. అభిప్రాయాల మీద - చదువుకున్న వాళ్ళ పెత్తనాన్నీ - అందులో కూడా వాళ్ళ కులాధిపత్య భావనలనీ - ఫీలవసాగాడు ఆరోగ్యమూర్తి.

అయితే - తన ఆలోచనలలో తప్పొప్పులు సరిచూసుకుని, వాటికి నైశిత్యం కూర్చుకునే అవకాశం ఆరోగ్యానికి ఆనాటి వాతావరణం ఇవ్వలేదు. తనకు దొరికిన అబ్బురమైన వస్తువుని పరిశీలిస్తూనే జీవితమంతా గడిపే ఆదికాలపు మేధావిలా ఒంటరిగా ఉండిపోయాడు ఆరోగ్యమూర్తి.

ప్రపంచంలోని దుష్టత్వం మీద, దుష్టశక్తుల మీద తిరగబడమనే కమ్యూనిస్టు మిత్రులు - చాలా రొడ్డ కొట్టుడుగా అతని ప్రశ్నా స్వభావాన్ని తప్పు పట్టడంతో- అతనికి నిరాశ కలిగింది. ఏ ప్రశ్న అడిగినా - మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, మావోలను ఉటంకిస్తూ ఒక పరిభాషలో జవాబిచ్చే - వాళ్ళ పద్ధతి అతనికి అసంతృప్తి కలిగించింది. వేయి ఆలోచనలను వికసించనీయమనే మాటను గోడలకి అప్పజెప్పి - ఒక్క ఆలోచన వెలిబుచ్చినా - దానిని రివిజనిజమో, ఉదారవాదమో, స్వీయ మానసిక ధోరణో, పిడివాదమో - అంటూ ఒక గాడిలోకి నెట్టే ధోరణి అతన్ని చాలా కలవరపరిచింది.

దానాదీనా - 'ప్రతిదీ వేదాల్లోనే ఉందిట అంటూ కొందరు పెత్తనం చెలాయిస్తే ప్రతిదీ మార్క్సిజంలోనే ఉందిట అంటూ మరికొందరు పెత్తనం చేపట్టాలని చూస్తారు. మార్క్సిజం కూడా చదువుకున్న వాళ్ళ ఆటలో భాగమే' అనుకున్నాడు, మూర్తి.

☆ ☆ ☆

తీర్థపురాళ్ళు, సముద్రమూ....భద్రాచలంలో జ్ఞాపకాలు, ఆలోచనలు... ఆటుపోట్లుగా...

ఆరోగ్యం చదువు అవుతూండగానే లెక్చరర్ అయ్యాడు. బ్రహ్మాన్నీ, భద్రాచలాన్నీ ఊళ్ళో జరుగుతున్న సమావేశాలకు వెళ్ళొద్దనేవాడు. బ్రహ్మాన్ని పాటలు పాడొద్దన్నాడు. భద్రాచలాన్ని - ఆ పెద్దల ముందు - చేతులు కట్టుకుని నిలబడొద్దన్నాడు.

"- నాన్నా - వాళ్ళ సంగతి మీకు తెలవదు. ఆనాడు నన్ను కొట్టించిన ప్రొఫెసర్ ఏకంగా లెనిన్ చౌదరి. వాళ్ళందరిదీ ఒకటే జాతి. వాళ్ళల్లో వాళ్ళకి ఎన్ని రాజకీయాలున్నా - ఒకరినొకరు సభల్లోనూ, పత్రికలలోనూ పగలల్లా తిట్టుకున్నా- రాత్రయేసరికే గ్లాసుల దగ్గర కలిసిపోయి మనలని తిట్టుకుంటారు. మనని సంస్కరించామని అనుకుంటారు కొందరు. మనని ఏకంచేసి నడిపిస్తున్నామంటారు కొందరు. అందరూ - రిజర్వేషన్లను - మనకి బిచ్చంగా ఇచ్చామనుకుంటారు.

నేచెప్పేది వినండి - ఈ దేశం వాళ్ళది. ఈ పట్నం వాళ్ళది. ఈ యూనివర్శిటీలు వాళ్ళవి - పార్టీలు వాళ్ళవి - చివరకి మనని ఉద్ధరిస్తారని మీరు అనుకుంటున్న నక్సలైటు పార్టీలతో సహా కమ్యూనిస్టు పార్టీలన్నీ వాళ్ళవే! మనం వాళ్ళు చెప్పిన చోట ఉండాలి. నడవమన్నప్పుడు నడవాలి. కొందరికి మన ఓట్లు కావలిసొస్తే - కొందరికి మన రక్తంకావాలి.

వాళ్ళందరి ఏకైకాభిప్రాయమూ ఒకటే- 'మనం మన అవసరాల కోసం వాళ్ళ చుట్టూ తిరుగుతాం- అవసరాలు తీరగానే వదిలేస్తాం -మన రక్తంలోనే, మన పుట్టుకలోనే ఉంది విశ్వాసహీనత. మనం మానవ ప్రవృత్తిలోని వికార లక్షణాలకు ఆకారం...'

అన్న వంక విచిత్రంగా చూశాడు బ్రహ్మం.

'నర్రెంక చెట్టు కింద నరుడో భాస్కరుడో-' అని పాడుకుంటూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

కొడుకు వంక అయోమయంగా చూశాడు భద్రాచలం.

"అందరూ చెడ్డోళ్ళేనంటావా ఆరోగ్యం?" అన్నాడు.

"మన దగ్గరకొచ్చేసరికి - అందరూ ఒకటే-"

"కాదురా- చాత్రిబాబు దేవుడు-"

"ఏంవాయ్ కందుల భద్రాచలం - అంటే - నీకు నెత్తిమీద కిరీటం పెట్టినట్టుంటుంది - ఏంవాయ్ శాస్త్రీ - బావున్నావా - అని పలకరించి చూడు- ఆ పెద్ద మనిషికి కిరీటం పెట్టినట్టుండదు నరిగదా - గునపంతో పొడిచినట్టుంటుంది-"

కొడుకు అలా అన్నప్పుడు భద్రాచలానికి కోపం వచ్చింది. బాధ కలిగింది. తన సందేహాన్ని ఎవరితో తీర్చుకోవాలో అర్థం కాలేదు.

"ఏటి తమ్ముడూ - ఈడిలా మాటాడతాడూ-" అన్నాడు ఇమ్మాన్యూల్‌తో.

"సారు పెద్ద సదువులు సదుంకున్నోరు - మనకేం తెలుస్తుందన్నా -" అన్నాడు ఇమ్మాన్యూల్.

"ఆరోగ్యం నీ కొడుకంటోడు - సారుసారు అనమాకు తమ్ముడూ-"

"అదంతా నీ పెద్ద మనసన్నా! మనోడుగందా అని మనమే మరేద ఇయ్యాపోతే పయ్యోళ్ళు ఇత్తారా అన్నా!"

బ్రహ్మం మరణవార్త తెలిసినప్పుడు, ఆరోగ్యమూర్తి చంటి పిల్లాడిలా ఏడిచాడు-

"నువ్వే - నువ్వే సంపేశావు" అంటూ తండ్రిని నిందించాడు.

"నేనా!?"

"అవును - నువ్వే! నువ్వే - వాళ్ళ వెనకాతలే తిరుగుతావు నువ్వు - అదే గొప్పనుకుని వాడూ తిరిగాడు. ఏమయింది? నేను అనుకున్నంతా అయింది. నీకు ఓపికలేదు గనక - బయటే ఉండిపోయావు - బతికిపోయావు - వాడు బలయిపోయాడు-"

గిలగిలలాడిపోయాడు భద్రాచలం...

* * *

ఆ విషయం గుర్తొచ్చినప్పుడల్లా ఆ వృద్ధుని మనసులో అదే గిలగిల! ఆలోచనలన్నీ ఆగిపోయినట్టు సముద్రాన్నీ తీర్థపురాళ్ళనీ కనిపించినంత మేర చూస్తూ - వినిపించినంత వింటూ అలాగే ఉండిపోయాడు.

ఆ రోజు అలా అన్నాడు కాని-

ఆరోగ్యం తననెపుడయినా తక్కువ చేశాడా? తన మీద తక్కువ ప్రేమ ఉందా?

కృష్ణానగర్‌లో ప్రస్తుతం ఉంటున్న ఇంటి జాగాలో అంతకు ముందు ఒక బ్రాహ్మణ వకీలు ఉండేవాడు. అది పావు ఎకరం స్థలం. ఆ వకీలు కొడుకు అమెరికాలో స్థిరపడితే - అతని దగ్గరకు శాశ్వతంగా వెళ్ళిపోతూ ఇల్లు అమ్మకానికి పెట్టాడు. ఆరోగ్యమూర్తి దానిని కొంటానన్నాడు.

మాలాడికి అమ్మటమా - అని వకీలు ముసిలాడు అన్నట్టు విన్నాడు. ఆరోగ్యానికి మండిపోయింది. అమెరికాలో ఉన్న కొడుకుతో బేరం పెట్టుకొని, ఆ ఇల్లు తన పేర రిజిస్ట్రీ చేయించుకున్నాడు. పాత ఇంటిని పడగొట్టి తన అభిరుచుల మేరకు ఇల్లు కట్టుకున్నాడు. అన్నీ పడగొట్టినా, తులసి కోటను పడగొట్టలేదు. దాని చూట్టూ కుర్చీలు వేసుకుని మందు తాగటానికి అనుకూలంగా మార్చుకున్నాడు.

ఆ ఇంటిలో నున్న పెద్ద హాలులో-

రిక్షా లాగుతున్న భద్రాచలం నిలువెత్తు ఫోటో పెట్టాడు. ఇరవై నాలుగు కుంచాల బియ్యం బస్తాను వేసుకుని తీర్థపురాళ్ళ నుంచి కలెక్టరాఫీస్ వరకూ లాగటానికి రిక్షా వాళ్ళకు పందెం వేశాడు ఓ తెల్లదొర. అందులో గెలిచాడు భద్రాచలం. ఒక రూపాయి బహుమానం ఇచ్చి ఫోటో తీసి ఓ కాపీ ఇచ్చాడు దొర.

ఆ నిలువెత్తు ఫోటో పెట్టిన కొడుక్కి తన మీద గల ప్రేమను తలుచుకుంటే భద్రాచలానికి కొత్తలో లోపల్లోపల ఆనందంగానే వున్నా - చిన్నతనంగా అనిపించేది.

ఆ మాటే కొడుకుతో అంటే-

"ఎందుకు నాన్నా మనకి చిన్నతనం! నేను నీ కడుపున పుట్టాను. రిక్షాలాగి- నన్ను పెంచుకున్నావు. ఇంత వాడిని చేసుకున్నావు. లోకంలో తమ బిడ్డలను ఎంతో కష్టపడి పెంచిన తల్లిదండ్రులు ఎంతో గొప్పనిపించుకున్నారు. వాళ్ళందరి కన్నా నువ్వు ఎక్కువ కష్టపడ్డావు.

కనకే - నువ్వు వాళ్ళందరికన్నా ఎంతో గొప్పవాడవు. నీలాంటి తండ్రికి బిడ్డను అయినందుకు నాకు గొప్పతనమే కాని - చిన్నతనం లేదు-"

కొడుకు అన్న ఆ మాటలు గుర్తుకొచ్చేసరికి భద్రాచలం మనసులో అంతకు ముందున్న కోపం మాయమయిపోయింది.

ఆ స్థానంలో కొడుకు అశక్తత, అతని బిడ్డల అవిధేయత, ఆ వృద్ధుని మనసులో నిండాయి. ఒక ఆవేదనాపూరితమైన ప్రశ్న కలిగింది-

'నిజంగా ఆరోగ్యం సంసారంలో ఏనాడయినా సుఖపడ్డాడా!"

కమలకుమారిది భోగం కులం. ఆమె అమ్మమ్మ లక్ష్మి నరసాపురం దివాణంలో కాసా మనిషి, బి.యే చదువుతున్న కమలకుమారిని ఆరోగ్యమూర్తి ప్రేమించాడు. పెద్దాపురంలో ఆమె తల్లి ఎలా బ్రతుకుతున్నదో చెప్పింది కమలకుమారి. వెనక్కి తగ్గలేదు ఆరోగ్యమూర్తి.

వాళ్ళిద్దరి పెళ్ళినీ అట్టహాసంగా చేద్దామన్నారు అతని మిత్రులూ, అనుచరులూ. నగరంలో అభ్యుదయ వాదులందరినీ పిలిచి సంస్కరణ వివాహం జరిపిద్దామని అన్నారు.

"వివాహం నా వ్యక్తిగత విషయం. ఎవరి మెప్పు కోసమూ నేనీ పెళ్ళి చేసుకోవటంలేదు. నా ఆనందం కోసమే చేసుకుంటున్నాను-" అన్నాడు ఆరోగ్యం.

భద్రాచలం ఆ విషయం రావిశాస్త్రితో చెపితే 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా - అన్నారు పెద్దలు. అలాంటి కొడుకుని కన్నందుకు గర్వపడవోయ్-' అన్నాడు భుజంమీద తట్టి.

కమలకుమారి ఇంటికి వచ్చాక, నడుం బిగించి - ఆడపడుచులు ఇద్దరికీ పెళ్ళిళ్ళు చేసింది. ఆమె భద్రాచలానికి దేవతామూర్తిలా అనిపించేది. దయతో, జ్ఞానంతో ప్రకాశించే ఆమె కళ్ళు చుట్టూ శాంతిని నింపుతున్నట్టుండేవి.

పెళ్ళయిన కొత్తలో ఆమె భర్తతో కలిసి సభల్లో, సమావేశాల్లో పాల్గొనేది. కాని, క్రమంగా ఆమె ఇంటికి పరిమితమయిపోయింది.

ఎంతో శాంతిని ప్రసాదించే కోడలి కళ్ళు - భయంకరమైన అశాంతితో నిండిపోవటం భద్రాచలానికి కూడా అర్థమవసాగింది. ఆరోగ్యంలో వస్తున్న మార్పులు, అతనిలో వేదనా తండ్రి చూపులని తప్పించుకోలేదు.

ఆరోగ్యం రోజా తాగుతున్నాడు.

అప్పుడప్పుడు భార్యమీద చేయి చేసుకుంటున్నాడు.

పెళ్ళయిన మూడేళ్ళకి రాహుల్ కడుపున పడ్డాడు.

కమలకుమారి పూర్తిగా చిక్కిపోయింది. పచ్చటి ఆమె శరీరవర్ణం తెల్లగా మారిపోయింది. పెద్దాపురంలో నున్న తల్లి పంపమంటే ఆరోగ్యం పంపలేదు. ఆమె వస్తే ఇంట్లోకి రానివ్వలేదు.

ఆరోగ్యం అత్తగారిని తీసేస్తే - ఆమె భద్రాచలాన్ని ఈసడింపుగా చూసింది. నిస్సహాయంగా ఉండిపోయాడు భద్రాచలం.

రాహుల్ పుట్టాడు.

చక్కనమ్మ చిక్కినా అందమే అన్నట్టు కమలకుమారి మరింత చక్కగా కనిపించసాగింది.

ఆమె పురిటినుంచి కోలుకోకుండానే - జ్యోతి కడుపున పడింది.

కమలకుమారి మాటామంతీ లేకుండా తయారయింది.

'ఏంటమ్మా - మీ మద్దిన తగవూ - ?'' అని కోడలిని ఎన్నోమార్లు అడిగాడు.

ఆమె - ఏమీలేదని - నవ్వేసేది.

అడగగా అడగగా ఒకమారు ఎంతో ఆలోచించి జవాబిచ్చింది.

"మా పుట్టుకలు మామయ్యా-"

"అంటే ఏటి తల్లీ-"

"మా పుట్టుకలు మేం మరిచిపోలేకపోవటం- ఈ దేశంలో ఎవ్వరూ వ్యక్తులు కాకపోవటం-"

"బోదపట్టం లేదు తల్లీ-"

"-ఇక్కడ గర్భస్థ శిశువు కూడా కులాల అంపశయ్య మీద నేరుగా పడతాడు. ఆ అంపశయ్య మీదే ఎదుగుతాడు. కులభావాల బాణాలు గుచ్చుకుంటూండగానే అతను లోకాన్ని చూస్తాడు. ఒకటి బాణమన్న స్పృహ ఎప్పుడయినా కలిగి, దాన్ని తొలగించుకోబోతే మరోపక్క ఒత్తిడి పెరుగుతుంది. మరో బాణం మరింత లోతుగా దిగుతుంది. ఇక్కడ మంచితనాలూ, చెడ్డతనాలూ; ప్రేమలూ, ద్వేషాలూ; ఆనందాలూ, విషాదాలూ; హాస్యాలూ, అపహాస్యాలూ - ప్రతీ ఒక్కటీ కులభావాల బాణాల మీదే! ఇదే ఇక్కడ జీవితం - ఇదే ఇక్కడ మృత్యువు - ఇదే మా కాంప్లెక్సులకి మూలం! దైహిక పవిత్రత

అనే నిరాకార భూతం చేతిలో కీలుబొమ్మల్లా ఆడే దురదృష్టవంతుల సమూహంలో - మేం - ఒక అణువులం!"

భద్రాచలానికి కోడలు మాటలు అర్థం కాలేదు. దురదృష్టవంతులం అన్నమాట మాత్రం అర్థమైంది.

జ్యోతి పుట్టింది.

బిడ్డకు ఏడాది గడిచేసరికి - కమలకుమారి ఆత్మహత్య చేసుకుంది. డాక్టరు ఇచ్చిన నిద్రమాత్రలనే మింగి, నిద్రలోనే ప్రాణాలు విడిచింది. ఆమె చనిపోతూ ఓ నోట్ విడిచిపెట్టింది.

"- నా మృతికి నా భర్తతో సహా ఎవ్వరూ బాధ్యులు కారు. దీనికి బాధ్యులయిన వారు ఈ హిందూ సంస్కృతి నిర్మాతలు. వందలాది సంవత్సరాల వెనక్కి వెళ్ళి - జరిగిన పొరబాట్లను సరిదిద్దటం ఎవరితరం? జీవితంలో అశాంతిని ఇద్దరం కలిసి తవ్వి పోరబోద్దామనుకున్నాం. ఒకరిమీద ఒకరం పోసుకున్నాం! దీన్ని భరించే సమర్థతా, శక్తి నాకు లేకపోయాయి. చావులోనన్నా శాంతి దొరుకుతుందేమోనన్న ఆశతో, నా బిడ్డలపట్ల, భర్తపట్ల బాధ్యతలు కూడా మరచి - స్వార్థపరురాలిగా వెళ్ళిపోతున్నాను-"

ఆ రోజుల్లో ఆరోగ్యమూర్తి పడిన దుఃఖం భద్రాచలానికి ఒక్కో రాత్రివేళ గుర్తుకొస్తూంటుంది.

ఏడాది రెండేళ్ళ పిల్లలతో ఆడ దిక్కులేని ఇంట్లో పిచ్చివాడిలా మారిపోయిన కొడుకుతో భద్రాచలం ఎలానెగ్గుకొచ్చాడో అతనికే అయోమయంగా ఉంటుంది.

వివాహం కేవలం వ్యక్తిగతం అన్న ఆరోగ్యమూర్తిని వదలలేదు అతని ప్రత్యర్థులు. కమలకుమారి మరణాన్ని అన్ని విధాలా వాడుకోటానికి, అతన్ని దెబ్బతీయటానికి ప్రయత్నించారు.

ఆ ప్రయత్నాలతో - ఆరోగ్యమూర్తి కసిగా కోలుకున్నాడు. అతను మరింతగా తన రాజకీయ శక్తులను కూడదీసుకున్నాడు. రాజ్యం మొత్తం న్యాయాంగవ్యవస్థ పేరుతో వ్యక్తికి ఎదురుగా నిలబడితే - ఆ వ్యక్తికి మిగిలిన ఏకైకమార్గం జనబలసమీకరణ. ఆ పనే చేశాడు ఆరోగ్యం.

ఆ రోజులలో రాత్రివేళ నిశ్శబ్దంలో తాగుడులో తన దుఃఖాలను మరిచిపోయే ప్రయత్నం చేశాడు. తాగి, తాగి తండ్రి ఒడిలో పడుకుని 'నా కమలను నేనే చంపుకున్నాను నాన్నా-' అని విలపించేవాడు.

ఆ తర్వాత మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు, ఆరోగ్యం. అప్పచెల్లెళ్ళు, ఆత్మీయులూ ఎందరో ప్రయత్నాలు చేశారు. మరో స్త్రీ అతని జీవితంలోకి రాలేదు.

పిల్లలు ఇద్దరిని ప్రాణప్రదంగా పెంచుకున్నాడు ఆరోగ్యం.

భద్రాచలం తమ పూర్వీకుల విషయాలను కథలు కథలుగా చెపుతూ మనవలను పెంచి పెద్ద చేశాడు.

వాళ్ళిద్దరూ తండ్రి చురుకుదనాన్ని పుణికి పుచ్చుకున్నారు.

ఆరోగ్యం వృత్తిలో ఎదిగినట్టే, దళిత నాయకునిగా కూడా ఎదిగాడు. అతని కార్యకలాపాలు సాగుతూనే ఉన్నాయి. అతని వెనక తిరిగే వాళ్ళ సంఖ్య పెరుగుతోంది.

అతని ప్రత్యర్థులు కూడా పెరిగారు - ఇంత ఇల్లు ఎలా కట్టాడు? ఇన్ని ఆస్తులు ఎలా వచ్చాయి? - వంటి ప్రశ్నలతో పేపర్లు నింపారు.

ఆరోగ్యమూర్తి చుట్టూ లాబీలు ఏర్పడ్డాయి.

లాబీలలో ఆరోగ్యమూర్తి కలిశాడు.

రాహుల్ కవి. అతని చుట్టూ గట్టి స్నేహాలు. వాళ్ళలో తన తండ్రిపట్ల విమర్శలు చేసినప్పుడు అతనికి చాలా కష్టం అనిపించింది. అతని తండ్రి ఉపన్యాసాలలో మొనాటినీ ప్రవేశించిందని, అవి రికార్డులా ఉంటున్నాయని అన్నప్పుడు శ్రద్ధగా పరిశీలించాడు.

పదోన్నతి, విదేశీ పర్యటనలు, సన్మానాలు - రాజకీయ ప్రాబల్యాలు...తండ్రి చుట్టూ ఆక్టోపస్‌లా వ్యాపించుకున్నట్టు రాహుల్‌కి స్పష్టాస్పష్టంగా కనిపించింది.

మనిషి, తనకు తను చేసుకోటంకన్నా - సమాజానికి చేయటాన్ని ఘనంగా భావించే వయసులో ఉన్నాడు రాహుల్.

'దళితులలో ఒక వ్యక్తి ఎదుగుదల - దళితుల ఎదుగుదలే' అన్న భావన మీదే ఇంతవరకూ అన్ని రకాల భావజాలాల వాళ్ళూ ప్రయత్నించారు. ఆ భావనకీ-నెలకో  కోటీశ్వరుడిని తయారు చేస్తాం అనే లాటరీలకీ - తేడా ఏమిటి?-' అని కూడా ప్రశ్నించుకున్నాడు రాహుల్.

'ఏ రకంగా ఆలోచించినా - ఏ ప్రయత్నం చేసినా - దళితుల అభివృద్ధి - కొందరు దళితుల అభివృద్ధిగా మాత్రమే ఎందుకు దారితీస్తోంది?' అని ఆలోచించాడు రాహుల్.

ఆ యువకునికి జీవితం పెద్ద అసంబద్ధంగా కనిపించసాగింది. అతని కవిత్వంలో గత దుఃఖాల మీద, అవమానాల మీద ఎంత భావావేశం ఉందో - ఇంచుమించు అంతా వర్తమాన భావదారిద్ర్యం మీద, లక్ష్యరాహిత్యం మీదా పొంగింది. మొదట కవిత్వంలో స్పష్టత వల్ల అతనికి వచ్చిన పేరు, రెండవ రకం వస్తువులలో అస్పష్టత, అయోమయాల వల్ల - రాలేదు.

లోకంలో అసహ్యించుకోవలసినవి కనిపించినంతగా - ఆదరించవలసినవి కనిపించలేదు.

దానాదీనా - రాహుల్‌కి తండ్రి పట్ల ఎంతటి ప్రేమ ఉందో - ఎంతటి ఆరాధన ఉందో అది వ్యక్తం కాకపోగా - అతని వైమనస్యం తరచు వాదనల రూపంలో వ్యక్తం కాసాగింది.

తన స్వంత వస్తువును ఎవరో ఏదో అంటే - దాన్ని సహించలేక తనే తప్పుబట్టే స్థితిలో రాహుల్ ఉన్నాడన్న విషయం భద్రాచలానికి అర్థమవలేదు.

ఒక రోజు-

తండ్రీ కొడుకులు ఇద్దరూ ఏదో అనుకుంటున్నారు. భద్రాచలం వింటూనే ఉన్నాడు.

'నీకు లోకానుభవం లేదు. మెచ్యూరిటీ లేదు. జీవితంలో నేను పడిన కష్టాలు నువ్వు పడలేదు. నేను చేసిన యుద్ధాలు నువ్వు చేయలేదు. కనుక - నేను నీకు అర్థంకాను. ఆదలా వదిలెయ్ - నీ పనులకు నేను అడ్డుతగుల్తున్నానా- నచ్చినా, నచ్చకపోయినా నువ్వు నీ అనుభవంతోనే నేర్చుకోవాలనుకుంటున్నావు - నా పనులకు నువ్వు అడ్డు తగలొద్దు - విమర్శించవద్దు-'

"నువ్వేది చేసినా విమర్శించరాదా? నువ్వు చేస్తున్నవన్నీ కరెక్టే అనుకోవాలా- చెప్పు డాడీ-"

"......"

"నన్ను కన్విన్స్ చెయ్యి డాడీ - నా డౌట్స్ క్లారిఫై చెయ్యిడాడీ-"

"సంజాయిషీ ఇచ్చుకోవాల్సిన అవసరం నాకు లేదు. నీ పనులకు నేను సంజాయిషీ అడుగుతున్నానా?"

తండ్రి వంక చూస్తూంటే అందమైన ఆ యువకుని మొహం జేవురించింది. పెదాలు ఆవేశంతో కంపించాయి.

"నువ్వు అడ్డురావు - ఎందుకొస్తావు - రావు-" అన్నాడు.

"ఏంటి - ఏంటోయ్ నువ్వనేది?"

"వైస్ ఛాన్సలర్ పోస్టు - అందుకూ - అందుకూ - ఏమో ! మా పనుల వల్ల నీకు లాభం రావచ్చు-"

"గెటవుట్ - నీ మొహం నాకు చూపించకు-"

దెబ్బతిన్న పక్షిలా ఆరోగ్యం కదిలిపోయాడు. కొడుకు కదలకపోవటంతో - నెమ్మదిగా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

భద్రాచలం కొడుకు వెళ్ళిపోటం చూసి, అతని గదిలోకి వెళ్ళాడు. రాహుల్ తండ్రి ఫోటోని నిశితంగా చూస్తూ నిలబడి ఉన్నాడు. మనవడి భుజం మీద చెయ్యేశాడు-

తాత వేపు తిరిగాడు. ఆ యువకుని కళ్ళ నిండా బాధ - అంతకు మించిన ఆవేశం.

"ఏంట్రా అబ్బీ - మీ అయ్యతో గొడవా?"

"పతనం - పతనం - పతనం" అన్నాడు రాహుల్.

"అంటే-?"

తాత కళ్ళలోకి చూశాడు రాహుల్.

ఆ వృద్ధుని చేయి పట్టుకుని- హాల్లోకి తీసుకువెళ్ళి - అతని ఫోటో ముందు నించోబెట్టాడు.

"ఆ ఫోటో చూస్తే నీకేమనిపిస్తోంది తాతా!"

"మీ అయ్యకి నా మీద సానా అభిమానం రా-"

"నిన్నటి దాకా నేనూ అదే అనుకున్నాను-

ఇప్పుడు నిజమేంటో అర్థమవుతూంది - అదో ఫోజు! ఎగ్జిబిషన్! ప్రదర్శన ఈ హాల్లో చేరే దొంగనాకొడుకులందరూ - నీ కొడుకు నిరాడంబరానికి - గ్లాసులు గుద్దుకుని - ఛీర్స్ చెప్పాలని-"

"ఛ! అయ్యేం మాటల్రా రాహుల్!"

"నీ కొడుకు సంగతి నీకేం తెలుసు తాతా! మొన్నటి దాకా ఆ పెద్ద మనిషికి -తను - మాల - అని చెప్పుకోటం అసహ్యం! తండ్రి కష్టపడి పెంచి పెద్దాడిని చేశాడని చెప్పుకోటం ఇష్టం-! ఈయన మొహం తిప్పగానే-తిట్టుకునే-దొంగలంజా కొడుకుల చప్పట్లు ఈయనకి కావాలి. వాళ్ళని తీసుకొచ్చి - తన చేతుల్తో మందు సరాఫరా చేసి - వాళ్ళని రాసుకు పూసుకు తిరగటంలో ఈ మహానుభావుడికి ఏదో శాంతి - ఆనందం...! అదీ ఆయన కాంప్లెక్సు-! అదీ ఆయన గొప్పవాడనిపించుకోటానికి - ఎంచుకున్న మార్గం! ఆ నా కొడుకులు ఏం చేస్తారో తెలుసా - ఇళ్ళకు వెళ్ళాక శుభ్రంగా స్నానం చేసి బట్టలు తడుపుకుంటారు-"

"అలా అనకురా అబ్బీ - జనం మారారు-"

"మారలేదు - మారరు - మనం అస్పృశ్యులమనే కాన్షస్‌లో ఉన్నప్పుడు - ప్రతీ నా కొడుకు మన మీద ఎక్కుతాడు - డాడీలాంటోళ్ళు స్వంత జీవితంలో ప్రమోషన్లూ...అందుకోసం పైరవీలూ...ఆశయాల తాకట్టూ....తాతా! వీళ్ళు అస్పృశ్యతను ఎలాగోలా అమలుచేస్తూనే ఉంటారు- మనం ఇలా ఉన్నంత కాలం-"

"నాకేం తెలటం లేదురా-"

"నీ కొడుక్కే తెలవదు - కులాలు ఓ వాస్తవం. అవి ఉన్నంతకాలం - ఎవడి కులానికి వాడు గర్వపడాల్సిందే! నేను - రాహుల్‌మాల - అని అందుకే రాసుకుంటున్నాను. నా కులం - గత చరిత్ర - ప్రత్యేక సంస్కృతీ - ఈ సమాజ నిర్మాణంలో దాని పాత్ర - ఫలితాలను చేజిక్కించుకుని మనలను అణగదొక్కిన

వారి పన్నాగాలూ - ప్రతీ ఒక్కటీ వెలికి తీసే 'పవిత్ర' ఉద్యమం మాది. దీనివల్ల లాభాలు తనలాంటి వాళ్ళకి దక్కితే - అందుకోసం నీ కొడుకులాంటి హిపోక్రాట్స్ ఈ రోజు 'మాల' అనిపించుకోజూస్తే - అది...అది...''రాహుల్ మాటలు ఆవేశంతో ఆగిపోయాయి.

ఒక్కమారుగా ఆ యువకునిలో దుఃఖం ఉప్పెనలా పొంగింది.

"మనకి సొంత భాష..లేదు. సొంత సంస్కృతి...లేదు. సొంత...చరిత్ర లేదు...ఈనాడు సొంత జీవిత లక్ష్యాలు కూడా కనిపించటం లేదు. వాటికోసమే మాతరం వెదుకులాట! వాటి నిర్మాణానికే మా ప్రయత్నాలు-'' అన్నాడు గొణుక్కుంటున్నట్టు.

భద్రాచలం అనంకల్పితంగా మనవడి భుజంమీద చెయ్యేశాడు. ఆర్ద్రమయిన కళ్ళతో తాత చేతిని పట్టుకుని-

"చెప్పు తాతా - మానవ స్పర్శకీ - మాల స్పర్శకీ తేడా ఏమిటో-!!'' అన్నాడు.

నెమ్మదిగా రాహుల్ వీపు మీద రాస్తూ - కొంతసేపయ్యాక - మెల్లగా అన్నాడు.

"నువ్వేటంటున్నావో - ఏటో! ఎన్ని సెప్పినా - మీ అయ్య చిన్నప్పుడైనా నన్ను తీసిపారెయ్య లేదురా - తప్పురా మనవడా!'' అన్నాడు అనునయంగా.

"అవునవును - తప్పే - ఎందుక్కాదు?'' అంటూ ఆగి-

"అవున్తాతా - మనోళ్ళు చిన్నా పెద్దా అందరూ కలిపి తాగేవారని చెప్పేవాడివిగదా - అలాంటి పనులు బ్రాహ్మలు చేస్తారా?''

"ఛా! మనం చేసే చిన్న పనులు - ఆళ్ళెందుకు సేస్తారు - ఆళ్ళు పెద్దోళ్ళు-''

"అదీ - అదీ నీ బుర్రలో ఉన్నది - ఇదీ - నీలో వాళ్ళు ఎక్కించినది. ఏరా - ఏమోయ్ - నువ్వు - మీరు - తమరు - ఎదుటివాడిని ఉద్దేశించి మాట్లాట్టానికే ఇన్ని పదాలు. ఇన్ని పదాలు సృష్టించి - నోరు విప్పటంతోనే - ఎదుటి వాడికీ తనకీ మధ్య హోదాల్లో తేడాను గుర్తుచేసే - వీలుని భాషలో తయారు చేసుకున్న విలక్షణ సంస్కృతి - ఆ కులాలది. తండ్రి కళ్ళలోకి కొడుకు చూస్తూ మాట్లాడకూడదు. మొగుడి కళ్ళలోకి పెళ్ళాం చూస్తేనే తప్పు - అవీ వాళ్ళ రూల్స్. నిజమేనయ్యా - అని మనం ఒప్పేసుకుంటాం! అసలు వాళ్ళు తయారు చేసిన గ్రేడ్స్‌కి ఆధారం ఏంటో తెలుసా - స్పర్శ - ముట్టుకోడం! అబ్బా - ఎంత తక్కువ మందిని ముట్టుకుంటే అంతగొప్ప - వాడిదంత పెద్ద కులం- అంతెందుకు- వాడి ముడ్డిని తప్ప మరో మనిషిని ముట్టుకోనోడే మహామహామహా పవిత్రుడు.'' అసహనంగా అన్నాడు రాహుల్.

తను తప్పన్న దానికీ - మనవడు చెపుతున్న దానికీ సంబంధమేంటో భద్రాచలానికి అర్థంకాలేదు.

"ఏంటో - ఈ కుర్రాళ్ళ గోల...." అనుకున్నాడు.

ఆ విషయం కొడుకుతో మాట్లాడబోయాడు.

"నా రాత" అన్నట్టు తల కొట్టుకున్నాడు ఆరోగ్యం.

☆ ☆ ☆

ఆనాటి ఆరోగ్యాన్ని తలుచుకుని అనుకున్నాడు భద్రాచలం. 'వాడి రాత కాకపోతే ఏమిటి? - ఎంత ప్రేమగా పెంచాడు. అడిగింది అడిగినట్లు తెచ్చి ఇచ్చాడు. వాడు బిడ్డలకి చేసిన దాన్లో లక్షోవంతు చెయ్యలేదు నేను! అయినప్పటికీ వాడికి నా మీదున్న గౌరవం - వాడి పిల్లలకి లేదు - చివరకు కూతురు కూడా ఎంత ఎదిరించి మాట్లాడుతుంది!' - అనుకున్నాడు భద్రాచలం.

నిజానికి-

జ్యోతికి తండ్రి మీద అంతులేనంత ప్రేమ. ఆరాధన. డాడీ - డాడీ - అంటూ ఒక్క నిమిషం వదలకుండా తిరుగుతుంది. తండ్రి అవసరాలన్నీ తనే చూసుకుంటోంది. మందులన్నీ తనే మింగిస్తుంది. తాగొద్దనీ, తగ్గించమనీ పోట్లాడుతూనే ఉంటుంది.

ఇవన్నీ భద్రాచలానికి తెలియవుగానీ, చీటికీ మాటికీ ఆ పిల్ల తండ్రితో - నువ్వు ఎమ్‌సీపీవి - అనీ ఇంకా ఏమేమో అనడం - అవి విని ఆరోగ్యం నవ్వుతూండటం - కాస్త విడ్డూరంగా ఉంటూంది.

ఓ రోజు - భద్రాచలానికి బాగా గుర్తు - హాల్లో ఉన్న తన ఫోటో గురించి తండ్రితో జ్యోతి తగువు.

"-నువ్వు తాత ఫోటో పెట్టావు - నానమ్మ ఫోటో ఎందుకు పెట్టలేదు?"

"ఎందుకు పెట్టలేదంటావు?" అన్నాడు.

"ఎందుకంటే ఎందుకంటే"

"మా అమ్మంటే నాకు ఇష్టం లేదంటావు"

"ఇష్టంలేక కాదు. దృష్టి మగదృష్టి ఆడది కదా- నానమ్మ పడిన కష్టాలు - కష్టాలుగా కనిపించవు - మగాడు కదా - తాతయ్య పడ్డ కష్టాలే - కష్టాలు-"

"అలాంటిదేం లేదు నాన్నా!"

"అదే అవును తండ్రీ! ఎక్కువ కష్టాలు పడ్డది నాన్నమ్మే! తాతవి కులం కష్టాలూ, ధనం కష్టాలే! ఆ రెంటితో బాటూ నానమ్మ - మీ తండ్రి పెట్టిన కష్టాలు భరించింది - మన కులంలో పుట్టడం వల్ల - పేద తనంలో పుట్టడం వల్ల - ఆడదానిగా ఆవిడ పడిన కష్టాల ముందు తాత పడినవేపాటి? - అసలు ఆవిడ కష్టాలే - కష్టాలు-" అంది.

ఆరోగ్యం కూతురు నెత్తిమీద చిన్నగా మొట్టాడు.

"తల్లిగాడూ - నువ్వు ఫెమినిస్టువి. నీతో నేనేం వాదించగలను గాని - కష్టాలు వేరుగా ఉన్నా పరిష్కారాలు వేరుగా ఉండవురా."

"నేను అంగీకరించను. ఈనాడు ఎవ్వరూ అంగీకరించరు." అంది జ్యోతి.

ఏంటో! నవ్వుతూ మాట్లాడినా - ఆడపిల్ల అలా ఎదిరించితే తండ్రికి ఎంత కష్టంగా ఉంటుంది! అనుకున్నాడు భద్రాచలం.

కొడుకు విన్నాడనీ - విని, తన కొడుకుని మందలించలేదనీ - బాధేగాని, నిజంగా వాడేమయినా అంటేవినే పిల్లలేనా వీళ్ళు!!

భద్రాచలానికి ఆ ఆలోచనతో కొడుకు మీద కోపం పూర్తిగా పోయింది. ఎవరూ ఏమీ అనకపోయినా - అనలేకపోయినా మనవడు తొక్కుతున్న దోవ సరయినదేనా? ఎంతో తెలివిగా మాట్లాడుతాడు రాహుల్. ఈ రోజు వాడు చేస్తున్నదేమిటి?

ప్రస్తుతం మీద నిలిచింది భద్రాచలం మనసు.

రెండు రోజుల క్రితం - ఇమ్మాన్యుయేల్‌ని చూద్దామని వెళ్ళాడు భద్రాచలం. అతను కొన్నాళ్ళుగా మంచం మీద ఉన్నాడు. మాటపడిపోయింది. అన్నీ మంచం మీదే! కోడళ్ళు ఎంతో సేవ చేస్తున్నారు - భద్రాచలాన్ని చూడగానే ఇమ్మాన్యుయేల్ మొహంలో ఎంతో వెలుగు వచ్చింది. కళ్ళలో నీళ్ళు ఊరాయి. భద్రాచలంతో ఏదో చెప్పబోయాడు. నోరు విడలేదు. స్నేహితుని చేతిని చేతిలోకి తీసుకుని పట్టుకుని కూర్చున్నాడు. అలాగే నిద్రపోయాడు.

భద్రాచలం బయలుదేరుతూంటే పాల్ దిగబెట్టి వస్తానని బయలుదేరాడు. అతను ఇమ్మాన్యుయేల్ పెద్ద కొడుకు కొడుకు. పాల్ తండ్రి సిలువయ్య - 'ఎందుకురా - నే వెళ్తానులే -' అంటుంటే -'అక్కర్లేదు - నేనే వెళ్తాను-' అన్నాడు పాల్.

అదంతా తన మీద ప్రేమా, గౌరవంఅనుకున్నాడు భద్రాచలం.

కొంతదూరం నడిచాక-

"చూడుతాతా - నీ మీద నాకింకా మరేద ఉంది. అందుకే చెపుతున్నాను. నువ్వింక మా ఇంటికి రాకు-" అన్నాడు పాల్.

అనుకోని ఆ మాటకి అవాక్కయిపోయాడు భద్రాచలం.

"నేను ప్రభుదాసు మాష్టారి అమ్మాయిని పెళ్ళి చేసుకుంటున్నాను. మాష్టారు-మాలట, మా నాన్న మాదిగట-అందుకని మా పెళ్ళి జరగటానికి వీల్లేదుట. నాకాబోయే బామ్మర్ది మీ మనవడికి ఫ్రెండ్. వెళ్ళి వాడి కాళ్ళు పట్టుకున్నాట్ట. నీ మనవడు వాడికి - పెద్ద హీరోలా - ఈ పెళ్ళి జరగనివ్వమని మాట ఇచ్చాట్ట.

ఇక్కడ ఎవరూ గాజులు తొడిగించుకుని కూర్చోలేదు - తిన్నగా ఉండకపోతే నీ మనవడి పుచ్చె లేచిపోతుంది - జాగ్రత్త-" అన్నాడు పాల్.

"ఇవన్నీ నాకు తెలియవురా పాలూ-" అన్నాడు.

"ఇక్కడెవరూ చెవిలో పువ్వెట్టుకు కూర్చోలేదు - నమ్మడానికి. నీ మనవడూ, నీ కొడుకూ - నువ్వూ అంతా ఒకటే! వాళ్ళిద్దరూ నన్ను నరుకుతానంటూంటే - నువ్వొచ్చి నంగిరి నంగిరి కబుర్లు చెబుతున్నావు" అన్నాడు మరింత అసహనంగా.

పాల్ మాటల్తో మండిపోయింది భద్రాచలానికి- "నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసా!" అన్నాడు.

"ఎందుకు తెలియదూ - నీ కొడుకు ప్రొఫెసర్. లంకంత బంగ్లా కట్టించాడు. - నీ మనవడు కవి - పైరవీలు చేసి ప్రైజులు సంపాదించుకుంటాడు - మీ బ్రతుకులు ఎవడికి తెలవ్వు? మా పేరు చెప్పి - ఇన్నాళ్ళూ - సంపాదించుకుని ఈ రోజు మేం కళ్ళు తెరిస్తే - ఏడ్చుకుంటున్నారు! పోరా ముసిల్నాయాలా?" అనేసి వెళ్ళిపోయాడు పాల్.

పట్టరాని ఆవేశం వచ్చింది. 'ఈనా కొడుక్కి - ఇంత గర్రానా?' అనుకున్నాడు. ఆటో ఎక్కి ఇంటికి చేరుకున్నాడు. ఆ రోజంతా భద్రాచలం ఇంట్లో ఎవరితోనూ కలివిడిగా లేడు.

తాతలో తేడా జ్యోతి గమనించింది.

"ఏమయింది తాతా - ఏమయింది?" అని అడిగింది పదే పదే!

చెప్పాడు భద్రాచలం-

"నన్ను అన్నాడని కోపం వచ్చిందిగాని జ్యోతమ్మా - ఈ మాల మాదిగ తగువులేటో. నీ అన్న ఆలోసన ఏటో - నాకు బోదపడటం లేదమ్మా-"

"ఈ మగాళ్ళకి ఏదో గొడవలుండాలి గాబోలు-" అంది.

"పాపం - ఆ మాష్టారి అమ్మాయి తెలుసా!" అన్నాడు.

"నాకేం తెలీదు - ఆ అమ్మాయి మాతోనూ ఉండదు - ఉంటే ఈ పెళ్ళి మేమే చేసేద్దుం-"అంది జ్యోతి.

"ఇప్పుడయితే ఏంటమ్మా - నువ్వు మీ అన్నకి చెప్పొచ్చుగా!"

"వాడి గొడవలు నాకెందుకు లెద్దూ- అంది. అయినా - నిన్నూ - నాన్ననీ కూడా తిట్టిన ఆ పాల్‌గాడి పట్ల నీకు జాలెందుకు - ఏమీ ఆలోచించక పడుకో" అంది.

అన్నప్పటికీ - నాకెందుకులే అనుకున్నప్పటికీ - భద్రాచలం మనసు ఆగలేదు.

పొద్దుట లేస్తూనే - కొడుకు గదిలోకి వెళ్ళి నిలదీశాడు-

"నిజమేరా - ఇదీ -!!" అని జరిగిందంతా చెప్పాడు.

"అందుకే చెప్పాను - వాళ్ళింటికి వెళ్ళొద్దని - ఎవరికైనా లోకువే అవుతాం. అక్కడితో సరిపెట్టాడు - వాడి సంగతి నేను చూసుకుంటాన్లే-"

"నేనడిగిందేంటి? నువ్వు చెప్పేదేంటి? దళితులందరూ ఒకటై నిలబడాలని నువ్విన్నాళ్ళూ దంచిన ఉపన్యాసాలేమిటి?" అన్నాడు.

"నాన్నా - రోజులు మారాయి. మనమూ మారాలి - అంతే! వాళ్ళెలాగూ మనలని రానివ్వరు - మనవాళ్ళని కూడా వదులుకుంటే - ఎలా? నువ్వివన్నీ మర్చిపో- నాకు పనుంది-" అన్నాడు.

"ఏంట్రా పని? వాళ్ళూ, వీళ్ళూ తన్నుకుంటే - నరుక్కుంటే - కనీసం నీ కొడుకు గురించయినా ఆలోచించవేంరా?"

"కంగారు పడకు! రాహుల్ ఒంటిమీద చెయ్యిపడదు-" అన్నాడు.

విస్తుపోయాడు భద్రాచలం.

మనవడు తీసి పారేస్తాడేమోనన్న సంశయంతో- చాలా తటపటాయించాడు భద్రాచలం. కాని అడగకుండా ఉండలేకపోయాడు - జరిగిందంతా చెప్పకుండా ఆరా తీయబోయాడు!

"అయితే ఆ పాల్‌గాడొచ్చి నీ కాళ్ళు పట్టుకున్నాడన్న మాట!" అన్నాడు.

"అయితే ఈ గొడవ నిజమేనన్న మాట-"

"ఏమో! నాకు తెలవదు-"మొహం తప్పించబోయాడు. తాతని తప్పించుకుని వెళ్ళిపోయాడు.

ఏడుగంటల వేళ-

మనవడూ, అతని స్నేహితులూ అతని గదిలోచేరి తలుపులు బిగించుకున్నారు. తలుపులు మూసుకుంటే భద్రాచలానికి మరింత అనుమానం వచ్చింది. 'నాకెందుకులే -' అనుకోబోయాడు. కాని - ఆ వృద్ధుడు నిలవలేకపోయాడు.

వెళ్ళి గది తలుపులు తట్టాడు - తీశారు.

లోపల పది మంది దాకా ఉన్నారు. అందరూ రాహుల్ ఈడే! ప్రతి వాళ్ళలోనూ ఏదో సాధిద్దామన్న ఉత్తేజం-

"ఏం కావాలి తాతా?"- అన్నాడు రాహుల్ దగ్గరకి వచ్చి.

"వీళ్ళంతా ఎవరు?"

"నా ఫ్రెండ్స్ - మా తాత" అన్నాడు వాళ్ళ వేపు తిరిగి. అందరూ లేచి, నమస్కారాలు చేశారు. భద్రాచలం అదేమీ పట్టించుకోకుండా మనవడిని నేరుగా అడిగాడు.

"వీళ్ళంతా - పాల్ పెళ్ళి ఆపటానికి వచ్చిన వాళ్ళేనా?"

"పాలా?" అన్నాడు ఒకతను.

"అదేసార్ - ఆ మాదిగాడు -" జవాబు ఇచ్చాడు ఇంకొకతను.

"తాతా - మేమేదో మాట్లాడుకుంటున్నాం - నువ్వు వెళ్ళు-" అన్నాడు రాహుల్.

అతని భుజం మీద చెయ్యేసి ఆపి- "మీ తాతగారేగదా - వింటే ఆయనే కర్ర పుచ్చుకుని మన ముందు నడుస్తాడు" అని ఓ కుర్రాడు - భద్రాచలం వైపు తిరిగి - "తాతగారూ - మన మాలాళ్ళ పిల్లని - మాదిగోడు పెళ్ళాట్టం ఎప్పుడైనా జరిగిందా - వింటే రక్తం మరగటంలేదూ?" అన్నాడు.

"ఏం? మాలాళ్ళ కుర్రాడు మాదిగాళ్ళ పిల్లను పెళ్ళాడొచ్చా?"

ఊహించని ఆ గొంతుకకి, ఆ ప్రశ్నకీ ఆ కుర్రాడు తడబడ్డాడు-

"అది..అదీ తప్పేగాని తాతగారూ-"

"మా తాత చిన్నపాటి కమ్యూనిస్టులే! అలాగే మాట్లాడతాడు. నువ్వు పద తాతా-" అంటూ రెక్క పట్టుకున్నాడు.

భద్రాచలం విదిలించుకుంటూంటే-

"చెపుతున్నానా - నీకు అక్కర్లేని గొడవల్లోకి రాకు-" అన్నాడు.

"అవున్రా - నా మనవడివి - ఇంట్లో మనిషివి - నీ గొడవలు నాకు అక్కర్లేనివి - ఊళ్ళో గొడవలన్నీ - నీక్కావలసినవి-"అన్నాడు.

"అయితే - ఏంటంటావ్-"అన్నాడు.

"మాలలనీ, మాదిగలనీ మనలో మనం తన్నుకోకూడదంటాను."

"అవును - నిజమే - ఈ దేశం వాళ్ళది - ఈ పార్టీలు వాళ్ళవి - ఈ యూనివర్సిటీలు వాళ్ళవి - ఉద్యోగాలన్నీ వాళ్ళవి - అంటూ వాళ్ళు మనని వేరు చేసి - తన్నడానికొస్తుంటే - ఏం చెయ్యమంటావు? అవును బాబూ - నిజమే సారూ - అని మనోళ్ళు ఉద్యోగాలు రిజైన్ చేసేసి వాళ్ళకి ఇవ్వాలా!" అన్నాడు రాహుల్.

భద్రాచలానికి ఏమనాలో అర్థం కాలేదు.

"ఈ పెళ్ళికీ - ఆ గొడవలకీ సంబంధం ఏంట్రా-" అన్నాడు బలహీనంగా.

"నీకు అర్థంకాదు - నువ్వు బయటికి వెళ్ళు-" అంటూ బయటకు తీసుకు వెళ్ళి గది తలుపులు వేసేశాడు.

పక్క గది గుమ్మంలో నించుని చూస్తున్న ఆరోగ్యం లోపలికి వెళ్ళిపోయాడు. వణుకుతున్న శరీరంతో - మూసిన గది తలుపుల వద్ద - నించుని ఉన్నాడు భద్రాచలం.

"ఏంటండీ - మీ తాతకేమయినా - పిచ్చా?" అంటున్నాడు ఒకతను.

"ఈ ముసిల్నాకొడుకు - మాదిగోళ్ళు మాదిగోళ్ళు - అంటూ వాళ్ళ వెనకాల ఏడుస్తాడేంటో-? అసలు వీడిని నాలుగు తంతే వాళ్ళు ఉచ్చోసుకుంటారు-" అంటున్నాడు రాహుల్.

☆ ☆ ☆

భద్రాచలం ఇసకలో అలాగే పడుకున్నాడు. మనసంతా అలవిమాలిన దుఃఖం. కొడుకు కలగజేసుకోలేదన్న కోపం - మనవడు తూలనాడాడన్న ఆవేశం అన్నీ పోయాయి. ఏం జరిగిందీ ప్రపంచానికి? విస్సినాదాలూ - చాత్రిబాబులూ, బ్రహ్మాలూ - అందరూ పోయారు. ఈ వేళో రేపో తనూ వెళ్ళిపోతాడు- అందాకా ఇదే ప్రపంచంలో ఇలాగే దుఃఖపడుతూ-

'తాతా! అన్న గొంతూ, చల్లని చెయ్యీ' ఆ వృద్ధుడిని తాకాయి. మెల్లగా కళ్ళు విప్పాడు. జ్యోతి - చల్లని చూపులు!

వణుకుతున్న చేతితో ఆమె చేయి పట్టుకున్నాడు. లేచి కూర్చున్నాడు.

"ఇంకా - ఈ ముసిలాడి మీద - నీ కయినా ప్రేముంది తల్లీ!"

"అందరికీ - నీ మీద ప్రేముంది - అదిగో నాన్న - లే! బయల్దేరు" అటు చూశాడు. అల్లంత దూరంలో ఆరోగ్యం-

భద్రాచలం కదలలేదు -

"నీ మీద ప్రేమకీ - నీ మాట ఒప్పుకోటానికీ సంబంధం లేదు తాతా! అన్నయ్య కూడా రోడ్డు మీద కారులో ఉన్నాడు-"

"ఒక్క మాట చెప్పు - మీ అన్న చేస్తున్నది రైటా? మీ నాన్న పట్టనట్టు ఊరుకోడం తప్పుగాదా?"

"ఇంటికెళ్ళి - మాట్లాడుకుందాం - పద తాతా! మంచూ, చలిగాలీ - జబ్బు చేస్తాయి-"

"లేదు - ఈ ఇసయం తేలితేగాని నేను - కదలను-"

జ్యోతి వాచి చూసుకుంది. పదవుతోంది.

"సరే! వాళ్ళు చేస్తున్నది తప్పేలే! బయల్దేరు-" అంది.

*('ఆంధ్రజ్యోతి' వారపత్రిక - నవంబర్, 1999)*

# రచయిత జీవితం, సాహిత్యం



ఛందోబద్ధ కవిత్వంతో సాహితీ సృజనను ఆరంభించి, తనకు అందివచ్చే ప్రక్రియ అదికాదు - వచనం అన్న సత్యాన్ని గుర్తించి ఆశాఖలో నిరంతరం శ్రమిస్తూ గుర్తింపు పొందిన కథారచయిత వివిన మూర్తి. పాలిటెక్నిక్ కోర్సులో కాయకష్టం కలగలిపిచేయాల్సిన ఉద్యోగాలెన్నో - వివిధ రాష్ట్ర ప్రభుత్వాల్లో నిర్వహించి, చివరకు భారతీయ నౌకాదళం క్వాలిటీ కంట్రోల్‌శాఖలో అధికారిగా ప్రస్తుతం బెంగుళూరులో ఉంటున్నారు వోలేటి వెంకట నర్సింహామూర్తి.

1948 మే 21న తూర్పుగోదావరి జిల్లా సఖుమళ్ల తిమ్మాపురం గ్రామంలో పుట్టి పెరిగిన వివిన మూర్తి పల్లెపట్టుల జీవనాడిని గ్రహించిన వ్యక్తి. అందువల్లనే - ప్రపంచీకరణం, అంతర్జాతీయ వ్యాపార సంబంధాల ఇనుప పిడికిళ్ళలో స్వచ్ఛమైన మానవ సంబంధాల వినాశనం పసిగట్టి తన రచనాయుధాన్ని ఎక్కుపెట్టిన రచయిత నర్సింహామూర్తి.

1976 ఉగాది ఆంధ్రజ్యోతిలో తన తొలి కథ 'రొట్టెముక్క' ప్రచురితం అయినప్పటినుండి ఇప్పటికి 98 కథలూ, 12 నవలలూ రాశారు. 'ప్రవాహం', 'దిశ' కథాసంపుటాలూ, 'వ్యాపారబంధాలు' నవలా వెలువరించారు. 'హంసగీతం' నవల వెలుగుచూడబోతోంది. ప్రసిద్ధ కథాసంపుటాలకు సంపాదకత్వం వహించిన వివిన మూర్తి కొత్తచూపు కలిగిన ఆలోచనాపరుడు. జీవితం పట్ల గౌరవమూ, సాహిత్యం పట్ల నిబద్ధతా వున్న ప్రగతిశీల రచయిత.